శ్రీ రామాయనమః

# శ్రీ హనుమత్ప్రబంధము

ద్వితీయ భాగము అయిదు ఆశ్వాసముల పద్య కావ్యము

సముద్రలంఘనము నుండి శ్రీరామ పట్టాభిషేకము వరకు

శ్రీహనుమంతుని చరిత్రము.



రచన

"కవిశేఖర" "భారతీప్రసన్న"

కొండేపూడి సుబ్బారావు

'ప్రసన్న భారతి' గ్రంథమాలా ప్రచురణ

47-10-5, ద్వారకానగర్, విశాఖపట్టణము - 530016

ఇండియా

# HANUMAT PRABANDHAMU

An epic in classical style poetry
Volume II , in five cantos

by

*"Kavisekhara ", "Bharati Prasanna "*

**KONDEPUDI SUBBA RAO**

47-10-5, Dwaraka Nagar,
VISAKHAPATNAM - 530 016 (India)
Ph : 0891 - 546531.

First Edition, 1998.
Copies - 1,000.

| | |
|---|---|
| Price | :Rs.35 |
| Overseas Price | :$ 5[00] |

**Typesetting at:**

SENA GRAPHICS,
Off : 47-11-3, Shop No.3
Dwarakanagar
Visakhapatnam, Ph :546016

**Printed at:**

RAMSHA-SIRIESHA PUBLICATIONS
SAMALKOT-533 440, Ph : (08852) 27474,27454

**Copies can be had from :**

The *Author (at the above address)
*Visalandhra Book House (All Branches)

శ్రీ వేంకటేశాయనమః

## కృతజ్ఞత

This Book is Published with the financial Assistance of

**SRI TIRUMALA TIRUPATHI DEVASTHANAMS**

Under their Scheme Aid to Publish Religious Books

My grateful thanks to them

ఈ గ్రంథము

శ్రీ శ్రీ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి

ద్రవ్య సహాయమున ముద్రితము

వారి ఆర్డరు నం. Edit / 5 / 630 / 98 dt. 11-6-98

వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు.

ఏ విభు కృపచే నీకృతి
కావిష్కృతి భాగ్యమబ్బె నాకరుణాళున్
శ్రీవేంకటగిరి వాసుని
భావంబున నిల్పి కొల్తు భక్తి దలిర్పన్.

గ్రంథకర్త



# శ్రీ హనుమత్ప్రబంధము

## ద్వితీయ భాగము

**విషయసూచిక** **పుటలు**

# భూమిక

శ్రీ హనుమత్ప్రబంధము రెండవ భాగము ఇది. సముద్ర లంఘనము నుండి శ్రీ రామపట్టాభిషేకము వరకు గల కథ యిందున్నది : పూర్వ కథ మొదటి భాగములోనున్నది- మూడవ భాగములో హనుమంతుని మహిమను గూర్చిన కథలు కొన్ని ఉన్నవి. క్రూర రాక్షసులను శిక్షించి ధర్మసంస్థాపన కొఱకు ధరణికి వచ్చిన శ్రీరామునికి సహాయార్థము వచ్చిన శివస్వరూపమే హనుమంతుడు. అధర్మమునణచుటకు ఆనాడంతటి శక్తి కావలసి వచ్చినది.

ఆంజనేయుడు భారతీయు లెల్లరకు ఆరాధ్య దైవము. ఆంధ్రులకు అభిమాన దేవతామూర్తి. ఈశ్వరాంశతో అంజనావాయువులకు జన్మించిన వరపుత్రుడు. సర్వదేవతామూర్తి, త్రిమూర్త్యాత్మకుడు, సర్వజన రక్షకుడు, అభయప్రదాత అని ఆ మహనీయుని ఎన్నియోరీతుల కీర్తింతురు ''ఆంజనేయ ''హనుమ'' అను నామములలో పరమాత్మ తత్త్వప్రకాశము కలదనియు ప్రతీతి. ఆయన చిరజీవి, భవిష్యద్బ్రహ్మ గూడ.

ఆంధ్రదేశములో ఎంత కుగ్రామమైనను నాలుగు బాటలు కలియుకూడలిలో ఉన్నతముగు ఆంజనేయ విగ్రహమును నిలిపి పూజలు సేయుదురు. అందరికిని అందుబాటులో నున్న దైవస్వరూపము హనుమంతుడు. ఆరూపమునందున్న ఆకర్షణ, మహిమ అట్టివి. ఆ దేవునికున్న గుణ గణములా! మఱియెక్కడను లేవని అనిపించును. నిరుపమాన ధైర్య బలసాహసములు వేదశాస్త్ర విద్యాభ్యాసము గురుభక్తి కార్యదీక్ష రాజనీతి ధుర్యత బ్రహ్మచర్యము మహాశౌర్యము పరోపకారము; మీదు మిక్కిలి ఆయన ప్రవర్తనయందు వ్రేలెత్తి చూపుటకు ఒక అణువైన దోషము కన్పింపని పవిత్రవర్తనుడు. మన దేవతావ్యవస్థలో ఒక విశిష్టరూపము ఆంజనేయుడు. అందుచేతనే విష్ణ్వంశసంభూతుడగు శ్రీరామునికి నమ్మిన వాడయినాడు. హనుమంతుని రామభక్తి అపారము. ఆయన జీవితము సర్వము రామమయము. శైవవైష్ణవ మాధ్వత్రిమతానుయాయులకు సమముగ ఆరాధనీయుడు హనుమంతుడు.

పుణ్యమూర్తులను స్మరించుట వారి చరిత్రములను వినుట చదువుట మనోవికాసము కలిగించి హృదయ నైర్మల్యము నొసగును. ఇందులకే మన జాతిలో ఆచారముగ వచ్చుచున్న పురాణ పారాయణము పురాణ శ్రవణము హరికథలు మున్నగునవి. వానరుడై జన్మించిన నేమి అన్ని విధముల దేవతలకన్న మిన్నయయిన దివ్య ప్రభావుడు ఆంజనేయుడు. కనుకనే విఘ్నేశ్వరునితో ప్రారంభించిన నిత్యదైవ ప్రార్థనలను ఆంజనేయుని స్తుతించిగాని పూర్తి చేయము. రాత్రులందు నిదురకు పోవుముందు హనుమంతుని స్మరింతుము. హనుమత్ స్తుతి సకలభయనివారకము, సకల ప్రయత్న విజయసాధకము. ఆదేవునిగుణములు, ఎన్నియుగములు చెల్లినను సమాజమునకాదర్శప్రాయములు శ్రేయోదాయకములయి విలసిల్లు చున్నవి. మఱియెన్ని యుగములైనను ఇట్లే విలసిల్లును.

ఈ యీ కారణములే ఈ హనుమత్ప్రబంధ కావ్యరచనకు నన్ను ప్రేరేపించినవి.

హనుమంతుని చరిత్ర విశేషములు అటునటునున్నవి సేకరించి వ్రాసితిని. శ్రీరాముని పట్టాభిషేకము వరకు హనుమంతుని చరితము ప్రథమ, ద్వితీయ భాగములలో నున్నది. సీతాదేవి యొద్ద హనుమంతుని ఆధ్యాత్మిక తత్త్వచర్చ, హనుమంతుడు చూపిన మహిమలు మూడవ భాగమున వచ్చును. ఈ కథలు చాలవరకు పరాశర సంహిత యందున్నవి. నిస్స్వార్థులయిన పూర్వమహాఋషులిట్లు మహనీయుల చరిత్రములను మానవ శ్రేయమునకై వ్రాసినవి కోకొల్లలు. నిజమునకు మన పురాణములన్నియు ఇహ పర పరమార్థప్రదములు జగద్ధితములు. పాశ్చాత్య నాగరికతా ప్రభావమున పడిన మన ఆధునికు లీసత్యమును గ్రహింపగలరని నా విశ్వాసము.

సర్వవిధముల ప్రయోజన ప్రదమగు శ్రీ ఆంజనేయుని చరిత్రము మనోరంజకముగ కావ్యరూపమున ఆంధ్రుల కందజేయవలయునను తలంపుతో ప్రారంభించిన కావ్యమిది. రెండు గ్రంథములు ఒకదాని వెనుక ఒకటి వ్రాయుచున్నప్పుడు పూర్తియయిన తర్వాతను పెద్దలకు విన్పించితిని. వారి ఆమోదము లభించినది. ప్రథమ భాగమునకు సమీక్ష ఆచార్య వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు వ్రాసిరి. ఈ రెండవ భాగమునకు ఆచార్య కె. మలయవాసిని గారు వ్రాసిన సమీక్షయు వేదాంత ప్రవచన శిరోమణి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామి వ్రాసిన భక్తి నివేదనము అను చక్కని వ్యాఖ్య లిందున్నవి. పెక్కు మంది విద్వత్కవులు వ్రాసినవి, పత్రికా సమీక్షలు, ప్రశంసలు కూడ వచ్చినవి. ఈ సాహితీ మూర్తులెల్లరకు నా హృదయపూర్వక వందనములు.

కలియుగ దైవము, సప్తగిరి సార్వభౌముడు ఆశ్రిత వత్సలుడు అగు శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థాన ధన సహాయము ఈ గ్రంధ ముద్రణకు లభించినది. ఆ స్వామికి ఆ దేవస్థాన అధికారులకు నా కృతజ్ఞతాభివందనములు.

మఱియొక మాట : నా సాహిత్య రచనలన్నింటికి తగిన ప్రోత్సాహము మొదటి నుండి ఇచ్చుచు, వ్రాత ప్రతులను చదువుచు ప్రూఫులు దిద్దుచు ఈ హనుమత్ప్రబంధ కావ్యమునకు ప్రత్యేక ఆదరణ చూపిన మా అమ్మాయి చి ॥ సౌ ॥ విద్యావతి, మా అల్లుడు చి॥ ఆదూరి భీమారావులకు శ్రీ హనుమత్కృప వలన సకలైశ్వర్య సంపదలు శతాయురున్నతులు కలుగవలెనని నా ఆశీస్సులు.

**అంకితము**

నిరంతర రామనామ జపధ్యాన తత్పరుడైన హనుమంతుడు తన సర్వస్వము శ్రీరామచంద్రునకు అర్పించి చరితార్థుడైనాడు. హనుమంతుని చరిత్రయగు ఈ కావ్యమును గూడ సర్వలోక శరణ్యుడు భక్తజనమందారుడునగు శ్రీరామచంద్రుని చరణకమలముల యందు భక్తి వినమ్రుడనై సమర్పించుకొను చున్నాను.

ఇతఃపూర్వము నా గ్రంథముల నాదరించి నట్లుగనే ఈ నూతన కావ్యము శ్రీ హనుమత్ప్రబంధమును ఆంధ్రప్రజానీకము ఆదరించి శ్రీ హనుమత్కృపనందగలరని నా విశ్వాసము.

గ్రంథకర్త

# ఆశీస్సులు



మా అల్లుడు
**చి॥ ఆదూరి భీమారావు**
C.A.O., S.E.Rly. (Retd.)

మా అమ్మాయి
**చి॥ సౌ॥ విద్యావతి** M.A.,

సమధిక భక్తి తత్పరులు సంస్తుత శీల విరాజితాత్ములున్
విమల గృహస్థ ధర్మ పదవీమ్మృదు వర్తనులుర్వి రెండు వం
శములకుఁ బేరు దెచ్చిన ప్రశస్త చరిత్రులు వీరలిర్వు రు
త్తమ బహుకీర్తి భాగ్య సముదాత్తులునై విలసిల్లుగావుతన్.

మనుమలు మన్మరాండ్రు తమ మధ్యగ చెల్వగు నాటపాటలన్
దనియఁగఁ జేయు సంతసమునన్ జిరకాలము దన్కవారి వ
ర్ధన మహితోన్నతోదయ పరంపరలన్ గను భాగ్యవంతులై
మనుదురు గాత వీరు హనుమంతుని దివ్యకృపాభిరక్షలన్.

9-10-98

**కొండేపూడి సుబ్బారావు**
గ్రంథకర్త

# భక్తి నివేదనము

''ప్రవచన శిరోమణి'' శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామి

హనుమ సేవాభావములో భక్తిభావములో దౌత్యములో మంత్రణములో చారకృత్యములో కుశలుడు. బుద్ధి, తేజస్సు, పరాక్రమము, పౌరుషము అతని యందు పరిపూర్ణముగా నిండియుండును. శ్రీరామోపాసనకంటె హనుమదుపాసనము సకలకార్యఫలప్రదము. హనుమను ఉపాసించిననే శ్రీరామానుగ్రహము లభించును. హనుమ మంత్ర స్వరూపుడు, గురు స్వరూపుడు. చనిపోయిన వారిని బ్రతికించు సంజీవినిని ఒసంగినవాడు. హనుమ జీవించియుంటే అందరమూ జీవించియున్నట్లు ఆతడు లేనిచో బ్రతికియున్ననూ అందరమూ లేనివారమే అనినాడు జాంబవంతుడు. అట్టి హనుమను ఉపాసించిన ధన్యులు శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు.

శ్రీ సుబ్బారావుగారు లౌకిక జీవితము నుండి విశ్రాంతులైన తరువాత ఆధ్యాత్మిక జీవనమునకే తన మనసును, వాక్కును వినియోగించు చున్నారు. వాగ్దేవీ విశేషానుగ్రహ పాత్రులై సహజమగు వాగ్వైభవమును అందినారు. బహుగ్రంథ నిర్మాతలు. హనుమను స్మరించినంతనే పరవశించి ఒడలు మరచెడి స్వభావము వారిది. పద్య కవితా ప్రక్రియ యందు వారు సిద్ధహస్తులు వారు రచించిన గ్రంథములన్నియూ భగవదర్పణముగా రచింపబడినవే. ప్రాచీన పద్య కవితా స్రవంతి ఇంకిపోకుండ ఆంధ్ర పాఠక హృదయ క్షేత్రములో ప్రవహించవలెనని దీక్షపూని వారి సర్వస్వమునూ అర్పించి ప్రసన్న భారతి అను ఒక పత్రికను స్థాపించినారు. సారస్వత పత్రికలు నడిపించుట చాల కష్టము. అందులోను ఒకే వ్యక్తి సంపాదకులుగా, నిర్వాహకులుగా పద్య కవితా ప్రస్థానమును దేశములో వ్యాపింపజేయు సమకట్టినారు. వారి దీక్షకు హనుమ అండగా నిలచి నిరంతరాయముగా సాగించుచున్నాడు.

ఎన్నో ప్రబంధములను రచించి హనుమ యందు వారికి గల నిరతిశయమగు భక్తిచే హనుమత్ప్రబంధమును వ్రాయ సమకట్టినారు. శ్రీరామాయణము ననుసరించి హనుమ దివ్య చరితమును వారిందు

నిబంధించినారు. ఇది ఒక అపూర్వమైన గ్రంథము. ఇది రెండు భాగములు. మొదటి భాగము ఇంతకు ముందు వెలువడినది. ఇపుడు రెండవ భాగము ఆవిష్కరణము జరుగుచున్నది. సీతాదేవి హనుమను ''త్వమస్మిన్ కార్య నిర్యోగే ప్రమాణమ్ '' అని హనుమా! నీవే నా కార్యమును నెరవేర్చుటలో సమర్థుడవని అర్థించినది. నీవు ప్రయత్నించి నా దుఃఖమును పోగొట్టుము. నీ ప్రయత్నము వలన శ్రీరాముడు నా విషయమున ప్రవర్తించి నన్ను పొందుటకు యత్నించునట్లు చేయుము అని అర్థించినది . లక్ష్మీ స్వరూపిణియై భగవానుడు అగు శ్రీరామునితో అనన్యయై ఒప్పెడి తల్లికూడ హనుమనే ఆశ్రయించి తన కార్యమును సాధింప పూనుకొనినది. దానినే ఆ దర్శముగా తీసుకొని శ్రీ సుబ్బారావుగారు కూడా హనుమనే ఆశ్రయించి తన కార్యమును సిద్ధింపచేయ ఉద్యమించినారు. వీరి భక్తి అనన్య సామాన్యము. వీరి కవన చాతురి సహృదయ సమాదరణీయము. అనర్గళమైన ధారతో, లలిత పదప్రయోగముతో మధురాతి మధురముగా వ్రాయగల సమర్థులు వీరు. ఈ హనుమత్ప్రబంధము ప్రాచీనాంధ్రప్రబంధ పద్ధతిని వ్రాయబడుట వీరి ప్రత్యేకత-

వీరు రచించిన హనుమత్ప్రబంధమును సహృదయ ఆంధ్ర పాఠకలోకము మనసార చదివి ఆనందించి తరించునట్లు శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేతుడగు శ్రీరామచంద్రుడు అనుగ్రహించుగాక. వీరు దీర్ఘాయురారోగ్యములతో ఆంధ్ర కవితా సరస్వతిని తమ కృతి పుష్పములతో ఆరాధించి ధన్యులగుదురు గాక.

## హనుమత్ప్రబంధ కవితా సౌగంధ్యము

ఆచార్య.కె. మలయ వాసిని. M.A.,Ph.D
తెలుగు విభాగము ఆంధ్ర విశ్వకళా
పరిషత్తు

మారుతి సత్కథా గ్రథన మంజుల కావ్య కృషీవలులైన మధురకవి శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు హనుమత్ప్రబంధ ద్వితీయ భాగాన్ని కూడా భక్తితత్పరులై పూజాదామంగా కూర్చి హనుమంతుని చేతుల మీదుగా రామాంకితము చేసిన ధన్యులు.

''చెప్పిన రామచంద్రు కథ చెప్పకొనున్ జగమెల్ల బ్రీతితో
నెప్పటి కప్పుడే యెడదకింపుగ తీయము లూరు వాచవిన్.

అన్నమాటలు ఎప్పటికీ అక్షరసత్యాలు. రామచంద్రు కథ అంటే హనుమన్న కథే; హనుమన్న లేకపోతే సీతాపహరణం తరువాత కథకు ప్రాణమే లేదు. సీతాన్వేషణ తత్పరుడు హనుమ సముద్రలంఘనం చేయడంతో ఆరంభమై శ్రీరామ పట్టాభిషేక సంరంభంతో ముగుస్తుంది ఈ రచన. ఆంజనేయుని పంచముఖాలవలె అయిదు ఆశ్వాసాలుగా విభజింపబడింది. సముద్రలంఘనం, లంకాప్రవేశం, సీతాదర్శనం, లంకాదహనం, రామపట్టాభిషేకం ప్రధానాంశాలు ఈ ఆశ్వాసాలలో. దీనికి పూర్వ కథ హనుమ జననము నుండి సముద్రలంఘనోద్యుక్తుడగు వరకు గల ప్రథమబాగము ఇటీవలనే వెలువడి కవిపండితుల మన్నన లందుకొన్నది-

సంప్రదాయాంధ్ర కవితారీతులలో పెరిగిన కవిచంద్రులు శ్రీ సుబ్బారావుగారు. బహుగ్రంథ కర్తలు. 'ప్రసన్న భారతి సాహిత్య పత్రిక వ్యవస్థాపక సంపాదకులుగా ఆంధ్ర సాహితీ లోకమునకు చిరపరిచితులు- వర్ణనానిపుణః కవిః అనే ఆలంకారోక్తికి నిదర్శనంగా వీరి కవితలో కథా సందర్భం, వర్ణనలు ఒకదానికి ఒకటి పరిపోషకంగా సాగి వారి కవితా ప్రౌఢిని పట్టియిచ్చేవిగా ఉంటాయి.

సముద్రలంఘ నోద్యుక్తుడైన హనుమ-

''ప్రాచీసుందరశైలపీఠిహరిదశ్వ స్యందనారూఢుడై
ద్యో చక్రమ్ముఁబరిభ్రమింప నినుఁడుద్యోగించు చందంబునన్
తో చాడట ''. అంతే కాదు, ఆ హనుమన్మూర్తిని గాంచి సముద్రం భీతిల్లినదని చేసిన హేతూత్ప్రేక్ష-

''తనువున్ తాళతరు ప్రమాణముగ నుద్దండించినిల్చిన ''-

''హనుమన్మూర్తిని గాంచి సాగరము సర్వాంగంబులన్ భీతితో
వణకన్ సొగెడి రీతి నుండె నిచలత్ భంగోత్కర శ్రేణులన్.

ప్రథమ భాగంలో తన పుత్రుడు, శిష్యుడు- సుగ్రీవ హనుమంతుల మైత్రిని వర్ణించే సందర్భంలో వారి మైత్రివలె- మధ్యాహ్నార్కుడు ప్రకాశించాడని వర్ణించిన కొండేపూడి వారు- ఈ భాగంలో సముద్రలంఘనం చేస్తున్న హనుమకు శ్రమ లేకుండా చేయడానికి సూర్యుడు, వాయువు చేసిన ప్రయత్నాన్ని పరమ రమ్యంగా వర్ణించారు ''.తన శిష్యుండిటు లెండలం బడుచు సంతాపించుటల్ జూచి యయ్యినుడున్ మబ్బుల చాటునంజని శ్రమంబోగెన్; సుతుందన్పె నయ్య నిలుండున్ శిశిరోర్మికల్ నెఱపి మార్గాయా సముల్ పోవగా దనరున్ బిన్నల యందు నిట్లె కద పెద్దల్ చూపు వాత్సల్యముల్ ''. అంటూ చేసిన అర్థాంతరన్యాస విన్యాసం ఆత్మకింపయి నట్టిది.

. ఉపమలు ఎన్నుకోవడంలో కవి ఉపజ్ఞ వెల్లడవుతుంది. పటువీర విక్రమ కళాధుర్యోరు తేజస్విమైన హనుమంతుని పరాక్రమాన్ని వర్ణించే సందర్భంలో త్రివిక్రముని తోడి సామ్యం ఎంత చక్కగా అమరింది.

'బలిబలమ్ము హరింపగ వామనుడు త్రి
విక్రమస్ఫూర్తినందిన విధముతోప
పటుతరోగ్ర రూపమ్మున వనధి దాటి
మరల నిజరూపమును తాల్చె మారుతియును

అశోకవనం నిత్యవసంతంతో అలరారుతూ ఉంటుంది. ఆ వసంత శోభను లలిత పద భావజాలంతో వర్ణించి మదిని ఉయ్యాల లూగించిన నేర్పు వీరిది.

''అలసాయాత సమీర వీచికలు, రమ్యారామ కేళీస్థలుల్,
పులుగుం బాటలు, తీయతావులును, పూవుందేని యల్, తమ్మిపూ
కొలనుల్, పుప్పొడి బాటలున్ పురమునం గ్రొంగొత్తలై యెల్లవే
ళల సొంపుల్ దొనకున్ వసంతదినలీలాలోలరమ్యమ్ములై.

సుందరకాండలో వాల్మీకి చంద్రోదయ వర్ణన ప్రత్యేకం ఒక సర్గలో చేసాడు. చంద్రుడు చంద్రిక కవులను ఉత్తేజ పరచేవి. ఆనాటి ఆ వెన్నెల కంత ప్రాముఖ్యం కథలో. శ్రీ కొండేపూడి వారి కవితా హృదయం కూడా చంద్రోదయంతో ఉప్పొంగి ఉత్ప్రేక్షా వల్లభులుగా చేసింది.

''అవని జాన్వేషణ మ్మనుకూల మగునట్లు
సురలు వెల్గించిన జ్యోతియనగ
శ్రీ కళా దీప్తమౌ సీతాముఖద్యుతి
వానరాగ్రణి కానవాలు గాగ

మహిత పయోరాశి మథన శేషోద్భూత
కమనీయ మధుసుధా కలశమనగ
ఆకాశ నుందుండి హనుమ కాశీస్సులం
జలువు శ్రీరాము తేజమ్మనంగ-

శ్రీ రాముని తేజమ్మనంగా చంద్రుడు ప్రకాశించాడు. శ్రీ రామచంద్రుడు కదా. హనుమకు ఆశీస్సులు అందించడంలో ఆశ్చర్య మేముంది. ఆ వెన్నెల కిరణాల లోలంక మల్లెపూదెరల మధ్యస్థమైయున్నదంటూ భావించారు. ఆ పద్యంలో చంద్రుని గూర్చిన మఱొక వర్ణన వాల్మీకమే- నీలాల నింగిలో వెలుగుతున్న చంద్రుడు క్రిందనున్న నిర్మల జలసరస్సులో ఉన్న హంసవలె ఉన్నాడని-
ఆ అర్థంలో ఉన్న వీరి మనోహరమైన పద్యం చూడండి-

''నీలాకాశ విశాల మార్గముల చాంద్రీ రమ్యరమ్యోత్సవ
శ్రీ లావణ్యము లార వోయుచును పొల్చెన్, నిర్మలాం భస్సరః
కేళీ సుందర రాజ హంసమును భంగిన్, చంద్రు డౌజ్జ్వల్యరే
ఖాలీలాకృతి మల్లెపూదెరల లంకన్ గప్పుచున్నట్లుగన్ ''.

అశోక వృక్షం క్రింద సీతాదేవిని చూసి హనుమ- ఆమెస్థితిని బట్టి ఆమెయె సీత గావలెన్ అనే కరుణార్ద్ర భావన పరంపరలతో మూడు పద్యాలు కూర్చారు. హనుమ దర్శించిన సీతా స్వరూపం మాలోపమలో రూపు కట్టించారు.

'సలలితాలంకార శబ్దార్థ మాధురీ
కమనీయతలు లేని కవిత యట్లు,
తారకాతతియును తారకాపతి లేని
చదలున నైల్యమ్ము గదిసినట్లు,
కడలేని దుఃఖమ్ము కన్నీటి కడలియై
పొంగెత్తి మొగమును ముంచినట్లు,
సందియం బుడివోని శాస్త్రార్థములయట్లు
పొగలుగ్రమ్మిన నిప్పుసెగల రీతి,
ముండ్ల మధ్యఁ జిక్కిన నునుఁ బూవువోలె
దీనమానసయై పరాధీన యగుచు
తులువలై చరించెడుగ రాసులకు మధ్య
కానుపించిన దామె యాకార మచట.

రావణుడు అర్థ రాత్రి సీతను చూడడానికి వచ్చిన సందర్భంలో హనుమ చెట్టు మీద 'కనపడకుండడాగి విహగమ్మయి అనే కల్పనతో పాటు సులోచన, కాలనేమి

ఎంటి అవాల్మీక వృత్తాంతాలను కూడా ఈ రచనలో కూర్చారు సుబ్బారావుగారు.

ఇంద్రజిత్తు రణరంగంలో నిహతుడైన సందర్భంలో మండోదరి పుత్ర శోకాకులయ్యై కూడా అత్తగా కోడలైన సులోచనను ఒడిలో చేర్చుకొని ఓదార్చిన ఘట్టం కరుణ రస నిర్భరంగా తీర్చారు.

పాత్ర చిత్రణలలో కొండేపూడి వారిది అతి సుకుమారమయిన పద్ధతి. మనస్సుకు సంబంధించిన మానవ సంబంధాలను వర్ణించే తీరు చిత్తాకర్షకంగా ఉంటుంది. తన బుద్ధికి తననే నిందించుకునే సీత

''కొంచెపు బుద్ధి రామనృపకుంజరు గోరితి పైడిలేడి తె
మ్మంచును, పల్కరాని నుడులాడుచు నీసున సర్వ సద్గుణా
ఢ్యంచిత మూర్తి లక్ష్మణుని బంపితి నాతని వెంట; నన్నునే
వంచనఁ జేసి కొన్నది విపర్యయ మూరక బోవునే తుదిన్.

తన సంగతి సరే-రామమూర్తికి ఇప్పుడు 'లక్ష్మణుండొక్కడె సేయ వలయున్ బరిచర్యలు అని దిగులు పడుతుంది ఆ సాధ్వి.

తన భుజాల మీద యెక్కి వస్తే సముద్రం దాటించి తీసుకు వెళ్లి రాముని చెంత చేరుస్తానన్న హనుమతో-సీత

'జనకుని యజ్ఞవాటికను జన్మమునుంగని, కోసలావనీం
ద్రునకును గోడలై, సుగుణ ధుర్యుడు రాముని పత్నినై యికన్
జనుదునె కన్మొఱంగి కపి సాయమునన్ ; దనుజేంద్రుడట్లు వం
చన మెయి మౌని వేసమున నన్గొని వచ్చెను గాక లంకకున్.

అంటూ తన అభిజాత్యాన్ని వివరిస్తుం దామె.

ప్రణయ సామ్రాజ్య పట్ట భద్రులు సీతారాములు. వారు ఒకరిలో ఒకరు ఎప్పుడూ ఉన్నారు. ఆవియోగం తనువులదే గాని మనస్సులకు లేనేలేదు. పవిత్ర ప్రణయ భావనా తత్పరులైన వారి మనోభావాల్ని మరింత పవిత్రంగా వర్ణించడంలో కవి నేర్పు మెచ్చ దగింది.

రామముద్రికను అందుకున్న సీతకు రాముడు శివుని చాపం ఎక్కిడిన దృశ్యమే కన్నులలో మెదిలిందట.

.ఎన్నటి మాట, తండ్రి మిథిలేశుని పీట, మహీశు చాపమున్

సన్నుత ధైర్య బాహుబల సాహసుడై విదళించె రాముడున్,
మన్నన నామె గాంచుచును మాటికి; నాటి మనోజ్ఞ దృశ్యమే
కన్నులలో నునున్మెఱపు గాంతుల జిమ్మెను ధాత్రి జాతకున్.

సీతరాముల అన్యోన్యతకు నిదర్శనంగా- వీరు వర్ణించిన ఘట్టం ఒకటి మనోరంజకమయినట్టిది.

సీతకు మొక్కలన్నా పువ్వులన్నా ప్రేమ. అందువల్ల సీతా వియోగంలో ఉన్న రాముడు స్వయంగా చల్లటి నీళ్లు ప్రేమగా ఆ మొక్కలకు పోసి నిశ్చేతనుడై నిలబడి పోయేవాడట. ఆ విషయాన్ని సీతకు చెప్తాడు హనుమ.

''సీతకు మొక్కలన్న, వికసించిన మవ్వపు బూవులన్ననున్
బ్రీతి, నవాంకురమ్ములను వేడ్కగ పెంచుచు నుండు నా మెయం
చాతడు శీతలాంబువుల నాపువు మొక్కల వద్దబోసి ని
శ్చేతనుడై నిలంబడును ; సీత యెడన్ మది యెంత మెత్తనో.

అంతటి సుతిమెత్తని మది కాబట్టి-

యుద్ధ పరిసమాప్తియై అగ్నిపూతయైన సీతను రాముడు స్వీకరించిన విధానాన్ని ఆ ప్రణయ పరిరంభణాన్ని ఉత్పలమాలికగా గ్రుచ్చారాయన.

'విచ్చిన కన్నులన్ మనసు విచ్చిన మోమున రామచంద్రుడున్
వచ్చిన సీతపై చిగురు వన్నెల వెన్నెల లైన నవ్వులన్
గ్రుచ్చి కవుంగిలించె నెనరుల్ దనరారగ బాహువల్లరిన్,
త్రచ్చిన వెన్నెలా మదిని దాచిన కూర్మలు తీయతావులై.

సీతారాముల పునస్స మాగమానికీ, లక్ష్మణుని మూర్ఛతీరడానికీ, సీతామాత క్షేమ వార్తను చెప్పి రామ లక్ష్మణుల ప్రాణాలతోపాటు కపుల ప్రాణాలు కూడా నిలిపినది హనుమయే, అందుకే రాముడు-

'ఓ నిరవద్య ధైర్య మహిమోన్నత! ఓ కపి లోకధూర్జటీ!
దానవ భూమి జొచ్చి, వసుధా సుతఁ జూచిన వార్త దెచ్చి, నా
ప్రాణము నిల్ప గల్గిన మహాత్ముఁడవంచును రాముడా మరు
త్సూనుని కౌగిలించెను మధుస్మిత దీపిత సుందరాస్యుడై.

సీతా వియోగంతో ఉన్న రాముడు నవ్వడం మర్చిపోయాడు. శోకాకుల చిత్తుడై పరిభ్రమిస్తున్నాడు. అట్టి స్థితిలో సీతామాత క్షేమ వార్తతో అతనికి పోయిన ప్రాణాలు తిరిగి వచ్చాయి. ఆ ఉపకారం చేసిన హనుమను మనసా రా, ప్రియమారా గ్రుచ్చి కౌగలించుకున్నాడట నవ్వురాజిల్లు మోముతో రామచంద్రుడు. అంతటి దుఃఖాకులుడైన శ్రీ రామచంద్రుని మోముపై చిఱునవ్వు వెన్నెలలు మొలిపించిన మహాభక్తుడు హనుమ. సీతతో రావణ సంహార వార్త చెప్పగానె ఆమె-'' హనుమా నీయుపకారమున్ మఱవ లేనయ్యా మనస్తృప్తిగా నిను వర్ణింపగ మాటలున్

ప్రారకవు-అంటుంది.

సీతారాములు ప్రణయ మూర్తులే కాదు అవతారమూర్తులు పైగా వేదమూర్తులు. ఆ విషయాన్ని శ్రీ కొండేపూడివారు తమ రచనలో సందర్భోచితంగా ప్రసంగిస్తూ వచ్చారు.

సీతాదేవి:-

'వేదమంత్రమహనీయ సముజ్జ్వల యజ్ఞవాటి

కాశ్రీయుతమూర్తి·

'నిర్మలనైగమార్థ తేజోకమనీయ,''సాధు సద్గుణ శ్రీ చరితామృత ప్రథిత చిక్కణ మూర్తి''సురుచిర ధర్మమార్గ పరిశుద్ధ మనస్విని,''సలలిత రామనామ జప సాధు తపస్విని,'నైగమ ధర్మమార్గ యాత్రాచణ శీల,'మహాగ్ని సమాన పవిత్ర,''సాధు భావ గుణ సంపద గల్గిన పుణ్యశీల , ' అత్యంత స్వాదువులీసుకుమార పద సమాసాలు.

శ్రీరామమూర్తి:-

'యుద్ధ విద్యా నిటలాక్షుడా రఘు రాముడు,
'సకలా రాతి విదార ణోద్ధత పటిష్ఠస్వామి
'పరమ దయా సుధాబ్ధి రఘువంశ్యుడు'

'దశరథేశుని యజ్ఞఫలోపలబ్ధ సుశ్రీకమహా నిధానము' పట్టాభిరాముని వర్ణన ప్రత్యేక పరువాన్ని అందింది.

నిర్మలాశయ సార నిజవర్తనా చార
నిహిత మానవధర్మ నియమ పరుడు,
ధారుణీ పాలనాధార శాస్త్రన్యాయ
మార్గాచరణ శీల మాన్యమూర్తి,
సర్వ జనామోద సత్యవాక్పరి పాల
నాశయోదార జిహ్వాంచలుండు,
దురిత కార్యోన్మాద దుష్టశిక్షణ శౌర్య
సామర్థ్య పౌరుషస్ఫురుడు నగుచు,
రమ్య సద్గుణ ధాముడా రాముడలరె
సకల జనభాగ్య సంక్షేమ సౌఖ్యరాజ్య
సార్వ భౌమత్వ కీర్తి ప్రశస్తి దనరి
రామరాజ్యము భువిని స్వారాజ్య మనగ.

ఈ కవిగారి రచనా వైశిష్ట్యమును గూర్చి ఒకమాట-సమాసములు

దీర్ఘములైనను రమణీయ పద పదార్థ బంధము లై రసబంధురముగ, అనర్గళ గంగా ధార వలె ప్రవహించును. ఉచ్చారణ సామ్యము గల పద ప్రయోగముతో పెక్కు చోట్ల యమకము నొక అందముగా వాడిరి-మధుర మనోహరము ప్రసన్న భావ కలితమునైన ఒక ప్రత్యేక శైలి నలవరచుకొన్న పద్య విద్య వీరిది-ఇట్టి కవితా శక్తి చాల అరుదు-నాటి నేటి ప్రసిద్ధాంధ్ర కవుల పోకడులందందుగాన వచ్చును. శ్రీ నాథ పోతనల ప్రభావము వీరి రచనలందెక్కువ. ప్రతి పద్యము నందును ఒక శైలీ చమత్కృతి కానుపించు రసవత్ సుందర కావ్య మిది.

కొన్ని సామాన్య వాక్యములలోనే చమత్కారము చూడుడు.

1. సీత. ఓ రావణా! ఆనాడు నా రాముడచ్చటనే ఉన్నచో ''నీ కంఠమ్ములు గ్రాస్త్రధారా కృత్తమ్ములు చేసి యుండెడిని గృధ్ర శ్రేణికాహారముల్''-అన్యాయంగా జటాయు పక్షిని జంపిన ఆ దైత్యుని దేహఖండాలు గ్రద్దలు పీకుకు తినవలెనని-

2. లంగాదహనము: దైత్యులు హనుమ తోకకు నిప్పు బెట్టారు- 'వాలము నుండి రాలిన రవల్ రగిలించిన నిప్పు మంటలో కాల దొడంగెలంక''-వాళ్ళ యిళ్ళకు నిప్పు వాళ్ళే పెట్టుకున్నారు-హనుమ నిమిత్తమాత్రుడు. '' దావాభీల వాలానల జ్వాలాదగ్ధము '' లంక.

3. హనుమ రావణునితో: రావణా కామాంధుడవై నీవు చేసినది '' మహీసు తాప హరణమ్మా! కాదు; లంకాపుర శ్రీనాశమ్మగు కాలపాశము నీ మెడకు చుట్టుకున్నావు.

4. వారధి వర్ణన: ''అదియున్ వారధి కాదు వార్ధిపయి. దైత్యాధీశు దుర్మంత్ర దుర్మద దుర్నీతికి మృత్యువేదిక '' అని సురలు గగనమున సంభాషించిరి-

ఇట్టివి ఆద్యంతము కావ్యంలో కోకొల్లలు-

కవయిత్రి మొల్ల తెలుగులో కవిత్వం చెప్తే కందువ మాటలు, సామెతలు అందంగా కూర్చాలంది. శ్రీ సుబ్బారావుగారు తమ రచనలో అవి ఎంతో అందంగా కూర్చారు. హనుమ గండరగండడు.

నవ్వులాటలు,చెప్పున నల్గిచచ్చుట, లేచినవాడు లేచినట్లే గుట,
వైరిపై నెడమ కాలిడిత్రొక్కినట్లు, చీమచిటుకన్నన్,
లేచిన కంటిరెప్ప ముకుళింపక,
ఆడంబోయిన తీర్థ మెట్టదుట నున్నట్లు,
చచ్చి చేసెడిదేమి, వలను చిక్కిన పులుగు,
క్రిందు మీదులుగ సేయన్, కాలము లేదు మాటలకికన్, ఉన్న పాటుగా, కాలదన్నుట,
నీ వొకలెక్కా, గగ్గోలున, మొదలయిన తెలుగు పలుకు బడులు ఈ రచనలో కొల్లలు.

పద్యవిద్య అందరికీ అలవడేదికాదు. ఛంద శ్శిల్పాన్ని సమాదరించిన సత్కవులలో కొండేపూడి వారొకరు. ఏ సందర్భానికి ఏ వృత్తాన్ని కూర్చాలి,, ఎలా కూర్చితే అది జౌచితీమండి తమై అలరారుతుంది అన్నది పద్యవిద్యోపాసకులకే అవగతమయ్యే విషయం.

ఆది కవి నన్నయ శకుంతలో పాఖ్యానంలో కవిరాజ విరాజితంలో కణ్వాశ్రమాన్ని చూపించాడు. అలాగే మణి గణ విరాజితమయిన దశకంఠుని సుందర సౌధాన్ని కవిరాజ విరాజితంలో కూర్చారు వీరు.

'చని చని ముంగట సర్వ వికస్వరచారు సుమావళి సౌరభముల్'

'మానిని' అంటే అభిమానము కలది అని అర్థం. రావణుడు అశోకవనంలో సీతను చూడడానికి వచ్చిన సందర్భంలో సీతా మానిని అవస్థను 'మానిని' అనే ఛందస్సులో వర్ణించి జౌచిత్యం పాటించారు.

మానిని: 'కాయమునెల్లను క్ష్మాసుత వేగమె కాళుల సేతుల గప్పికొనెన్ '

శ్రీరామ వృత్తాంతాన్ని హనుమ చెట్టు మీద నుండి సీత మనస్సులో, పూలజల్లు కురిసి నట్లుగా వర్ణిస్తాడు. ఆ వృత్తాంతమంతా మంజరీ ద్విపదలో అల్లారు.

అక్షయ కుమారుడు అతి ఉత్సాహంతో యుద్ధానికి వచ్చిన సందర్భాన్ని ఉత్సాహ వృత్తంలోను, యుద్ధ వర్ణన రథోద్ధత ' వృత్తంలోను, లంకాదహనం జరిగిన సందర్భంలో లంకా నగరమంతా రోదిస్తున్న విషయాన్ని రోదకము అనే వృత్తంలోను అభివర్ణించారు.

రోదకము: ఈదెసె నా దెస నెచ్చుట గన్నన్
ఏ దరి కింజన నీయని లంకా
వీధుల నగ్నులు వెల్వడి రాగన్
రోదనలందసురల్ బడిరార్తిన్!

ఆకాశ వీధిలో ఎగిరి వెళుతున్న హనుమను భుజంగ ప్రయాతంలోను- సీత యిచ్చిన రత్నాన్ని భద్రంగా దాచిన విషయాన్ని 'భద్రకము లోను వర్ణించడం మెచ్చ దగిన విషయం.

భద్రకము: వాతవీచి భయంబునన్
సీత యిచ్చిన రత్నమున్
బ్రాతిగా కడు భద్రమౌ
రీతి దాచెను హన్మయున్!

మహా వీరులైన రామరావణుల యుద్ధంలో 'మదరేఖ' తోచిందా అన్నట్లు- ఆ వర్ణన 'మదరేఖ' వృత్తానికి ప్రత్యేకించారు:

మదరేఖ:- ధైర్యోత్సాహుడు దర్ప
స్ఫూర్త్యోద్దాముడు సత్త్వో
దార్యుండై రణధాటీ
ధుర్యుండై చనెతోడ్తో !

యుద్ధానంతరం ఖండిత రిపుడై కోదండార్చిత పూజ్యుడై సీతా సమేతుడై పుష్పక విమానారూఢుడై శ్రీరాముడు అయోధ్యకు వచ్చే సంరంభాన్ని 'విమానము' అనే వృత్తంలో అభివర్ణించారు.

విమానము: ఆ పుష్పకారూఢుడౌ చున్
దీపించు తేజో ముఖుండై
భూపుత్రి పాల్పార ప్రక్కన్
ప్రాపొచు రాముండు నేగెన్.

శ్రీరాముడు, హనుమ- భూలోకంలో కొన్ని అక్కఱలు తీర్చడానికి అవతరించారు. ఆ విషయాన్ని మధ్యాక్కఱలోను, కావ్యాంతాన 'మంగళమహాశ్రీ' వ్రాసి ఛందశ్శిల్ప పారగులయ్యారు కొండేపూడి వారు.

ఇంతటి ప్రౌఢప్రబంధాన్ని ఔచితీ మహితంగా కూర్చిన కవిగారు ఇది నా వల్ల జరిగిన పనా? స్వామి కృపే అన్నారు. నిజమే భక్తిభావ బంధుర మయిన మనస్సు అలాగే పలికిస్తుంది. ప్రాణప్రదంగా భావించి రామ కార్యాన్ని నిర్వహించిన హనుమ కపి సేనతో

'దాశరథి దయ, సీత వాత్సల్య గరిమ
మీదు దీవనల్, నాకును ప్రోదిగాగ
చేయగల్గినయంతనే చేసినాడ
ననుచు నమ్రుడై వారికా హనుమమ్రొక్కె.

ఆ రామ భక్తుని భక్తులు కవిగారు. వీరి ధోరణి వేరెలా ఉంటుంది. అందుకే.

'ఈ యతుల ప్రభావ మహనీయ కృతిన్ రస రమ్యరీతులన్
వ్రాయగ నేవెవండను కృపా మధురామృత వీక్షణా యత
శ్రీ యుత మూర్తులాయిరువు రిచ్చిన ఆ శిష భాగ్యరోచిర
ధ్యాయ మనోజ్ఞ కావ్య గుణమ్మై విలసిల్లెను గాక నిర్మలిన్.

శ్రీ కొండేపూడి వారి గుండె నిండుగా ప్రవహించే రామ భక్తి రసాయానం-హనుమంతుడు రామపట్టాభిషేక సమయంలో చేసిన శ్రీరామస్తవం అక్షరం అక్షరంలో ప్రవహిస్తూ ఉంది. కావ్యానికి మకుటాయ మానమయిన ఘట్టం.

అసలు హనుమ సీతా దర్శన వృత్తాంతాన్ని చెప్పినపుడు కపిసేన

అమృతా సారము లక్ష రాక్షరములల్లా లించిరావానర

ప్రముఖుల్---------లంక కాల్చిన కథన్ సర్వమ్ము వాక్రువ్వగా

అంటారు. సీతా వృత్తాంతం హనుమ చెప్తుంటే-లంక గాల్చిన విషయం వింటూ ఉంటే-అమృతా సారము అక్షరాక్షరముల పొంగి పొరలిందనడం అక్షర సత్యం.

కథ రామకథ, హనుమంతుని కథ కూడా-సువర్ణానికి తావి అబ్బిన సందర్భమిది.

'భావం రామకార్య నియమ వ్యాపార సంపృక్తమ్ము కాగా

ఆ కవి-ప్రణుతామల పదపదార్థ ఫణితిని

మృదు పద బంధురరసభావ ఫణితిని,

కావ్యరస విశ్రుత సుందర పద్యవిద్యలన్

ఈ మహాకావ్యాన్ని విరచించారు.

రసాభ్యుచిత బంధంతో పదలాలిత్యము కమనీయము హృదయాహ్లాదమైన శైలిలో సాగిన ఈ మహా ప్రబంధం ఆంధ్రులు గర్వించదగ్గ రచన.

పుష్పగిరి తిమ్మన సమీర కుమార విజయం నేడు అంతగా వ్యాప్తిలో లేదు.

సమాజంలో ప్రతి వ్యక్తికి ఆవశ్యకములు ఆదర్శములు అయిన విద్య వినయము వివేకము, పరోపకారము, దీక్ష, కార్య నిర్వహణ సామర్థ్యము, నిష్కలంక ప్రవర్తన, సాహసము, స్వామి భక్తి, ధార్మిక చింతనాది సద్గుణములు కల, మహాత్ముడు హనుమంతుడు శివాంశ సంభూతుడు. విష్ణ్వతారుడగు శ్రీరామునకు దుష్ట దైత్య విధ్వంసమునకైతోడు వచ్చిన కారణ జన్ముడు. ఈ విధంగా హనుమచ్చరిత్రమును ఒక అపూర్వ రీతిని రూపొదించిన ఈ మహాకావ్యం ఆంధ్ర సాహితిలో సుస్థిరంగా నిలువగల ఉత్తమ గ్రంథం అనుటలో అతిశయోక్తి లేదు.

హనుమ వ్యక్తిత్వాన్ని శ్రీ సుబ్బారావు గారు ఒకటి రెండు మాటల్లో ప్రస్ఫుటంచేసారు

''శైవాంశప్రభవుం డజేయ బలుడు ''

''కారణ జన్ముడున్ దివిజ కార్యధురంధరుడు ''

''వరజన్ముం, డురుసాహసుండు, శ్రుతి విద్యావార్ధి పారంగతుం,

డరిలోకప్రళయుండు, రామపదపూజాసక్తు, డౌదాత్యస

చ్చరితుం, ఉత్తమకార్య దీక్షితు, ఉదంచద్బ్రహ్మతేజో మహో
ద్ధుర దీప్య ద్వదనాంబుజుండు, హనుమంతుడన్న సామాన్యుడే.
ప్రజాహృదయాల్లో ఆవిధంగానిల్చి ఉన్న మహాత్ముడు హనుమంతుడు
ఆధునికాంధ్ర పాఠకులకీ హనుమత్ప్రబంధము స్ఫూర్తిదాయకమైన మంచి ఉపాయనము.

నరనరాలా రామ భక్తి ప్రవహిస్తున్న స్థితిలో కవిగారు

'భావము సర్వ మీవయయి భావిత కార్యము సర్వమీవుగా
త్రోవలు జూప గల్గు నెనరుల్ గనుటెన్నటి కబ్బునంచు నీ
పావన పాదసేవలను బాసటగా గొనియే గుచున్న నా
జీవనయాత్ర యందున ప్రసిద్ధిని సిద్ధి నొసంగు మీశ్వరా !

వారి జీవన యాత్రయందే కాదు, కవితా జీవిత యాత్రలోని ఈ ప్రబంధాని కిన్నీ ప్రసిద్ధిగలుగుతుంది అనడంలో అతిశయోక్తి లేదు. ప్రాచీన ఆంధ్ర ప్రబంధరీతులలో వచ్చిన గొప్ప రచన యిది.

'' జైహనుమాన్ ''

# ప్రార్థన

## విఘ్నేశ్వరుడు

1. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్!
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే! !

## శ్రీరాముడు

2. రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే !
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః! !
ఆపదామపహర్తారం దాతారం సర్వసమ్పదామ్
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్!!

## హనుమంతుడు

3. అంజనానందనం వీరం జానకీశోక నాశనమ్!
కపీశమక్ష హన్తారం వందేలంకా భయంకరమ్!!

గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసామ్
రామాయణ మహామాలా రత్నం వందే నిలాత్మజమ్

మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసానమామి

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్
పారిజాత తరుమూల వాసినం భావయామి పవమాన నందనమ్

## సరస్వతి

4. సరస్వతి! నమస్తుభ్యం వరదేకామరూపిణీ!
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా!!

శ్రీ రామాయనమః

# శ్రీ హనుమత్ప్రబంధము

## ద్వితీయ భాగము - ప్రథమాశ్వాసము

### సముద్రలంఘనము

శ్రీమద్రఘుకుల సోమా
భూమీతనయాభిరామ, పూజితనామా !
కోమల వార్షుక జలద
శ్యామా, సితకీర్తి ధామ, జానకి రామా !

దేవా శ్రీ రామచంద్రా ! అవధరింపుము

సుందరుఁడాహనుమంతుఁడు
సుందరమగు వార్ధి దాటి, క్షోణిజ సీతా
సుందరినిం గన నేగెడు
సుందరకథ నిక వినిచెద, సుందర రామా !

ప్రాచీసుందర శైల పీఠి హరిదశ్వస్యందనారూఢుడై
ద్యోచక్రమ్ముఁబరిభ్రమింప నినుఁడుద్యో గించు చందంబునన్
వీచీవ్రాత విశాలవార్ధితరణో ద్విక్రాంతదీక్షాత్ముడై
తోచెన్ మారుతపుత్రు డున్నత మహేంద్రోర్వీధరాగ్రమ్మునన్.

తనువున్ తాళతరుప్రమాణముగ నుద్దండించి శైలమ్ముపై,
వనధిన్ దాటు నుపాయసాధనలు నప్రక్కల్ విలోకించు నా
హనుమన్ మూర్తిని గాంచి సాగరము సర్వాంగంబులన్ భీతితో
వణకన్ సాగెడి రీతి నుండె విచలత్ భంగోత్కరశ్రేణులన్. 4

వనచరనాథు నాజ్ఞ, యినవంశ విభూషణు వాంఛ, జాంబవం
తుని సముదుత్సుకత్వ వినుతుల్ కపిసేనల సౌహృదోల్లసత్
ప్రణుతులు సర్వముం గలసి వచ్చిన నూతన ధైర్య హేతువుల్
తన కొక మార్గ దర్శక విధమ్మున గన్పడె వాయుసూతికిన్.

" ఆవిసినమ్ములన్ వనచరాధిపుఁగొల్వున కేగు దీక్షలో
నీవును బోవు త్రోవ లవనిన్ సుగమమ్ములునై దలిర్పగా
దేవత లెల్ల రేకమయి దీవనలిచ్చెదరయ్య నాయనా !
నీవెట కేగినన్ జయము నీయది యౌనను" తల్లిపల్కులున్.

శ్రీవిన్యాసములై సుధామధు రసార్ద్రీభూత సౌమ్యమ్ములై
యేవేవో తలపుల్ మదిన్ బొడమి యూరింపన్ నవస్వాదువుల్
భావం బేకముఖంబు జేసి కొని విశ్వాసమ్మునన్ బ్రార్థనల్
గావించెన్ బవనాత్మజుండు కరయుగ్మం బెత్తి భక్త్యంజలిన్.

ఆ యనిలాత్మజుండు దనయంతన దా ననివార్య శౌర్యరే
ఖాయత వీరుఁడయ్యు వినయానత శీర్షుడు తూర్పు దిక్కుగా
నై యొనరించె బ్రార్థనల నాదృతిమై దనయత్నమందునన్
సాయముసేయు గాకనుచు సర్వ విధమ్ముల పంచభూతముల్.

నీ వేవేదవిధమ్ము దెల్పితివో కానీ చిత్తచాంచల్యముల్
బోవన్ సల్పితి వృత్తమాశయ సముద్బోధమ్ము, సన్మార్గమీ
భావం బందున నిల్పి నావు గురుదేవా ! నానమస్కారపూ
జావాల్లభ్యము స్వీకరింపుము జగచ్చక్షూ, దినేశప్రభూ !

ధీరత మీఱగా త్రిజగతీ పరిపాలనసేయు దర్పవి
స్తారుఁడు, మౌని వెన్నెముక దాలిచి దానవలోక ఘోరముల్
దూరముసేసినట్టి బలధుర్యుడు, నాపిన నాటి చెయ్దికిన్
సైరణఁజేసి నగ్గనిన స్వామి మహేంద్రునకున్ నమస్కృతుల్. 10

తనతపముల్ ఫలించిన కతమ్మున స్పష్టియొనర్చు వక్త్రని
ష్పనము లుదాత్తలోకహిత వర్తన సూక్తులు నైగమార్థ శా
సనములుగా విరాజిలిన సాధువు విష్ణుని బొడ్డు తమ్మిలో
జననము గన్న వేల్పుగమిసామికి, బ్రహ్మకు నానమస్కృతుల్.

గిరిశిఖరాలనుండి క్షితికిన్ దిగి వచ్చుచు ప్రాణి కోటికిన్
సురుచిర జీవనార్థముల శోభలొసంగు నదీమతల్లులె
వ్వరి కవుగిళ్ళ చెల్మికయి పర్వులు బెట్టుదు రాతరంగసుం
దరునకు భూమి నల్గడల దాకెడు వార్నిధికిన్ నమస్కృతుల్.

అలికవిలోకనమ్మున మహాగ్ని శిఖావళి దాచుచున్ జగత్
ప్రళయము వచ్చుదన్క, శుభభద్రతలన్ బ్రజకిచ్చు స్వామికిన్
సలలిత సౌంధ్య నాట్య విలసన్నవరాగ విభాసురాంఘ్రిని
ర్మల జల జాత యుగ్మన, కుమారమణీపతికిన్ నమస్కృతుల్.

మానవ నీతి మార్గ నియమమ్ములు రూపముగొన్న ధర్మసం
స్థానము దీనరక్షణవిధామహనీయుడు, విల్లునమ్ములన్
బూనిన లోకముల్ నిలువ బోని పరాక్రమ వహ్ని, రామభూ
జానికి, తత్సమాను డనుజన్ముడు లక్ష్మణ మూర్తి కంజలుల్.

ఏయమ వేదమంత్ర మహనీయ సముజ్జ్వల యజ్ఞవాటికా
శ్రీయుతమూర్తి, సాధుగుణశీల విశాలమహః పవిత్రతే
జోయుతకీర్తి, రాముపయిఁజూపులు నిల్పుచునున్న సాధ్వికిన్,
మాయలబ్రుచ్చు పాల్పడిన మాతకు సీతకు నానమస్కృతుల్-

తలచిన వేల్పు సాముల ఉదార సమున్నత తేజ మంతయున్
గలసి యొకండుగా నయి మొగంబున వెల్గినయట్లు దోచె నా
సలలిత సాధురూప విలసన్మహనీయుఁడు మారు తాత్మజుం
డిల నకలమ్ము దీప్త మొనరింపగఁజాలిన కాంతి పుంజమై. 16

అన్నిటికన్న మిన్నయనగా పవనాత్మజు మానసమ్మునం
దున్నది రామమంత్ర మహిమోజ్జ్వల దివ్యబలమ్ము, సర్వశ
క్త్యున్నత సుప్రసన్నము, మహోదధి సంతరణైక వేగ సం
పన్నము, దైత్యసంప్రతతి పాటవ పాటన దోర్బలోగ్రమై.

మానవరూపుఁగొన్న పరమాత్మయె రాముడటంచు దోచు నా
దానవుఁడెవ్వ డోయతని తన్విని దొంగిలి పోవుటల్, తదా
ఖ్యానము నందు నిట్లొక డనై నియతింబడి యేగుచో మదిం
గానగ నా నెదే నొక వికాసము మోసెద నేమొ యీపనిన్.

ఈమహనీయ శక్తి యిటు లెచ్చటి నుండి లభించె నాకు, శ్రీ
రాముని దీవనల్, తెలియ రాని మహత్తర దివ్యశక్తి సం
స్తోమము, లిట్లు నన్ను దయఁజూచిన భాగ్యమటన్న యూహయే
వేమఱు పొల్చు నాప్లవగవీరుని మానసమం దుదారమై.

తన పాదమ్ముల క్రింద c ద్రొక్కువడుచున్ ధాత్రీధరంబెల్లఁదో
చిన దల్పమ్మగు మట్టి కుప్పగ, నభస్తీరమ్ములన్ దాకు చుం
డిన వారాశియు పల్వలమ్ముగనె యుండెన్, నూత నోత్సాహస
త్త్వనిరూఢోన్నతు c డానమీరజుని నేత్రద్వంద్వ దృగ్రేఖికన్ .

పదములు త్రొక్కిపట్టుకొని, బాహువులన్ విడసాచి, నాకమున్
గదియగ తోక ద్రిప్పుచును, గట్టిగ శ్వాస బిగించి, యొక్కటౌ
నుదుటున నింగిపై కెగసె హుమ్మని మారుతి, మూలముట్టుగాc
గదలి పగుళ్ళు వోయిన నగధ్వనికిన్ నలుదిక్కులద్రువన్.

ఉండిన యాత డున్నటుల నొక్క యదాటున పైకి దూకు ఆ
దండి మగంటిమిం గనుచు తక్కిన వానరసేన సర్వమున్
గుండెలు చేతులం దడుము కొంచు తలంచిరి, నిక్క మింక ఈ
గండర గండఁడెంతకును కాగల డన్ననుతుల్ వచించుచున్. 22

పారావారముపై, నభస్థలముపై, బ్రహ్మాండ గోళమ్ముపై
కారోహించుచు నున్న యట్టులుగ నంతంతై ప్రధావించు సా
మీరిం గాంచిన వానరాళికి కనుల్ మిర్మిట్లు కల్పించె వి
స్తారోదంచిత విక్రమోన్నత మహత్త్వం బాంజనేయమ్ముగా.

భువిపై వానరు లిట్లు లుండగ మహామోదప్రసన్నాస్యులై
దివిపైనుండి సురోత్కర మ్మతిరయోద్రేక స్ఫుర ద్వేగ వై
భవ తేజమ్మున రామ దూతగ మహా పాథోనిధిం దాటు నా
పవమానాత్మజుపై జయోత్సవ సుమవ్రాతంబు వర్షించిరిన్.

పవమానాత్మజు పాదఘట్టనల సర్వమ్మున్ సమూలమ్ముగా
నవియంబాఱె మహేంద్ర శైలము వికారాకారముం దాల్పగా
వివి ధోత్పాతము లుప్పతిల్లిన గతిన్ భీతిల్లి రందున్న మా
నవ మౌనీశ్వర సిద్ధ సాధ్య గణ గంధర్వాదు లత్యంతమున్.

బరువుగ మోపి యూతగొను వాయుతనూజుని కాలి త్రొక్కునన్
గిరిశిఖరమ్ము కూలి విరిగెన్, తరువుల్పడె మూలముట్టుగా,
పరువులు బెట్టె సర్పములు, పక్షులు గూళ్ళను వీడి పోయె, ని
ర్ఝరములు రూపఱెన్, జనులు జంతువులున్ జని రిళ్ళు వీడుచున్.

పెనుగాలి వీచిన వేగమ్ము నందు
వెనుక ముందుల కూగు వృక్షమ్ముపగిది
చదల వెంబడి నేగు సామీరిలోన
కదలి క్రొందలపులు కదలించె మదిని.

వనజాక్షుం గొని యేగు భూరి జవ సత్త్వ స్ఫూర్తి మున్మూర్తియా
వినతాపుత్రుని శక్తి నాయెడల దీపింపన్ వలెన్, శీఘ్రమ
య్యినవంశాగ్రణి రామువార్త గొని నేనీవారిధిం దాటి లం
కను జేరన్ వలె, చక్షురుత్సవముగాఁగానన్ వలెన్ జానకిన్- 28

బింక మ్మెప్పగ నేగి దైత్యపురిలో పృథ్వీజనుంజూచి రా
మాంకం బుంగర మిచ్చి రావలెను, నాయత్నమ్మునం దెట్టియా
తంకం బెవ్వ రొనర్చినన్ విలయవిధ్వస్తమ్ము గావించి యా
లంకన్ రావణుతోడ మోసి కొని హేలన్ రాము ముందుంచెదన్-

రామక్ష్మాపతి మాట నాదు హృదయ ప్రత్యగ్రమై మ్రోగగా,
భూమీపుత్రి పదమ్ము లీకనుల కింపుల్ గూర్చి వెల్గొందగా,
ఏమీ ! నాకొక అడ్డువచ్చునె, యొకండేదేనియున్ గల్గుచో
భీమోద్దామ మదీయ వాల విచల ద్విక్షేపముల్ చాలికన్ .

## మైనాకుఁడు

భావం బిట్టుల రామకార్య నియమ వ్యాపార సంపృక్తమై
ద్యోవీధిం బడి యంజనాసుతుడు విద్యుల్లేఖికావేగియై
యా వేశంబున నేగు దీక్షలఖిల మ్మా సాగరస్వామి తా
నై వీక్షించుచు తద్బలోన్నతుల కత్యాశ్చర్య ధుర్యాత్ముడై-

జగతిన్ మాయభివృద్ధికిన్ కతము విశ్వస్తుత్య చారిత్రుడా
సగరక్ష్మాపతి, తత్పవిత్రకుల సంజాతుండు శ్రీరాము దూ
తగ నేగున్ హనుమంతుఁ డీతనికి యాత్రాక్లేశముల్ లేని రీ
తిగ సాహాయ్యమొనర్పగా నతడు ప్రీతిం జిత్తమం దెంచుచున్.

పాతాళమ్మున నున్న దైత్యగణముల్ పైకెత్తి రాకుండగా
మూతం బెట్టె సురేంద్రుఁ డొక్క కుధరమ్మున్ మున్ను మైనాకునిన్ ,
ప్రీతిన్ వానిని బిల్చి సాగరుడు కోరెన్ రాము కార్యార్థ ము
ద్యోతప్రాభవమొప్ప నేగు హనుమంతున్ శ్రాంతు నొందింపంగా-

సూర్య భగవానుడే తన చుట్టు దిరుగు
పేరు కీర్తులు గలిగిన మేరుగిరికి
వరసుతుం డిల మైనాకపర్వతుండు,
గర్భమందు బంగరు నిధుల్ గలుగువాడు. **34**

మైనాకుండు సముద్రుమాట తనకున్ మర్యాద యే యౌనటం
చానందంబున లేచి పైకెదిగె, ఛాయావృక్ష సంశీతల
స్థానమ్ముల్ గల యున్నతాగ్రములతో, సౌ వర్ణ వర్ణాధికా
నూనప్రోజ్జ్వల కాంతితో, సకల సానుప్రాంతముల్ వెల్గగా.

శ్రమలు వాయంగ తనదు శీర్షమ్ము మీద
నాగు డని పిల్చె హనుమ నాయద్రివరుడు,
ధరణి నుపకారమతుల చైదమ్ము లిట్లె
తనరు నవ్యాజ సౌహార్ద తత్పరతల.

నేమ మెఱింగి స్వీయ కరణీయము సేయగ బూనినట్టి మే
ధామతి గాడ్పుపట్టి, తనదారికి నడ్డుగ నిల్చు దానవ
స్తోమము నుక్కడంప వెనుఁజూడని ధీరత నేగు వార్ధిపై
రామధనుస్సముద్గత శరప్రథమాన మహోగ్ర శక్తియై .

ఎఱుగం డాగిరిగూర్చి వాయుసుతు, ఁడేమీ ! యెంతకున్ బూనెనీ
గిరి నాకిట్టులనడ్డుగా నిలిచి యొక్కింతేని దారీయ డీ
గరువం బెట్టిదొ చూతు నేనని నగాగ్రప్రస్త రోపాంతమం
దురమున్ నొక్కి యణంచె నద్రిసకల మ్మొక్కుమ్మడిన్ డీల్పడన్-

ఈ కపి కింత శక్తి కలదే యని యిబ్బుర మంది లేచి మై
నాకుడు మానవాకృతిని నాయన ! యోహనుమంత నిల్వుమీ
నాకడ కొంతసేపు పయనమ్మున నీకు లభించు శ్రాంతి నా
యీ కుసుమావనీజ రమణీయ సుశీతల సాను సీమలన్.

ఒక సహస్ర మదేభము లుక్కుమీఱి
త్రొక్కినను నొవ్వరాని సత్త్వుడనునేను
నీయురస్పర్శ నణగారి పోయి తిటుల
ఎంత బలంతు డగుదు వోయీ కపీంద్ర ! 40

నీకును మేలుగోరి యిట నిల్చితి, నీపిత వాయుదేవుడే
యాకడ నన్నునిల్పెను సురేంద్రుని వజ్రమునుండి రక్షయున్
నాకొనరింప, మీరు సుమనస్కులు ప్రత్యుపకార మైన యా
నాకరణీయ మిద్దియు మనమ్మున వేఱుగ నెంచఁబోకుమీ.

విను మిం కొక్కటి, నీకు సత్కృతియు మావిధ్యుక్త ధర్మంబు,రా
ముని పూర్వీకులె వార్ధి వృద్ధి కిలపై మూలమ్ము, శ్రీరామ చం
ద్రుని కార్యమ్మున నేగు నిన్గని సముద్రుండిట్లు నన్గోరె నో
హనుమా! త్వాదృశులందు చూపగల మర్యాదమ్మె మర్మాదయౌ

అను మైనాకుని పల్కులందు రఘు వంశాధీశు డారామ చం
ద్రుని మాటన్ విని నంత మానసము నందున్ హర్ష ముత్కర్షమై
హనుమంతుండును మందహాసరుచిరాస్యస్ఫాదు సంభాషణ
మ్మున బల్కెన్ వినయాప్తవాక్యముల కూర్ముల్ తీపు లూరింపగన్.

సంతోషించితి మీరొనర్పదగు నీ సత్కార మర్యాదకున్
స్వాంతంబందున గాని, రామ విభు కార్యమ్మందు నాలస్యమా
వంతైనన్ పలుపంగఁజాల నిక, మీ యాతిథ్య సత్కార్యమే
నెంతో ప్రీతిగ స్వీకరించినటులే యెంచన్ వలెన్ పర్వతా!

అని, ప్రియవాక్యముల్ పలికి యా హనుమంతుడు తా నురమ్ముతో
నణగెడు నట్లు నొక్కిన నగాగ్ర తలమ్మున నొవ్వ వాయగా
పుణికి కరమ్మునన్, త్వరగ పోవలయున్ సెలవీయుడంచు వం
దనమిడి, పర్వతాబ్ధులకు, దానరిగెన్ విను వీధి త్రోవలన్.

తన పయి నిల్చి నీవనధి దాటి నిశాటుని వీటి లోపలన్
జనకజ గాననౌ బరువు సర్వ, మి దెంతటి కష్టమైననున్
దనపని మాని, సౌఖ్యముల నాసగొనండు, విలంబ మోర్వ డా
హనుమయు; కార్య దీక్షితుల ఆశయ సాధన లిట్లు భాసిలున్. **46**

ఏ పిన నాడొ మిన్నులకు నేగిన ధైర్య జవాతిరేక సం
ధాపరి దీప్తమైన ప్రభుతల్ పది రెట్లయి నేడిటన్ననము
ద్రోపరి భాగ లంఘన సముద్యమ మం దగు పించె తీవ్రదీ
క్షాపటు కౌశల ప్రథిత సత్త్వ జవమ్ములు వాయుసూతిలో.

హేలన్ లేచిన లేమటే తడవుగా నేగెన్ నభోవీథిపై
తాలోత్తాల విజృంభమాణము తనూ ధైర్యంబు దీపింప, దిగ్
వ్యాలో లాంబుద మాలికల్ చెదరి పోవన్, తారకాగోళముల్
తూలన్ దారుల వెంబడిన్, పవన పుత్రుండుగ్ర వేగోద్ధతిన్.

## నాగమాత సురస

వినుత ప్రాభవుడై, పరాక్రమ రమా విక్రాంతి సంపన్నుడై
హనుమంతుం డుదధిన్ దరించు బల విద్యాపాట వోద్రేకముల్
గనియున్, వాని బలాతిరేకముఁ బరీక్షల్ సేయగాఁ బంపి నా
రిన తేజస్విని నాగమాత సురసన్ బృందారకుల్ నేర్పుమై.

నరకప్రాయము జిహ్వాకోద్భవ దురంతాగ్నిచ్ఛటా పాటవ
స్ఫురణాపాయము, నాసికావివర సంభూతోగ్ర ధూమాబ్దని
ర్భరితోచ్ఛ్వాస నికాయమైన నిజవక్త్రస్థాన మూర్వీధ్ర కం
దర విస్తారము జేసి నిల్చె హనుమన్ ధట్టించు చా కాంతయున్.

హనుమంతా! విను మాకటంబడితి, నాకాహారముంగా ని నుం
గొన బంపించిరి సర్వదేవతలు నాకోర్కెన్ వడిన్ దీర్పగా
జనుమీ వక్త్రమునందు తిందు కపిమాంసం బెంతయో యిష్టమై
దనరున్ నోటికి, నేటికీ పగిది లబ్ధంబయ్యె నీదేహమున్.

తెలియునోలేదొ వానర ధీర ! నీకు
బ్రహ్మ వర మిది నాకు, నెవ్వండు గాని
నాదు వక్త్రంబు దాటి చనంగ లేడు
రమ్మ, చవిఁజూతు నిన్నువేగమ్మ యనిన. 52

ననుబోనీయక దారి కడ్డుగ తనంతన్ వచ్చి తీండ్రించి నన్
దిన నుంకించిన దెవ్వరీ దనుజ ! ఏతీరైన గాని మ్మటం
చును దానేగెడి రామ కార్య విధులన్ సూచించి యావెన్కవ
త్తును నన్నుం దినవచ్చు నంచు హను మంతుడెంత యో చెప్పినన్.

తెరువుల నెంచి తా బయలు దేరిన దెప్పుడు వార్ధి దూరముం
దరియగ నింతలోపలనె దానవి యీమె యొకర్తు వచ్చి యీ
తెలుగున మాటలాడుట మదిన్ దల పోయ కుశాగ్ర బుద్ధి యా
కరువలిపట్టి కేదియొ యొకానొక వింతగ దోచెనంతయున్.

కావలె నంచు వచ్చి, ప్లవగప్రభు వుత్తమ వర్తనుండు సు
గ్రీవుని కొల్వు జేరితిని కేవల మాగురు దేవు నాజ్ఞగా
సేవలొనర్ప, దేవతలె సేయగ నిట్టుల వేఱు కారణం
బావల నుండగావలయు నాతురపాటది యేల నింతలో.

వైరులు విక్రమించి పయిపైఁబడినన్, చతురత్వమేర్పడన్
వేఱగు సాధన మ్మెడద నెంచుట యర్థమొకొక్క మారు, దు
ర్వార బలప్రయోగముల వారి నెదుర్చుట కంటె యంచు సా
మీరియు చిత్తమం దొకనిమేషము యోచనసేయు నంతలో.

నను నెట్లో గికురించి పోఁదలచు పన్నాగమ్ములన్ నమ్మబో
వను కోతీ ! యని, వక్త్ర భీకర బిల ద్వారంబు మిన్నంటు ద
న్కను దత్కాంతయు బెంచి పైపయికి రాగా జూచి, సామీరి త
న్వను రెట్టింపుగ బెంచి మోము చిఱు నవ్వుల్ దొల్క నిల్చుండినన్.

నామాటల్ విన నవ్వులాటలుగ గన్పట్టెన్ గదా యంచు ది
క్సీమన్ దాక మఱింతయై సురస యాక్షేపింప వాతాత్మజుం
డామాయన్ గని యిట్లు గాదనుచు "నేమమ్మా భవద్వక్త్రవీ
ధీమధ్యంబును జేరగావలయు ప్రీతిన్ నీకు నింతేకదా. 58

అని యామారుతి కామరూపమున దానంగుష్ఠ మాత్రుండునై
చని యాదానవి నోటిలోనికి, నిమేషార్ధమ్ము కాలమ్ములో
ననె దావెల్వడి వచ్చె రాహుకృత బంధమ్మున్ విడంద్రొక్కి వ
చ్చిన చంద్రుంబలె సర్వమా సురసకున్ జిత్రాతి చిత్రమ్ముగా.

వెలువడి వచ్చి యట్లు కపివీరుడు వేగమె నింగి నుండి యా
లలనను జూచి నీ ప్రతినలన్ నెఱవేర్చితి నమ్మ వేగ బో
వలయును, రావణుండు జెఱబట్టిన జానకి జాడ జూచిరా
వలయును గాన నన్ను నిలుపన్ వలదంచును వేడి నంతటన్.

దానవివేషమున్ విడచి దక్షుని కూతురు నాగమాత యా
వానర ముఖ్యునిం గని భవద్బల ధైర్యము లే నెఱుంగుదున్
గాని సురల్ పొనర్చి రిటు గావలె నంచు విలంబనమ్ము, నీ
పూనిన యత్నముల్ విజయమున్ గొనగా ననుచున్ వచింపగా.

నెలవుం గైకొని నాగమాతకడ రాశీభూతవేగార్భటీ
విలసద్విక్రమ కాంతి రేఖ యగుచున్ విన్వీధి కాయంజనా
లలనాపుత్రుడు వార్ధి సంతరణ లీలాలోలు డై యేగు వి
ద్యలు సర్వమ్ము సుపర్వులుం గని రమందానంద మగ్నాత్ములై.

ఏకైకాశయ దీక్షితాత్ముడు రయోత్కృష్ట ప్రభావంతుడై
యాకాశమ్మున నుండి చూచెను మహోద్యత్ధ్వాన సంలీనవీ
చీకల్లోల మహాబ్ధి తీర మది యే చిన్నమ్మె నేత్రోత్సవం
బైకన్పట్టునె యంచు వాయుతనయుం డాందోళిత స్వాంతుఁడై

వారిధి దూరమున్ వెదకు పాటున దిక్కులబట్టి జూచు ఆ
మారుతి కన్గవన్ దడిపి, మానస మందు గలంచు వేదనా
భారము సర్వ మొక్క పరి పైకుబికెన్ దనుజుండు హేతువై
ధారుణిజారఘూత్తముల తాళగ లేని వియోగ దుఃఖముల్. 64

ఆకడ రాము భార్య జనకాత్మజ నిర్మల నైగ మార్థతే
జోకమనీయ మార్గపరిశుద్ధము, దుర్దమ దుష్ట దానవా
నీకము మధ్య నేపగిది నిష్ఠురముల్ పడుచున్ దినమ్ములన్
శోకమయమ్ముగా గడపి శోషిలు చున్నదొ దిక్కుగానకన్.

ఈకడఁజూడగా దశరథేశుని యజ్ఞఫలోపలబ్ధ సు
శ్రీక మహానిధాన మగు శ్రీ రఘు రాముడు, జానకీవియో
గాకుల వేదనాహృదయు డాతని నూఅట గొల్చు లక్ష్మణుం
డేకద యొక్కరుం డచట నిద్రయు హారము లేని సేవలన్.

లోకక్షేమ విధాన పాలన కళాలోక ప్రసిద్ధం బయో
ధ్యాకళ్యాణ మహాసనాధిపులు సీతారాములా, యిట్టి చీ
కాకుల్ బొంది కలంతలం బడుట లీకష్టవ్యధాకారకుల్
రాకాసుల్ నశియించు కాల మదియున్ ప్రాప్తించు టేనాటికో.

**సింహిక**

అని లోలో దల పోయుచున్ రయముతో నాకాశవీధిన్ వడిన్
హనుమంతుండును బోవగా నతని ఛాయన్ బట్టి యంబోధిలో
తున కే శక్తియొ లాగు చున్నటుల చేతోవీధికిం దోచినం
తన కన్పించె నొకర్తు కా వనధి మధ్యన్ మున్గుచున్ దేలుచున్.

ఉగ్రాకార విపత్కర ప్రబలవేషోన్మేష సంపుష్ట దం
ష్ట్రాగ్రప్రౌఢ ముఖంబు గల్గిన మహాశక్తిన్ గనెన్ విస్మయ
వ్యగ్రుండై కపి, యిట్టి శక్తు లుదధిన్ వాసించు చున్నట్లు మున్
సుగ్రీవుం డని నట్టి మాట మదిలో సుస్పష్టమై తోచగా.

నీడను బట్టి ప్రాణి తతినిన్ గబళించెడు సింహికాఖ్యయీ
చాడుపు నన్ జరించు నొక శక్తి యిదేయను చున్ గ్రహించి యా
గాడుపు పట్టి కొండవలె కాయము పెంచుట జూచి, యామె తో
డ్తోడన యాసమీరసుతు దుస్సహరూపము గాంచి క్రుద్ధయై. 70

రంహోభీకరమ్మై, క్షుధాకుల వికారాకార కోపోగ్రమా
సింహమ్ముం బలె సింహికాసుర మహోజ్జృంభాధి కోద్యత్ క్రు ధా
బంహిష్ఠమ్ముగ నోరు పెంచుమను పై పై దూకగా, రక్కసిన్
సంహారించు క్షణమ్మదే యనుచు యాసామీరి సన్నద్ధుడై

ఊకున దూకి యామె వివృతోత్కట వక్త్రమహాబిలమ్ము నం
దాకపి వీరు డూర్జితనఖమ్ములు గ్రుచ్చుచు శ్వాస కోశమున్
బీకి పెకల్చి ప్రోవులను బెట్టగ వచ్చిన దాపిశాచియున్,
వాకలు వాకలై కలసి వారిధి నిండిన వామెరక్తముల్.

చప్పుడు లేని యుద్ధమున జచ్చిన సింహిక దేహఖండముల్
గుప్పలు నై పయోధి క్రిమి కోటికి నాకలి దీర్చి కూటికిన్
దెప్పర మౌచు, వార్ధి పరిధిన్ బరు వెత్తు విహంగ రాజికిన్
దెప్పలునై శ్రమంబుడిపి, తేలుచు బోయిన వాజలమ్ములన్.

కాలిడినన్ మహేంద్రగిరి గ్రక్కదలెన్, సురసాపరీక్షలుం
జాలగలే దకారణమె చంపగ వచ్చిన సింహి కాంగనా
భీలపరాక్రమోద్యమము వీగి నశించెను; మూడు సారులీ
చాలున వాయుసూను బల శక్తుల జూచి సురల్ నుతించిరిన్.

ఎందఱెందఱి నిట్లు సింహికయుఁ బట్టి
ప్రాణములు బలిగొన్నదోగాని నేటి
కొక్క కపివీరు డాయమ నుక్క డించె,
బ్రహ్మ యిటు వ్రాసె నేమొ తాత్పాలమందు.

సాగిన దాప్రయాణ మొక చాడ్పున మారుతికిన్ బలోత్సు కో
ద్వేగముగా, రఘూత్తముని దివ్య పదాంబుజ భక్తి భావనా
యోగముగా, సదాశయ సమున్నత కౌశల కార్యసాధనో
ద్యోగముగా, నెదిర్చిన రిపూత్కరమున్ దునుమాడు యాగమై. 76

చుక్కల దారిలోన పొగచూఱిన మేఘ సమూహమందునన్
ఱెక్కలు గల్గు పర్వతము రీతిగ నేగు సమీర సూతి స
మ్యక్కమనీయ రూపమహిమన్ గని కిన్నర సిద్ధ సాధ్యులా
రక్కసు లీల్గు కాలము త్వరన్ గలదంచు దలంచి రాత్మలన్.

ధనురాముక్త శరమ్ముగా, ప్రబలఫూత్కారోగ్ర సర్పమ్ముగా;
కనదాకాశ చరత్తటి త్క్రమముగా, గాఢ త్వరాహంకృతిం
జనె విన్వీధుల నాంజనేయ మగు భాస్వత్ శక్తి రూప మ్మొకం
డనిదంపూర్వ మహాస్వరూపమయి వీక్షాతీత వేగాకృతిన్.

తన శిష్యుం డిటు లెండలం బడుచు సంతాపించుటన్ జూచి య
య్యినుడున్ మబ్బుల చాటునం జని శ్రమంబీగెన్, సుతుందన్వె న
య్యనిలుండున్ శిశి రోర్మికల్ నెఱపి మార్గాయాసముల్ వోవగా,
దనరున్ బిన్నలయందు నిట్లె కద పెద్దల్ చూపు వాత్సల్యముల్.

**లంకాతీరము**

ఎప్పుడు వార్ధి అంతమగు, నెప్పటి కేనును లంక కేగుదున్,
తప్పుడు దారి పట్టను గదాయని దిక్కుల యందు ఱెక్కలన్
విప్పుచు నున్న చీకటుల వెంబడి నేగెను గాలిపట్టి యా
యుప్పర మందునన్ దన రయోద్ధతి బెంచుచు నంతకంతకున్.

వందలు నేత్రముల్ గలుగు వారల కైనను దృక్పథమ్ము నం
దందని వేగ ధూర్వహుడు నై చను చుండిన గాడ్పు పట్టిక
న్విందుగ గోచరించె పృథివీధర కానన వృక్షపంక్తికా
సుందర పుష్పసౌరభ రసోల్బణ పూరము వార్ధి తీరమున్.

తీరము జూడగానె కడుతేలికయ్యె తన గుండె యందునన్
వారిధి దాటు వేళ బిగ బట్టిన యూపిరి సాగి వచ్చె సా
మీరికి, దూరసాగరపు మేరలెఱింగిన శేముషీలసత్
సారము లామహామహుని సత్త్వ జవాతి శయమ్ము లెన్నగన్. 82

వేగము తగ్గజేసి విను వీథుల నుండియె వార్ధి వీచికా
భోగవసీ మనోహరము, భూరిమణి ప్రకరాంశు కాంతి సం
యోగము, తీరసుందర మహోన్నత భూమిధరమ్ము గాంచె చే
తోగతి సంభ్రమప్రమద తుందిల మై యలరంగ నాతడున్.

ఆనగ సీమ నిర్మితమునై పాలు పారుచునుండు, నవ్యశో
భానవ రత్న కాంచన విభాసుర సుందర కుడ్య గోపుర
స్థానమనోజ్ఞకేళివన సౌధ విలాస విరాజితమ్ము లం
కానగరమ్మనంగ దశకంఠుడు రావణు రాజ ధానియై.

కనదుద్యన్మహనీయతేజమున నా కాశమ్మునం దర్కు డుం
జను చందమ్మున వార్ధి దూరము సమస్తమ్మున్ మహోత్సాహవే
గనిరూఢిం జని యంజనాసుతుడు లంకాద్వీప తీరమ్ము నం
దున వ్రాలెన్ బటు వీర విక్రమ కళా ధుర్యోరు తేజస్వియై.

సురకును దాసులై నిదుర జొక్కుచు కావలి కాయుచున్నవా
రెఱుగ రొకింత నాయెడకునెవ్వరు వచ్చిరి యెవ్వరేగి రా
తెఱగుల నేమియున్ ; మదికి దృప్తిగ మారుతి సంచరించె సా
గరతట మందు జంతు విహగమ్ములు భీతిలి పర్వులెత్తగన్.

ఆలంకాపుర కాంచనోజ్జ్వల మణీ హర్మ్య స్ఫురత్ సుందర
శ్రీలం జూచుచు విస్మయంపడి కపి శ్రేష్టుండు తానిప్పుడీ
శైలాభాకృతి బోవు చో దనుజు లాశ్చర్యంబునం జూతురీ
లీలన్ గార్యము కూడ కాదనుచు దాల్చెన్ వేగ స్వల్పాకృతిన్

బలి బలమ్ము హరింపగ వామనుడు త్రి
విక్రమ స్ఫూర్తి నందిన విధము దోప
పటుతరోగ్ర రూపమ్మున వనధి దాటి
మరల నిజరూపమును దాల్చె మారుతియును. 88

ఆచిఱు కోతి రాము చరణాంబుజ బంధుర భక్తి భావనా
శ్రీ చటుల ప్రభాన్వితము, సింధు జలప్రవిలంఘనాతి వే
గోచిత శక్తి మంత మసురోత్కర మర్దన దుర్ద మోగ్రరే
ఖాచణ రూపమం చెఱుకఁగానరు చూచిన వారలెవ్వరున్.

**ఆశ్వా సాంతము**

నీవార్తను గొని సీతా
దేవికి దెలుపగ బలితపు దెగువున వనరా
శీవిస్తృతి దూకిన కపి
ధీవరు కథ యిది మృదుపద దీప్తము రామా !

భక్తలోకమానస చక్ర వర్తి వీవు
మునివినుత శాశ్వతానందమూర్తి వీవు,
రమ్య కీర్తివి, ధర్మ మార్గ ప్రవర్తి
వతుల కరుణార్ద్ర సుందరా కృతివి రామ !

వననిధి లంఘన కృతిలో
హనుమంతుని వేగ విక్ర మాస్పద శక్తిన్
వినిచితి నానేర్చు కొలఁది
ప్రణుతామల పదపదార్థ ఫణితిని రామా !

సకల నృపాల కోటి మణిసారకిరీట మరీచి మాలికా
ప్రకర మనోజ్ఞ కాంతి చయరంజిత రమ్యపదాబ్జ సుందరా !
అకలుష వేద వాద పరమార్థ వినిర్మల తత్త్వమార్గ సం
ప్రకట మహాశయప్రథిత మానవనీతి విధా విభాసురా ! 93

ఇది శ్రీ హనుమత్ప్రబంధము ద్వితీయ భాగము నందు
హనుమంతునిసముద్రలంఘనము,మైనాకాద్రిసమాదరణసురసాపరీక్ష సింహికావధ
లంకాతీర ప్రవేశము అను కథలుగల
ప్రథమాశ్వాసము.

# శ్రీ హనుమత్ప్రబంధము

## ద్వితీయ భాగము - ద్వితీయాశ్వాసము

### లంకాప్రవేశము

శ్రీకౌసల్యాసుప్రజ,
రాకా విమలేందు కాంతి రమ్య ముఖాబ్జా !
శ్రీకర నవకల్పక భుజా !
సాకేత పురాధి రాజ ! సమధికతేజా !

దేవా శ్రీరామచంద్రా ! అవధరింపుము

శ్రీలేపారు సువర్ణ రత్నసుషమా శృంగార హర్మ్యాంచి తం
బాలంకాపుర మందు జేరిన క్షణమ్మందున్ బ్రసన్నాస్యరే
ఖాలావణ్యము, రామచంద్ర విభు నాకారమ్ము రోచిస్ఫుర
ల్లీలా రమ్యముగా కనుంగవను వెల్గెన్ అంజనాసూతికిన్.

ఆసలు మోసులెత్తు విజయప్రవిలాస వికాస భాగ్య ని
న్యాసము లూడి పడ్డవనగా తన వెన్క శుభాశిషోల్లస
ద్భాసుర మూర్తి రాముని కృపాబలమున్న దటన్న ధైర్యవి
శ్వాసములన్ దలంచె దనస్వామిని మారుతి నమ్ర శీర్షుడై.

పున్నెము నెంచి క్రొందళుకుఁబూవులఁజేసిన పూర్వపూజలె
న్నెన్నియొ సత్ఫలమ్ములయి ఈ రఘురాముని పాదసేవ నే
గన్నది నేడు తద్విభుని కర్జము చిత్తమొకింతయుంచి యే
చిన్నముఁజేసినన్ సఫల సిద్ధుల గాంచదె పుట్టు పుర్విపై.

ఆతని యర్ధదేహము దయాహృద యాంచిత మూర్తి సీత, ప్ర
స్ఫీత సమస్త ధర్మగుణ చిత్తులు జ్ఞానరస స్వరూపు లీ
సీతయు రామచంద్రుడును, జీవన భాగ్యముగా కృపారసా
స్ఫీతులు వీరికిర్వురికిఁ బ్రీతిగ సేవలు సేయ నోచితిన్.

అనిలోలో దల పోసి కొంతతడ వాహన్మంతు డుల్లమ్మునం
దనివిం జెంది యొకింత, ముందుగల కర్తవ్యమ్ము నూహించి యీ
మును మాపుం గను జీకటుల్ తగు హితమ్మౌం గూర్చునట్లుండుటల్
గని తారాడెను వార్ధి తీరమున లంకం గాంచు నుత్సాహియై.

అవని జాన్వేషణమ్మునం దన్యులకును
హనుమ గనపడ కుండగ నపర సంధ్య
నర్కుఁడొదిగెను, చీకటులలముకొనియె;
శిష్యు సేమమె గురువు వాంఛించు నెపుడు.

దానవ నాథు పట్టణపు దారుల దూరము లెట్టులుండు నా
వైనము ముందెఱుంగుట యవశ్యమటంచు మదిందలంచి యె
త్తైన స్థలమ్ము దీని కను వౌనని దాపున నున్న శైల మా
వానర వీరుడుం గని యపారముదంబును బొందె నాత్మలో.

ఆలోలేక్షణ రేఖికావిలస నోపాయమ్ము, దీవ్యద్భులా
భీలౌజ్జ్వల్య మహమ్ము, రాక్షసచమూ విధ్వంస కోద్వేగకో
పాలంబాధిక చండ తైజసము, స్వీయారంభ జాగార్యమై
గోలాంగూలము సంచరించనది తత్ క్షోణీధరాగ్రమ్మునన్.

చారులతాతరు ప్రతతి సంపదలన్ గను విందు గూర్చి చె
ల్వారెడు నాత్రికూట కుధరాగ్రము నుండి విచిత్ర సౌధవీ
ధీరుచిర ప్రదేశ పరిదీప్త మనోహర దృశ్యమైన లం
కారమణీయపట్టణము గన్గొనె నల్గడ నాంజనేయుడున్.

ఆకాశమ్మున బట్టి ప్రేలు ననగా ఆశ్చర్యముంగొల్పు నా
ప్రాకారమ్ములు వప్రగోపురములున్ ప్రాసాదముల్ దేవతా
నీకమ్మైనను పొందరాని రుచిరోన్నిద్రమ్ము లావీటికే
లోకమ్మందున సాటిగానని రమాలోలాచ్చ సౌందర్యముల్.

అమరాధీశునకే నలభ్యము నసాధ్యంబౌ మహావైభ వో
త్తమ రత్నస్రగి తోరు కాంతిమయ సౌధ శ్రేణితో, కేళికా
రమణీయోపవనాంతరామల సరః ప్రాంతమ్ముతో నింద్రనీ
లమణీనిర్మిత వేదికాతతులతో లంకాపురమ్మొప్పెడిన్.

అలసాయాత సమీర వీచికలు రమ్యారామ కేళీస్థలుల్
పులుగుంబాటలు తీయ తావులును పూవుందేనియల్ తమ్మిపూ
కొలనుల్ పుప్పొడి బాట లా పురమునం గ్రొంగ్రొత్తలై యెల్లవే
ళల సొంపుల్ దొనకున్ వసంత దిన లీలాలోల రమ్యమ్ములై

ఆకాశమ్మున చంద్ర బింబము లసంఖ్యానీకమై వెల్గ న
ట్లా కాసారపు నీలినీరముల పద్మానీక ముత్ఫుల్ల శో
భాకారమ్ముల కాంచనామల కళావ్యాలోల దీప్తుల్ దిశా
వ్యాకీర్ణమ్ముగ నింపు చూపరుల కాహ్లాద ప్రకర్షమ్ముగా.

అలరుచు చెట్టు చెట్టునకు నాగిరియందున నెక్కి లంకమున్
గలయగ జూచు హన్మపయి నల్లన క్రొన్నునతీవ లెల్ల పూ
వుల జడి నింపు చాతనికి పూజలు జేసిన చంద మొప్పె నీ
యిలపయి పుణ్యకార్యమతు లేయెడ నైనను పూజ్యులేకదా.

ఒకగట్టెక్కితి రామ కార్య నియ తోద్యోగాత్త సంరంభమం
దిక వేఱొక్కటి నాకిటన్ మిగిలె, ధాత్రీ జాత సందర్శనో
త్సుక కర్తవ్యము, రామమంత్ర మహితాస్తోకప్రభావంతమై
సకలమ్మున్ దనరారగావలె నికన్ సాఫల్యసంపూర్ణమై. 109

ఆయుధ హస్తులై సకల మానగరమ్మున దారులన్నియున్
రేయి బవల్ భటాళి కను ఱెప్పలు మూయక కాయుచుండగా
నేయెడ కెట్టు లేగుటయు నేరికి సాధ్యము, సాధ్యమైనచో
నీయసు రోగ్రసేన నెదిరించి బయల్పడి పోవవచ్చునే.

గడగడ లాడి పోవు త్రిజగమ్ములు రావణు డన్నపేరు వి
న్నడినను చాలు, నాదితిజనాథుడు మంచియు చెడ్డలేని దుం
దుడుకుల మాయలా డతని తుంటరి చేతల కోర్చి యింతకున్
పుడమికుమారి నేటి కసువుల్ విడ నాడక నిల్చి యుండునా.

అనఘుండుత్తమ నైగ మార్గ పరిశుద్ధాత్ముండు శ్రీరామచం
ద్రుని కార్యమ్మిది, సాను కూలమగు దారుల్ తీరు లూహించినే
చనుటే మేలు క్షణక్షణమ్మున సమస్తక్లేశ కష్టమ్ము లీ
దనుజుల్ సృష్టి యొనర్చ జాలిన దురంత క్రూర కర్మోద్ధతుల్.

వేసిన లెక్కలే తిరిగి వేయుచు మారుతి యి ట్లె దో ప్రతి
జ్ఞాసముపేత నిశ్చయమునం దొక దారికి వచ్చి ముందు పృ
థ్వీ సుతనుం గనుంగొని వేఱుగ చేయగలట్టి కార్య వి
న్యాసము చూతు నేనను సమన్వయ మాత్మ దలంచె నర్థిమై.

చలువలు గ్రమ్ము చుండిన నిశాసమయమ్మది, తత్పురమ్మునన్
లలితసరో వరామల జలమ్ముల నీదుచు నున్న రీతిగా
నలరెను నింగి నున్న యమృతాంశుడు, చారు తరప్రసూన గం
ధిలములు, మందవాయువులు దిక్కులు బట్టి చరించె నిమ్ముగా.

వీచిన చల్లగాలి మృదు వీవనలందు శుభప్రమోద సం
సూచనలేవొ వెల్వడిన చొప్పులలో నొక త్రోవ నెమ్మదిన్
దోచినటుల్ రఘూత్తముని దూత ప్రసన్నత దాల్చి నిల్చె నా
లోచన లొక్కతీరయి వెలుంగును గన్న వికాసమొప్పగన్. 115

ఎవ్వరును తన రాక గుర్తింప కుండ
స్వీయ రూపమ్ము హనుమ యల్పీకరించి
గిరిని డిగి వెన్క ముందుల నరసి కొనుచు,
దానవపురమ్ము జొచ్చె మెత్తనగు నడక.

## లంఖిణి

ఎలమి మఱింత చిన్నగ కుదించిన రూపము దాచుకొంచు నే
యలికిడి లేని కాల్నడల నాహనుమంతుడు ద్వారసీమలో
పల పదముంచి నట్లె కనుపట్టదు, అంతటిలోనె పెద్దదా
నెలుగున ఆగు మాగుము కపీ ! యెటు వచ్చితి వెట్లు పోదువున్.

మాదేశమ్మిది రావణప్రభువు సామ్రాజ్యమ్ము సర్వమ్ము, లం
కాదేవిన్ విను మేను లంఖిణిని ముఖ్యాలమ్ము లిచ్చోట లం
కాదుర్గమ్మును గాచు మందు నెవరున్ గాలూనగా లేరు నా
యాదేశమ్మున గాని, యీ దరికి నీవై యెట్లు రాగల్గితో.

గుప్పెడి పట్టునం దిముడు కో సరిపోవని కోతి పిల్ల వే
చప్పుడు లేక వచ్చితివి చాలును, వచ్చిన దారి పొమ్మికన్
తప్పితి వేని నాపలుకు తప్పదు నీకిట పుర్వు వోలె నా
చెప్పున నల్గి చచ్చుటలు చెప్పితి నీహిత మెంచి వానరా !

అని గర్జించుచు రోష భీషణ వికారాకారయౌ దానవాం
గన యొక్కర్తుక మీద దూకు నటులన్ గన్పింప నల్పీయుడౌ
హనుమంతుండును పర్వతాకృతిగ దానై దుష్ట ధూమ్రస్వరూ
పనిరూఢోగ్ర మహోగ్రహప్రకటదర్పన్ లంఖిణిం గాంచుచున్.

సిరులన్ జెన్నలరారు మీనగర లక్ష్మిన్ జూడగా వచ్చితిన్
పరుషోక్తుల్ వచియించి నన్నుమఱలింపం జూచుటల్ పాడియే
త్వరగా నాలుగు మూలలం దిరిగి నాదారిన్ వడిన్ బోదు నన్
వెఱపింపం జన దిట్లు నీవనుచు గంభీరమ్ముగా బల్కినన్. 121

చిటికెన వ్రేల నొక్కినను జీవము లూడెడి కోతిగాడిటుల్
పటుతర రూపమై యెదిరి పల్కెనె? నిక్కము యీత డెవ్వడో
యటమట కాడు వీనిని దయంగను టేలని యామెయున్ మదో
త్కట ఘాఢ ముష్టితో బొడిచె గాడుపు పట్టి యురమ్ము నొవ్వగా.

తూలియు లేచి యామెపయి దూకుము మారుతి స్త్రీయటంచు నే
జాలిగ జూచి నాడ నిది జాలును గా కని యానిశాచరీ
ఫాలము రెండు చేతులను బట్టి బిగించి యణంచి నొక్కగా
కాలువలట్లు నెత్తురులు గ్రక్కుచు నేలను త్రెళ్ళి యామెయున్.

వీరవరుండ వాయుపుకపి ప్రవరా! విను మొక్క మాట నా
సారసగర్భుడే నుడివె సర్వము మున్ను కపీంద్రు డొక్కడీ
ధారుణి నన్ను పంపగల తక్షణ మీ యసురేంద్రు వైభవం
బాఱెడి బోవు సందనియె నయ్యది నిక్కము నిన్ను జూడగన్.

పరమ పతివ్రతామణిని భాసుర సద్గుణరాశి జానకిన్
చెఱగొను టీ నిశాట పతి చేయునకుం గతమయ్యె లంకలో
విరుగగ లాడ విష్టమగు తీరున వానర వీర ! యంచు నా
తరుణియు మాయమై చనె నదాటున చూపుల కందకుండగన్.

హనుమ నెమ్మది నచ్చెరు వయ్యె నొకటి;
దనుజులందును గూడ నుదాత్తమతులు
బహుతపశ్శాలు లుండి రేపాపముననొ
దురిత చిత్తులై పుట్టిరీ ధరణినసుచు.

ఆరాకాసిని జంపగానె తన కార్యంబింత సౌకర్యమై
దూరాదాగత రామ దూత మది సంతోషంబు నిండార లం
కారాజ్యమ్మును తేరి పారగని లెక్కల్ వేసి కొంచున్ పురిం
జేరం బోయెడి మార్గమున్ వెదుక జొచ్చెన్ నాలుగుంబ్రక్కలన్. 127

వారు తిరమ్ముగై నిలిచె వంత్రిపిలున్, గయ్యాళి వ్రాసి ని
వ్రారతి బొక్కియుండిరి పథమ్ముల గావలి వాండ్రు, నిక్కమై
ఘోరము నెద్ది మంచి సమయమ్మని ద్వారము లేని యొక్క ప్రా
కారము నెక్కి మారుతియు గ్రక్కున దూకె పురమ్ములోనికిన్.

తళతళ లాడు చందురుని తళ్కులలో విశదమ్ము లాగు లంకలో
బంగరు వీధు లన్నియును పొందుగ కాంతులతో వరిల్లె క్రొం
జిలుగుల పూవులన్ మిసిమి చెల్వుల ముత్తెములేరి మాలమా
లల నయిరమ్ము జల్లి నటులన్ వెలిరంగుల నిల్చెనుల్లొగన్.

## సీతాన్వేషణ

కదనపడి వైరిపై నెడను కాలిడి (త్రొక్కి)న యట్లు లంకలో
నడుగిడె నాంజనేయుడు మహాబలధీరమదేభరాజము
క్కడు పదముంచినంత వడవన్, తన యుల్లపు పాదమందునం
బడి యెటు లుండెనో ప్రబల పొలుప మంతగ గాడ్పు పట్టెకిన్.

బంగరు మేడలున్, మిసిమి పన్నెల రంగుల ద్వారబంధముల్,
ముంగిట లొల్కబోయు పొలుపుల్, సుమనస్సుమ దీర్ఘ వాసనా
రంగములై పురిన్ పలుతెలుంగుల చిత్తము లొంగ దీయు తీ
రుం గనియున్ రవంత పెడ (త్రోవలకున్ జనబోవ డాతడున్.

అనవరతప్రమోద కలి తాఖిల నూత్న వినోద హేలలై
వినబడుచుండు నాపురము వీథుల మంజుల గీతికాధ్వనుల్,
దనుజసతీ నటు న్మ్రోదు పదప్రకటీకృత రత్న నూపుర
స్వనములు, కామలోలుపనిశాటుల చిత్తములన్ గరంచుచున్.

పదునుల్ బెట్టిన వాడి కత్తులనుపై పైకెత్తి ఝుళ్ళించుచున్
కదనుల్ ద్రొక్కుచు పోదు రాదితిజు లంకాపట్టణమ్మందు నై
న్యదళమ్ముల్ నడు రేయి చీమ చిటుకన్నన్ గూడ విభ్రాంతిమై
పడి మార్లప్పుటు చూచి వత్తురు విధి వ్యగ్రైక నేత్రమ్ములన్.

ఆదశకంఠ దానవుని యజ్ఞహవిస్సులు దేవతా చయం
బాదట స్వీరించుచు నిజాకృతులన్ శుభముల్ వచించు చుం
బోదురు వెన్క, కెంత భయమో యత డన్నను, తత్ర్కతూత్సవా
మోద ఫల మ్మె వాని బలమున్ చలమున్ మదమత్సరమ్ములున్.

యోచన సాగునంతవర కూరక యుండుట యొప్ప దాపయిన్
చూచుట గాదు దైత్యపురి సొంపులు, వీలుగ నెప్పుడుండునో
వేచుట గూడ కాదు నడి వీధిని, పూనిన కార్య దీక్షలో
లేచిన వాడు లేచినటు లేగెను మారుతి జానకిం గనన్.

పిల్లియొ పిట్టకూనయొ పిపీలిక యో యయి సందుగొందు లం
దల్లన కామరూపమున నాపవనాత్మజుడేగి లంకలో
నెల్లెడ మెత్తనౌ అడుగు లిమ్మగ నుంచుచు సంచరించె ని
ల్లిల్లును జూచుకొం చెచట పృథ్విజ కన్పడు నోయటంచునున్.

పూచిన పూలతీవ పొలుపుల్ గల సుందరి, ధర్మ బద్ధమౌ
రాచకులమ్మునన్ బెరిగి రామ నృపాల వరేణ్యు భార్య కా
నోచిన పుణ్యశీల, తరుణుల్ గొనియాడెడు సాధ్వి సీత నే
డే చెఱయందు రాముని స్మరించుచు నశ్రువులొల్కు చున్నదో.

క్రూరులు నిర్నిరోధ పటుఘోర వికార భయంకరాకృతుల్
దారుణ మారణాయుధులు దైత్య చమూపతు లున్న చోటులున్
వారి విశాల సౌధములు వాయు జు డేగి ధరిత్రి జాతకై
ఓరిమి బట్టి జూచె నొక టొక్కటె, యామెయుఁగాన రాదెటన్.

పోయిన దారులన్ కనుల ముంగట నాతడు జూచె కామలీ
లాయిత హేలలం దగిలి యంగన లెల్లరు మద్యపానము
ద్రాయుత చిత్తులైన మదనార్తులు భర్తల బాహు బంధన
స్ఫాయదనంతకేళి రస సంగతి నుండిన పానశాలయున్.

ఇంతటి సుందరమ్ము లగు నీ నవరత్నసువర్ణసౌధ శు
ద్ధాంతము లీనిశాట మిథునాళి విలాస వినోదలీలలం
దంతము లేని భోగములకా! తుద కన్న జుగుప్సతోడనే
యంతయు జూచె నాపురమునందున హన్మయు పట్టువీడకన్.

## పుష్పకవిమానము

లేచిన కంటి తెప్పు ముకుళింపని నిశ్చల దీక్షపెంపునన్
జూచుచు పోవు దారి, నొక చో మహనీయ వినూత్న కాంతిమ
ద్దీపికలన్ దళత్తళలు దిక్కుల నింపు నపూర్వ గేహమున్
జూచె సమీర సూనుడు కనుల్ మిఱుమిట్లుగ విస్మయమ్మునన్.

మేఘపంక్తులలోని మెఱుపు తీవల గూర్చి
నిర్మించిన మనోజ్ఞ నిలయ మనగ,
నీలాభ్ర సీమలో నిలిచి తళ్కుల నీను
జిలుగు చుక్కల నేరి చేసి రనగ,
ఆకాశ వీధిలో హంస లెత్తుక మోయు
రమణీయ కాంచన రథమనంగ,
దివినుండి దిగివచ్చి భువిని వ్యాపించిన
సర్వ భాగ్యాన్విత స్వర్గమనగ.,

అబ్బురము గొల్పు నొక్క గృహమ్మునచట
అద్భుతాశ్చర్య చకితుడై హనుమ కనియె;
మహితపుష్పక నామ విమానమద్ది
విశ్వకర్మ నిర్మించిన విమలగృహము.

సురుచిరమై సురాధిపుని సుందర సౌధము కంటె రమ్యమై
మురువుల ప్రోవు లామనుల పూవులు రాశులు పోసి నట్టులై
నిరుపమ కాంతి రూప మహనీయత లందము గొన్న పుష్పకం
బరయుచు నిల్చెనచ్చటనె యాకపి ధీవరు డబ్బురంబునన్. 144

ఎంద ఱెక్కినన్ స్థలము మఱింతగలిగి
కామ గమనమ్ము లలర నాకమున గూడ
స్వామి యింగిత మ్మరయుచు సంచరించు
మాన్య మహిమాన్వితమగు విమానమద్ది.

నరసుర దానవుల్ త్రిభువనమ్ముల నెవ్వ రెఱుంగ నట్టి దు
స్తరతర సత్తపోవ్రతము సల్పికుబేరుడు బ్రహ్మ సత్కృపన్
వరముగ నావిమాన మొక భాగ్యముగాగొని యేగి యక్షు లె
ల్లరు గొలువన్ నిరంతర విలాసములన్ విహరించె దానిపై.

ఈర్ష్యాచిత్తుడు క్రూరకర్మరుడు దైత్యేశుందు దుర్మార్గ దు
ర్ధ ర్షుండై వని సోదరుండ నెడి చింతల్ లేక స్వార్థకృధా
మర్షంబొప్ప కుబేరునింగెలిచి డంబమ్మొప్పు మీరన్ బలో
త్కర్షప్రౌఢిమ నావిమానమున వీకం జేయు సంచారముల్.

## రావణుని నివాసము

చూచిన కొలంది మఱిమఱి చూడగోరు
రమ్య పుష్పకమ్మును వీడి రామ దూత
దూరమందుండి యే కడు సౌరు లొలయు
రావణుని సువిశాల హర్మ్యమును గనియె.

అది యొక కొండ కొండపయి అచ్చపు కాంచన రత్న కాంతి సం
పదల వెలుంగు చున్ నగరమధ్యగ సంతత మద్యపాన దు
ర్మద పలలాశి సైన్యపరిరక్షిత మై విలసిల్లు హర్మ్యమ
య్యది దశకంఠుడుం దనలలాంగులతో వసియించు సౌధమున్.

చందన శీతలం బగురుసారమనోహరసీమ, దేవతా
నందన పారిజాత సమ నవ్య వికస్వర పుష్ప గంధిలా
నందనివాసమా దితిజనాథుని వాసము ముజ్జగమ్ము లం 150
దందము నందు సాటి యగు నట్టిది కానని రాజవాసమున్.

౨౫. ఉ. కని కని ముంగట సర్వ విస్తార వారణమూపది సౌధముల్
మణిగణ కాంతి సమంచిత గోపుర మంజుల నూతన మందిరముల్
మునుకొని సాగెడు మోహన వాదనక్రమసుధామధు గానములున్
కని, విని, మారుతి కాలిడె అదితిజాధిప సుందర సౌధమునన్.

దితి జాధీసునివాస మొక్కటియు కాంతిస్ఫూర్తి రమ్యంబునై
యతి వేలాద్భుత పట్టణమ్ముగను హర్మ్య శ్రేణు లుద్యానముల్
లతికా శాలలు కేళికాద్రులు సరోలావణ్య పీఠస్థలుల్
రతి గేహమ్ముల తోడ నిండి వెలుగున్ రాత్రుల్ పవల్ వేడ్కలన్.

వినిపించున్ నడు రేయినిన్ దనుజపృథ్వీనాథు సౌధమ్మునన్
వినుతప్రాభవ కామినీ పద నటద్విన్యాస మంజీరని
స్వనముల్, గాన వినోద నాద విలస ద్వాద్యమ్ములున్ దైత్యనా
థుని దర్పోద్ధత ధైర్యసాహస బలస్తోత్రమ్ము లత్యంతమున్.

దానవ నాథు సౌధ సముదాయము వీధుల కొక్క యంతమే
కానగరాదు ! ద్వారముల కాంతులు జిమ్ము మణిప్రదీపి కా
నూన ఘృణీ వితానముల నొప్పిన కక్ష్యలు దాటి యా
వానరుడేగె దైత్యకులవల్లభునంతిపురమ్ములోనికిన్.

అవని జాన్వేషణ మ్మనుకూల మగునట్లు
సురలు వెల్గించిన జ్యోతియనగ
శ్రీ కళాదీప్తమౌ సీతాముఖద్యుతి
వానరాగ్రణి కాన వాలు గాగ,

మహిత పయోరాశి మథన వే ళోద్భూత
కమనీయ మధుసుధాకలశ మనగ
ఆకాశమందుండి హనుమ కాశీస్సులం
జలుపు శ్రీరాము తేజ మ్మనంగ 156

వెండి పంజరమున హంస విధము దోప,
వెన్నెలలు నింపి నీలాభ్ర వీధినుండి
ఉర్వి నెల్లర కాహ్లాద మొసగు చుండె
కలువ చెలికాడు చలువల వెలుగు ఱేడు.

తెలి వెలుగు వెన్నెలలు కరదీపికలుగ
దైత్యనాథుని గృహసముదాయమందు
కలయ వెదకెను నల్లడల్ గాడ్పు పట్టి
జనకజం జూచు నాసలు సందడింప.

రత్నరచితకుడ్యములందు బ్రతిఫలించు
చంద్రికల మఱింతగ బ్రకాశమ్ము నందె
మెఱపులట్లుగ దైత్య కామినుల నగలు,
ముంగురుల మధ్య వారి మోములును గూడ.

ముదితల మోము లెఱుంగని
సదమల హృదయుండు హనుమ జనకజ కొఱకై
మది నన్యమెఱుగక కనుల
కెదురయి న వనితలనట పరీక్షగ జూచెన్.

ఎంత వెదకిన గాని యేయెడను గూడ
కనుపడదు తల్లి, ఆదశకంఠు డెచట
నుంచెనో యేమొ యెటు జూతు నంచు మదిని
ఆశయు నిరాశ నడుమ నాహనుమ యుండె.

కాంతలతో ప్రసిద్ధమణి కాంచనదీపసమంచి తోజ్జ్వలత్
కాంతిమయప్రపంచమది, కన్నుల (జూచియు నమ్మలేని శు
ద్ధాంతము భోగ భాగ్యముల తావిదియున్ దనకైసృజించి యం
దంతము లేని సౌఖ్యముల నాదశకంఠుడు మున్గియుండెడున్. 162

మెచ్చియుతండు రావణు నమేయ సుఖమ్మున లంక నున్న సం
పచ్చియు మెల్ల, నాక్షణమె భావమునందలపోయు జానకిన్
మ్రుచ్చిలి దెచ్చినట్టి యధముండితడీపయి రాము చేతిలో
జచ్చుట దప్పదం చెవరు సాయము వచ్చిన ధైర్యమిచ్చినన్.

వననిధి దాటి నాడు, తన బాటకు నడ్డుగ నిల్చు వారినిన్
దునిమి నిశాటనాయకుని దుర్గము లంకను జేరినాడు, సీ
తనుగనలేని యట్టి కడు దైన్యమునన్ కపి వీరుడుండె చే
సిన పని కన్న మిన్నలయి చేయగ నుండిన చేత లెక్కువై.

హనుమంతుండును జూచె నా విపుల హర్మ్యాంతః పురమ్మందునన్
దనివిం గూర్చెడు మద్యముల్ మెసవి కాంతాలోక మధ్యమ్మునన్
తనువైస్మృత్యదశావశానుభవ నిద్రామగ్నుడౌ రాక్షసా
గ్రణి నత్యుగ్ర వికార విగ్రహసముత్కర్షున్ దశగ్రీవునిన్.

ఎత్తగు నద్రిపై మదపుటేనుగు విశ్రమ మంది నట్లుగా,
అత్తరు పూవుదండ లల రారెడు మంచము నందు మద్యపున్
మత్తున నుండె నాయసురనాథుడు దానవ కాంత లాత్మలం
దత్తిన భక్తితో చలువలారెడు వీవన లూని వీచగా.

ప్రియకాంతాతతి సంగ మోద్ధత రతిక్రీడా సముద్వేదనా
మయముల్ రావణు శ్వాసవాయువులు, శుంభత్ సర్ప నిశ్వాససం
చయమ ట్లంతి పురమ్మునన్ వెడలు టా సామీరి కొక్కింతగా
భయమై దూరము పోయి రావణుని రూప మ్మారసెన్ వింతగా.

ఇనుపగుదియల గలిపి నిర్మించి నటుల
ప్రబల భీకరమ్ములు కండరము లెసంగి,
ప్రక్క పయిబడి గాఢ నిద్రను మునింగి
రావణుండుండె నొక్కపర్వతము వోలె. 168

ఏనుగు తుండముల్ వలె బలీయపు బాహుయుగమ్ముగల్గు నా
దానవ నాథు మేన విశదమ్మయి కన్పడె నింద్రు తోడ పో
రై నపు డంది యుండిన శతారపు ఘాతము లట్టి ధీరుడా
ఆనత వైరి దానవకులాగ్రణిప్రాణము లెంత గట్టివో.

ఆయెడ రత్నదీప కళికామల కాంతి సమూహమధ్యమం
దాయత దీప్తితో వెలిగె నాయ సురాధిపుమోము, సుందర
శ్రీయుత లైన కాంతలిరు చెంతల వంతులు బూని సేవలన్
సేయుచు నుండి రా యసురు చేతుల లాలన లంది సౌఖ్యమున్

వాడని పూల సొంపలరు వాలు జడల్, మణి భూషణమ్ముల
ల్లాడెడు వేడె లా వలపు లాడుల మధ్యగ నున్న కాంత నా
గాడుపు పట్టి మాచె త్రిజగమ్ముల యందలి యంద మెల్ల తొ
ల్కాడెడి సుందరాంగి దనుజాధిపు పట్టపుదేవి నచ్చటన్.

ఆడం బోయెడి తీర్థ మెట్టెదుట నున్నట్లై మహాభాగ్యమే
తోడై వచ్చినరీతి పైకెగసి గంతుల్ వైచి నల్వైపులం
దాడెన్, తోకను ముద్దు బెట్టుకొని తారాడెన్, ధరాజాతనే
చూడం గల్గితి నంచు సారెకును చూచుం దాను మండోదరిన్.

హనుమకు నిల్వ లేదు మది నాముద మొక్క నిమేష కాలమున్
జనకజ సాధుభావ గుణ సంపద గల్గిన పుణ్యశీల, అ
య్యనిమిషు లందలేని సుగుణాన్విత దాశరథిరాము భార్య ఈ
దనుజ కులాధి నాథు దరి దాపుల జేరునె ? చేర దంచునున్.

పరకాంతం దిల కించుటల్ దనకు పాపమ్మంచు లో నెంచియున్
ధరణీ జార్థమె చూచి నా నిటుల కాంతాలోకమున్ కామత
త్పరదృష్టుల్ తనకిందు లేవనుచు చిత్తమ్మందు భావించి తా
నరిగెన్ మారుతి వాడవాడలను సీతాన్వేషణాసక్తితో. 174

దనుజుడు రాముపై గినిసి ధాత్రిజ నిప్పుడు జంపియుండునో,
దనుజుల మధ్య నెంతయని తాలిమి దాసహాయుండు నాత్మలో
తనగుణ శీల రక్షణకు దప్పక ప్రాణములన్ ద్యజించి యే
జనకజయుండు నేనిపటు సర్వము లంకను జూచితిన్‌గదా.

నను వీక్షించిన యంగదాదులు వడిన్ బ్రశ్నింతు రత్యంతతతో
హనుమా ! లంకకు నేగి యేపనులు నీవచ్చోట సాధించి నా
వనినన్, చెప్పుట కేమియున్నదిక నే నాలస్యముంజేయుచో
దనువుల్ వీడుదు రావనేచరులు యత్నంబెల్ల వ్యర్థమ్మయై.

క్రూరుం డాదశకంఠు డంబరమునన్ గొంపోవుచున్నప్పు డా
నారీ రత్నమె నేలమీదబడి ప్రాణాల్ వీడెనో, జానకిన్
కోరల్ సాచుచు నాతడే తినియె నో కోర్క్యేల్ రుచింపంగ సీ
తారామామణి నెందునుం గనని యత్నంబయ్యె నాపాలిటన్.

తారావీధి నవార్యవేగమున సీతం బట్టి కామాన్విత
ప్రారంభుం డసురేశు డట్లు కొనిపోవం జూచి దేవాంగనా
వారం బేమి తలంచె నోయనిన భావావేశ యై సీతదా
నారాట మ్మవమానమంది చనె నో ప్రాయోప వేశమ్మునన్.

ధరణిజరూపమెట్టిదియొ తానయి చూడగలేదు నేటికిన్
సురుచిర ధర్మమార్గపరిశుద్ధ మనస్విని రామ నామత
త్పరమననమ్ము వీడని తపస్విని, సాధుగుణైక శీల నా
పరమ పతివ్రతన్ గనెడు భాగ్యము గల్గనె యన్న చింతలో

బ్రాతిన్ బూనిన కార్యమిట్లు నెఱవేర్ప న్లేని దీనుండనై
సీతంగానక వెన్క కేగు నెడ కిష్కింధా పురిన్ వానర
వ్రాతం బేమను ? రామలక్ష్మణులకున్ బ్రాణమ్ము లెట్లుండు నే
రీతిన్ అంతులు వోయి పైబడు నా సుగ్రీవుండు కోపోగ్రుడై. 180

యాగపవిత్ర భూమి జను పందిన తల్లిని చూడ లేనిచో
సాగర వేలలన్ తపము సల్పగ ఁబోయెద, కానిచో నసు
త్యాగము నైన చేయుటయు దప్పదు, నాదు భవిష్యదర్థముల్
సాగిన సాగకుండిన అసాంప్రత మన్న దొకండుగల్గనే.

అటుల విహ్వాల మానసుం డయిన హనుమ
మనసు నందలి యావేశ మణచివైచి,
చచ్చి చేసెడి దేమి యీ జగతిననుచు
మరల యోచించె తనకున్న మార్గములను.

చూచిన చోటులందిరిగి చూచెద చూడని చోటు లున్నచో
వేచియటన్ గనుంగొనుచు వేగ మెపోయెద సాధు సద్గుణ
శ్రీ చరితామృత ప్రథిత చిక్కణ మూర్తి ధరిత్రి జాతనున్
జూచినగాని నాతలపు చుమ్మలు తీరవు కోర్కెతీరదున్.

ఎఱుగడె కార్త వీర్యు నెదిరించి గడించిన శిక్ష నెమ్మదిన్,
మఱచెనె వాలి చేతి యనమానము, ధీరత మీఱనొక్కటా
కరమున నెత్తుచున్ శివుని కార్ముకమున్ దునియాడు రాఘవే
శ్వరు సతి నే చెఱంగొను నిశాటునకున్ మరణంబు దప్పునే.

ధరణిజ నేమిగా దలచి దానవు డిట్టుల దొంగిలించె నో;
నిరుపమ పుణ్యశీల ధరణీజను నేనిట జూడకున్నచో
బిరుదు మగంటిమిన్ దితిజవీరులు నల్వురు జూచుచుండ నా
కఱకు నిశాటు బట్టి ప్రతి కారము సేయక ఊర కుందునే.

దనుజుడా రావణుం డనిన కోపమ్ము
జనకజం జూడలే దనిన తాపమ్ము
ఇఱియించె హనుమంతు నిరుగడలందు
తరువు నొంచిన రీతి నురుప్రభంజనము. 186

## అశోకవనము

దానవ నాథు సౌధ సముదాయ పథమ్ముల పిడి వేగమే
క్షోణిజ కోసమై వెదకి చూడని చోటులు, క్రొత్త వాటినే
పైన కనుంగొనంగ ననిలాత్మజుఁడెత్తగు మేడ నెక్కగా
కానగ నయ్యె నొక్క వనికామల వాటిక కండ్ల కింపుగన్.

అది యొక పుష్పకుంజ నిచయాన్విత చారు వనప్రదేశ, మ
య్యది బహు జాతి వృక్ష నిలయం, బను రేశు విహారలీల కా
స్పదమగుచోటశోక వన వాటిక క్రొత్తగ దోచి యచ్చటన్
వెదుకగ నిశ్చయించె పృథివీజను మారుతి కౌతుకమ్మునన్.

సురుచిర పుష్ప కుంజ తరు శోభిత మా వనవాటికాస్థలం
బరుదుగ దోచి రాక్షస భటావళి తప్పక కాచుచుందు రీ
పరిసరసీమ నెల్లరయ వచ్చునొ యంచు దలంచి భక్తిని
ర్భర విమ లాంతరుండగుచు బ్రార్థనలంబచరించె నర్మిలిన్.

రాముడు, సీత, లక్ష్మణుడు, బ్రహ్మయు రుద్రుడు సర్వదేవతా
స్తోమము లష్ట దిక్పతు, లశోకవనిన్, ననుగాచుగాత, న
వ్యామల పద్మనేత్ర జనకాత్మజ నా కగుపించు గాత, సత్కృపా
ప్రేమ మయాత్ములెల్లరును వీరని కొల్పె నమస్సుమాంజలుల్.

ఈ కడ నున్న వారు గురుతించగ ఁ జాలని అల్ప రూపమే
నాకనుకూలమౌ వెదకు నప్పుడు, సద్గుణ పుణ్యతేజమీ
నాకనువెల్గు సీతకన నయ్యెడు దన్కను చూచు చుందు నా
రాకలు పోకలిం దెఱుగ రాని విధమ్మున సంచరించెదన్.

అనితలంచు నాతని కాత్మయందు ఁదోచె
పావని యెవండు, రాము దీవనల బలమె
సర్వమై నడిపించు నీసరణి ననిన
భావ ముత్సాహ ధైర్య సంపన్నమగుచు. 192

పుట్టిన నాటి నుండి వెలుపుంజవి చూడని గాడ్పుపట్టియా
చుట్టున నున్న కొండ లొక చొప్పున జేరగనీని దుర్గ పుం
గట్టడులై యశోకవనికాపరిరక్షకులున్న తీరు క
న్పట్టిన పట్టులం గనుచు పంతము తో నొకతెంపుసేయుచున్.

తోకన్ పైకెగ నెత్తి గుండియల యందున్ శ్వాస బంధించి అ
స్తో కోత్సాహ పరీత చేతన బలస్ఫూర్తి ప్రతాపమ్మునన్
దూకెన్ వానరు డొక్క దూకున మహోత్తుంగమ్ము హర్మ్యాగ్ర
ధీ కక్షమ్మున నుండి తోట వరకు ద్రేకస్ఫురద్వేగియై.

రివ్వను చల్లగాలి పొదరిండ్ల c గదల్చు టొకండె తప్ప యే
సవ్వడి యున్ జనింపని; నిశాసమ యాంధతమః పథమ్మునం
దెవ్వరు c జూడరాతనిని ఎవ్వరు చూచినగాని పోల్చలే
రవ్వన సీమయందు తిరుగాడు నొకానొక యల్ప జీవినిన్.

వచ్చిన నూతనాతిథికి స్వాగత పూర్వ సపర్యలట్లుగా
మచ్చికమైసుధామధుర మంజుల పుష్ప సుగంధ వాయువుల్
తెచ్చిన దాయశోకవన దేశము, నిండు మనమ్ము కూరుముల్
విచ్చిన రీతి, మిత్రునకు విందులు గూర్చు హితమ్ములన్నట్టుల్.

సల్లలిత ప్రసూన మధు సౌరభ తర్పిత శీతలానిలం
బల్లన వీచు సుందర వనాంతర మీయెడ నైన నేను నా
తల్లిని జూచినప్పుడు గదా రఘురాముని పాదమంటి యా
చల్లని మాట చెప్ప గల శాంతి లభించు నొకింత నెమ్మదిన్.

గాలికి రాలి మేనిపయి గప్పిన పూవుల క్రింద హన్మయున్
లీలగ పూలకుప్పయు వలెన్ బొలు పారుట గాంచి మాధవ
శ్రీలలితుండశోక వన సీమల నున్నటులన్ ముదమ్మునన్
దేలిన వామనోజ్ఞ సుమ దృశ్యము జూచుచు పంచభూతముల్. 198

సదమల సాధు శీల, వికసన్నయ సద్గుణ జాల, సీతకై
వెదుకగ లేదు ఈ వనము వీధుల నింతటి దన్క నిప్పుడీ
హృదయము క్రొత్త యాస లుదయించిన సందడి తొందరించు నీ
యదనున నీయశోకవనమంతయు జూచెద నాల్గు మూలలన్.

ధారుణి జాత జూడని వ్యథన్ కపివీరవరేణ్యు డావనిం
జేరుముహూర్త మెట్టిది యొ చిత్తము లోనొక నూత్న కౌతుకో
దారపథమ్ము గాంచిన విధమ్మున సీత గవేషణార్థమై
చేరువనున్న యొక్క గిరి శీర్షమునన్ నిలుచుండి యాతడున్.

ఈ యందమ్ముల తోట యిచ్చ టయినన్ పృథ్వీజ కన్పించుచో
నాయత్నమ్ముల పంట రామవిభు నాజ్ఞాదౌత్యసంసిద్ధియై
మాయా రాక్షసు డాదశాస్యునికి రామాస్త్ర ప్రచండాగ్నులం
దాయుర్దాయము చెల్లి పోవు టది తథ్యంబంచు నున్నంతటన్.

నీలాకాశ విశాల మార్గముల చాంద్రీ రమ్య రమ్యోత్సవ
శ్రీలాలిత్యము లార వోయుచును పాల్చెన్ నిర్మలాంభ స్సరః
కేళీసుందర రాజహంస మను భంగిన్ చంద్రు డౌజ్జ్వల్యరే
ఖాలీలాకృతి మల్లెపూదెరలు లంకన్ గప్పి నట్లొప్పుచున్.

గిరితట మెక్కి చూచుచును కీశకులుండు తలంచె నాత్మలో
సురుచిర కాంతి మంతమగు చోటిది, సాగర తీర శీతశీ
కరములు చిత్తశాంతినిడు కానన సీమయు, లంకనున్నచో
ధరణిజ యుండగాఁదగిన తావిది సర్వవిధమ్ము లందునన్.

వరుసలు దీర్చి నట్టి సుమవల్లరులున్ ఫల వృక్షముల్ సరో
వరములు పుష్పగంధ మృదువాయువు లుత్తమ రత్న వేదికల్,
సురుచిర మందిరమ్ము నొకచో గల కానన మిద్ది రాక్షసే
శ్వరుని విహారకేళి వన వాటిక యౌ నని యెంచె నాతడున్. 204

తెలతెల వారు చుండె తెరదీయును చీకటు, లావెలుంగు దా
రుల నెవ్వరైన చూడగలరున్ నను నంచు నతండు చెట్ల కొ
మ్మలబడియేగు నప్పు డొక మాదిరి సన్నని గొంతు టెల్గులన్
పులుగులు గూళ్ళనుం డెగిరి పోయెడి సద్దొక టే వినంబడెన్.

వనములలో జనించి వనవాటికలన్ జరియించుచుండి ధా
త్రినిగల సర్వ వృక్షముల తీరులు సర్వ మెఱుంగు అంజనా
తనయున కాయశోక వనధామమునంగల చెట్టులన్నియున్
దన హృదయమ్మునన్, పరిచితాదర మిత్రుల యట్లె కన్పడెన్.

అనుకూలమ్మగు చెట్టు నం దొదిగి తానా చోటులన్నింటినిన్
గనగానెంచు సమీర సూతి కెదుటన్ గన్పించె నొక్కింతద
వ్వున భూమీధర శృంగ నిర్గత జలా పూర్ణంబునై యొక్క వా
హిని యాదాపున శింశు పాతరు వొకం డింపై కనుందోయికిన్

సలలిత రామ నామ జప సాధు తపస్విని సీత నీవనీ
స్థలములయందె రావణుడు దాచిన దాచగ వచ్చు, నీనదీ
జలముల నీరముం గొనగ జానకి వచ్చెన యేని నాదుక
న్వెలుగు గ ంజూతు నంచు మది నెంతయు సంతసమంది యాతడున్.

చూచినయంత నేమగును జానకికిన్ రఘు రాము సేమమున్
వా చవి తన్వి నొంద నుడువన్ వలె, నైగమ ధర్మమార్గయా
త్రాచణశీల యాజనని తామరసాంఘ్రుల వ్రాలి మ్రొక్కగా
నోచవలెన్, తదీయ కరుణోల్బణ వాక్సుషమల్ వినన్ వలెన్.

అని యూహించుచు నాత డా తరువునం దాసీనుడై అల్పమౌ
తనువున్ డాచుచు శాఖికాచయము మధ్యన్, జానకీదేవి నీ
వన మందే కనుగొందు నన్న యొకవిశ్వాసంబుతో అంజనా
తనయుండావనిఁజూడగాఁదొడగె నుత్సాహ ప్రదీప్తాత్ముడై. 210

## ఆశ్వాసాంతము

అందంపుటశోకవన
మ్మందున సీతను వెదుకగ నడుగిడు హనుమత్
సుందర కథయిది మృదుపద
బంధుర రసభావఫణితి వ్రాసితిరామా.

భక్తి సంభృత మౌని హృత్పద్మ మధుర
సార సౌరభాస్వాద నాసక్త మతివి,
రామ ! మన్మనః పద్మ పత్రములోకింత
భాసిలును గాత నీపద భక్తినియతి.

నీసుకుమార రూపమహనీయత లెంచుచు, నిన్నెఱుంగగా
నాసలు పెంచు కొన్న హృదయమ్మున గ్రమ్మిన విమ్మ చీకటుల్
గాసిలి పెట్టు కుండ కడగాజను యోజన సేయు పూజనా
భ్యాస విధాన భాజన తపమ్మొన గూర్చ గదే దయా మయా ! 213

ఇది శ్రీ హనుమత్ప్రబంధ ద్వితీయ భాగమునందు
లంఖిణీవధ లంకాప్రవేశము సీతాన్వేషణము, పుష్పకవిమానము
రావణునివాసము అశోకవనము అను కథలు గల ద్వితీయాశ్వాసము.

# శ్రీ హనుమత్ప్రబంధము

## ద్వితీయ భాగము - తృతీయాశ్వాసము

## సీతాదర్శనము

శ్రీకరగుణ నీరాకర,
భీకర రాక్షస విదార, వేదవిహారా !
ప్రాకట కరుణా ధీవర,
లోకైక మహోధివీర లోకాధారా !

దేవా, శ్రీరఘు రామా ! అవధరింపుము .

శ్రీ రమ్యంబైన అశో
కారామము చెట్టు క్రింద యననీజను సా
మీరి కనుంగొని యామెకు
నూఱటు గొల్పిన కథయిదియున్ మధు రోక్తిన్. 215

రాముని కార్య సిద్ధికయి రాక్షసనాథుని యింటి లోపలన్
భూమిజఁ జూడ దీక్షలను పూనితి నంతయు వెర్రివాడ నై
నేమము నందు నాకు ఫలించెన్ కరుణారసము సర్వదేవతా
స్తోమము సాయమై నడపఁ జాలుదు గావుత సర్వయత్నముల్.

దీవ్యత్ ద్యుతిమ ద్భాసుర
భవ్యాననపద్మమూర్తి, మధుభాష్మజ సం
సేవ్యపదద్వయి నాయమ
సవ్యాప్త పవిత్ర కాంతి నాకగుపడునా !

హనుమంతుండటు బాహసేయు వొక వృక్షాగ్రంబునందుండి యా
వెను నానావిధ పుష్ప సుందర తరు స్ఫీతమ్ము దేవేంద్రునం
దనమో, యక్షకులేశు సుందర వనీ ధామమ్మొ నా నొప్పు తత్
కనదత్యూర్జిత మాయశోకవని సౌకల్యమ్ము నాసక్తితో.

మలయ ధరాధరోద్గత కుమార సమీర విహారముల్ సుగం
ధిల సుమసార సౌరభ వినిర్భర కుంజతలమ్ము లంబర
స్థల పరిచుంబి వృక్షసముదాయము లచ్చ జలప్రపూర్ణస
ల్లలితసరస్సరోరుహవిలాస విశాలము లా ప్రదేశముల్.

కువకువ గూయు పక్షులగళస్స్వరము లా
స్వరములం గొని వచ్చు వల్లిగాలి,
వల్లిగాలికి నల్ల నల్లన కదలాడు
పసిమెఱుంగుల తరుపల్లవములు,
తరుపల్లవములపై తరుణకాంతులఁజిమ్మి
చదల దారుల వెల్గు చంద్రరేఖ,
చంద్రరేఖ వెలుంగు జాడలం దిరుగుచు
అటనట నగపడు నసురభటులు, **220**

అసుర భటతతివలని యపాయముల ను
పాయముల తలంగగ నాంజనేయు డచట
నచట డాగి చరింపగ ననువు లెసక
మెసగు చాయశోకవనము పసఁ దలిర్చె.

చారువనప్రదేశ మిది, జానకికిష్టము పూవు టీరపుం
దారులలోఁ జరించుచు ముదమ్మున వానికి ప్రోది సేయుచున్
నీరము వోసిపెంచుటలు; నేనిట నుండియె చూడవచ్చు నా
వారిజపత్రనేత్ర యిటు వచ్చిన వేళలయంచు నెంచుచున్.

ఇరవుగ గూండ్లయందు నిదురించిన పుల్గులు లేచి దిక్కులన్
దిరుగుట లేదు, రాత్రి తెరదీయగ లేదును, మూడు యామముల్
జరిగిన జాడగానని నిశాసమయమ్మది, చెట్ల చాటునన్
మఱుగుగ నుండి చూచుటయె మంచిగ దోచె సమీర సూతికిన్.

సమ సోపాన వినిర్మితమ్మయి యుదంచద్రత్న సందీప్త మున్
రమణీయమ్మగు మందిర మ్మనతి దూరమ్మందునన్, తత్సమీ
పమునన్ గొందఱు దైత్య భామినులు గన్పట్టంగ నాశ్చర్యసం
భ్రమ మొప్పన్ పరికించె మారుతియు తత్ప్రాంతమ్ము నుత్కంఠతో.

అది యొక వేయి కంబముల యందము లొప్పు గృహమ్ము, చుట్టునున్
మృదువగు చెట్లనీడ ప్రసంరించినచోటది, దానవాంగనల్
పదుగురు చేరి రాగృహము పట్టుల, వారల మధ్య దీనయై
సుదతి యొకర్తు చేడ్పడిన చూడ్కుల నుండుట జూచె నాతడున్. 225

అనుపమ రూప యౌవన సమన్విత యామిహిజాత నెట్టిలో
తనకు వశమ్మొనర్పఁ దగు దారయి జూడగ దానవాధిపుం
డనిపిన వారె వారు, జనకాత్మజ మట్టును జేరి నిప్పుకల్
తొనకెడి నేత్రయుగ్మముల దూషణలాడఁవొడంగి రామెపై.

తనకును మట్టునుండు వనితల్ నిరతమ్ము క్రుధా విలోకనా
నన లగుచున్ కఠోరవచనమ్ములు బల్కుచు నుండ వారిమ
ధ్యను బికుబిక్కుమంచు బెడిదమ్ముల కోర్చుచు దిక్కులేని రీ
తినిఁ గనుపించె నాయబల దీనత రూపముఁ దాల్చినట్టులన్.

ఆమెను శ్రద్ధతో మరల నాహనుమంతుడు చూచె, రూపమం
దామెకు లేదు దైత్యవనితాకృతి, సంతతశోకతప్తయౌ
నామెయుఁ గాని సీతయగునా యని పోల్చు కొనంగ వీలుగా
నేమియు గూడ నుంత కనుపించని చింతను మున్గె నాతఁడున్.

వలువలు ధూళిగ్రమ్మి, ఉపవాసములన్ దను వెల్ల (జిక్కి తమ్మిపూ
వులు కరవౌ సరోవరము పోలిక, ధూమముగ్రమ్మ నగ్నిగా,
జలదము వెన్క చందురుని సామ్యము నొంది నిరస్త భూషయై
పాలుపటి యున్న స్త్రీని కపి ముఖ్యుఁడు సందియ మంది చూచుచున్.

మొగమునఁ జారు నశ్రుకణముల్ తడి యారవు, గుండెలోతులం
దెగసిన శోకవహ్ని నశియింపదు, కోరలు దీర్చి మ్రింగగం
బగగొను వేటకుక్కలకు మధ్యగఁ జిక్కిన లేడి పిల్ల య
ట్లగపడుచుండె దైత్యసతులందున నామెయు సీతగావలెన్.

శోకము గడ్డకట్టిన కృశోదరి, కత్తులు బూని రాక్షసీ
భీకర మూర్తు లిగ్గడల వేచి పిశాచము లట్లు మూగి య
ట్టాకల (బెట్టగా గినుక నందదు, ఏదియొ ధ్యానభావము
ద్రాకృతి వోలె నాకుఁ గననయ్యెడు నీమెయె సీతగావలెన్. 231

తరుగని వేదనాగ్ని పరితప్తము దీనము నయ్యు నామెసుం
దరముఖమందు పృషసముదాయము సందుల నుండి జారు చం
దురు తెలి వెన్నెలల్ పడిన తోడనె తోచుచు నుండె గౌరవా
దరయుత సాధుభావములు తప్పక యీయమ సీతగావలెన్.

సలలితాలంకార శబ్దార్థ మాధురీ
కమనీయతలు లేని కవితయట్లు,
తారకాతతియును తారకాపతి లేని
చదలున నైల్యమ్ము గదిసి నట్లు,
కడలేని దుఃఖమ్ము కన్నీటి కడలి యై
పొంగెత్తి మొగమును ముంచినట్లు,
సందియం బుడివోని శాస్త్రార్థముల యట్లు,
పొగలు గ్రమ్మిన నిప్పుసెగలరీతి

ముండ్ల మధ్య ఁ జిక్కిన నును ఁబూవు వోలె ఁ
దీన మానస యై పరాధీన యగుచు,
తులువలై చరించెడు గరాసులకు మధ్య
కానుపించిన దామె యాకార మచట.

ఆమె శిరోజ పాశముల యందున తళ్కు లెసంగు నొక్కచూ
డామణి దక్క వేఱొక యెడన్ నగలేమియులేవు, మైథిలీ
భామిను లిద్ది తాల్తురట బ్రాతిగ, ప్రాక్తన సంప్రదాయదీ
క్షామతి యీలతాంగి జనకాత్మజ కావలె నిశ్చయమ్ముగా.

అనువుగ నీమెమేనినగలన్నియు మూటగ నొక్క చెట్టుకొ
మ్మను బడియున్న వీమె మెయి ముద్రల బోలిక లౌచు, పూర్వమా
వనములయందు మాకుఁగను పట్టిన భూషణరాజి ముద్రలున్
గననగు నీమె పాదముల, కావలె నిశ్చయ మీమె సీతయున్. 236

అని భావించుచు దైత్య కాంతల కఠోరాలాపముల్ చిత్తమం
దునఁగల్పించిన కోపమూపుచు మరుత్సూనుండు దానూహసే
సిన యట్లావనితాగణమ్ము నడుమన్ జేడ్పాటుమై నున్న భా
మిని జానకి యన్న నిశ్చయ మెదన్ బెంపొంది యుప్పొంగుచున్.

కనుగొనఁగల్గితిన్ జనకకన్యను నేటికి ధన్యమయ్యె నా
జను వని హర్ష బాష్ప కణ జాల ఝరీ భర నమ్ర శీర్షుఁడై
ప్రణతు లొనర్చి సీతకును రాముని తల్లి సుమిత్ర సూతికిన్
మనసున పొంగులెత్తు నభిమానము మేనున పుల్కలొత్తగన్.

రాముని యంగుళీయము కరమ్మునఁ దాల్చుచు నొక్క సారిగా
నామె పదారవిందముల నాక్షణమందున వ్రాలనెంచి న
న్నామెయు నమ్మదేమొ దితి జాంగనలున్ బ్రతిరోధమంచు నే
దే మఱి యొక్క యూహ మది నెంచుచు పావని యాత్మలోపలన్.

జనకుని యాగ భూములను జన్మము నందిన సాధ్వి సీతయున్,
దినకర వంశ భూషణు,ఁ డుదీర్ణ పరాక్రమమూర్తి సర్వస
ద్గుణనిలయుండు రాముడును దుర్భర దుఃఖములన్ మునింగి రా
దనుజు ఁడొనర్చినట్టి దురితమ్మిది యంచు దలంచె నార్తితో.

పుట్టిన నాటినుండి సుఖముల్ జవిఁ జూచిన రాచబిడ్డ న
మ్రాట్టుని కోడలైన సుకుమారియు భాసుర కోసలావనీ
పట్టపురాజ్ఞి కాగలుగు భాగ్యవిలాసిని సీత యిట్టి యి
క్కట్టుల పాలుగావలసె కర్కశుఁడా దితి జేంద్రు వంచనన్.

ప్రబల ధనుః ప్రచండ బలరాముడు రాముడు, విష్ణుపత్రయీ
ప్రభుతల కన్న మిన్నగనె భావమునం దలపోయు నిత్యమా
త్రిభువన సందరీ మణి కిరీటము సద్గుణ సాధ్వి సీత నీ 242
యుభయులు నేకమై శుభము లొందుట చూతునె నాదు జన్మకున్.

ఇలువిడి పైకిరానినలినేక్షణ, ఓర్పున నుర్వి సాటియై
యలరెడు సాధ్వి, బంధుర వనాథ్వములం దిరు ప్రక్క ముందువె
న్కలc గని రామలక్ష్మణులు గావగ నేగు లతాంగి, దానవీ
బలమిటు కాపుc గాయు వెతc బాల్పడి ప్రాన్పడి యున్న దక్కటా.

నిక్కిన వారు, గర్వమెద నిండిన వారు, మనుష్యమాంసముల్
మెక్కిన వార లీయసుర లీసుకుమారిని రామమూర్తికిన్
దక్కగ నిత్తురే యనుచు ధైర్యముతక్కు మరుత్ప్రసూతికిన్
ప్రక్కల నుండి యేదొ సడి వచ్చిన జాడలు దోచె వీనులన్.

అరిగెనిశన్ త్రియామ సమయ మ్మసు రాంగన లాడు దుష్టని
ష్ఠురముల తాళలేక కడు శోకమునంబడియున్న సీతనా
కరకు గరాసు లే కుటిల కష్టము పాలొనరింతురో యటం
చరిమురి యోచు జాగరిత నారయు చుండె నతండు సర్వమున్.

ధ్వనులును దగ్గఱౌకొలది బాటలలోని తమమ్ముcజీల్చుచున్
గన cబడె దీప కాంతులును, కాల్నడ cగొందఱు వచ్చు సవ్వడుల్
వినcబడె, నీ యడావుడికి వేగమె మారుతి చెట్టు కొమ్మలం
గనుపడకుండ డాగె విహగమ్మయి జానకి వైపె జూచుచున్.

## రావణుని దుర్భాషలు

బలిమిన్ వంచనc జేసి జానకిని పాపం బెంచకన్ లంకలో
పల బంధించిన దాది రావణుడు తద్బామామణిన్ బొందగా
కలలంగాంచుచు నామెకుం దనసమగ్రప్రాభ వాధిక్యతల్
తెలియం జేయగ జూచుచుండె దగురీతిన్ సాధ నోపాయముల్.

తనకడ నెందఱైన వనితల్ గల రంగజు బాణముల్ శరత్
కనదురు కాంతిరేఖికలు కాని, ధరాత్మజ రూపలక్ష్మియం
దణువును గూడ పోల జన రాపయి శూర్పణఖన్ గురూపిcజే
సిన రఘు రాముపైc దనకసిన్ గడు వేగమె తీర్చుకోవలెన్. 248

దైత్యుం డా దశకంఠుఁ డీపగిది పంతమ్మూని శ్రీరాముపై
ప్రత్యుద్గామిగ సీత లోఁగొనెడి కార్య మ్మొక్క కర్తవ్యమా
ప్రత్యాసార మటంచు నెంచుచు నుదీర్ణ ప్రౌఢ యత్నంబులం
దత్యంతమ్మును క్రిందు మీదగుచు మూయం డక్షిగోళంబులన్.

దినములు మాసముల్ గడచె, తెల్లము గా దొకయింత జానకీ
మనసెటు లున్నదో, యచట మాటుగ నుండిన కాంత లైన నుం
దన కొక మంచి మాట విన దగ్గరియున్ గొని రారు ఇర్వదా
కనులును గల్గువాని యొకకంటికిఁ గూడను నిద్ర పట్టదున్.

వేలాతీత పటుప్రతాప బలవద్విక్రాంతుఁ డారాము డె
ట్లో లంకాపురి కేగుదేరగ గలం డుర్వీజకై, యింక దా
నాలస్యం బొనరించుచో సకల కార్యంబున్ వృథా యన్నటుల్
డోలాందోళిత చిత్తు డయ్యె దనుజుండున్ రాత్రిరాత్రంతయున్.

కనులన్ మూసిన విప్పియుంచినను తత్ క్ష్మాజాతయాకారమే
తన చిత్తమ్మును బట్టి లాగెడు కలంతన్ అంతులా కామవే
దన పాలై యుసు రుస్సు రంచు ఁబడి స్వేదస్విన్న దేహమ్ముతో
దనుజాధీశుఁడు లేచె పుష్పసమమౌతల్పం బసహ్యంబెయ్యై.

వీకదనం బెసంగ పువు విల్తుడు తొందరసేయు నార్తిలో
ఆకలి గొన్న సింగ మటు లాతడు నాల్గవ జాము గాని యా
చీకటియం దశోక వన సీమల కేగగ లేచె సీతకై
ప్రాకట రత్న భూషణ విరాజిత రమ్యతనూ విలాసుఁడై.

ప్రక్కల బారు దీరి పరివారము బట్టగ రత్నదీపికల్,
చక్కనివార లంతిపురిచానలు నూపుర నాదమాధురుల్
దిక్కుల నింపి వెంట నరుదేరగ నేగె, నిజప్రభావముల్
మొక్కలమై రహింప పదిమోముల రక్కసి తేడు వేడుకన్ . 254

తొలి ప్రొద్దున్ బడి వేదమంత్ర పఠనోక్తుల్ దిక్కులన్ మ్రోగ, మం
గళ గీతమ్ముల నాలపించు చెలమిన్ గర్పూర నీరాజన
మ్ముల గంధర్వలతాంగులున్ గొలుపు పాల్పుల్ నిండు సౌధాంగణ
స్థలులన్ దాటుచు సీతకై వెడలె దైత్యస్వామి దర్పంబునన్.

ధగధగాయుధకోటి ధాటీ పటాటోప
భటసమూహము బరాబరులు సేయ,
దశశిరః కోటీర విశదరత్నవ్రాత
విద్యోత మాకాశ వీధి కెగయ,
భూరి హేమాంగద తారహారానీక
హారహీరముల దేహమ్ము మునుగ,
కంఠసీమాలోల కమనీయ సుమజాల
మాలా సుగంధముల్ మలసి యాడ,

రాజవైభవముద్రా విరాజమాన
లలిత శృంగార హేలావిలాస భాసు
రోత్స వానంద శుంభన్నిరూఢి దనర
చనె నశోకవనికిని రాక్షసుల రాజు.

బలితుం డద్భుత కాంతిమంతుడు మహాబాహుండు రక్తారుణో
జ్జ్వలనేత్రుండు త్రిలోక రాజ్య విభవప్రౌఢాధిపత్యప్రభా
కలితౌదాత్త్యము సర్వమున్ తనదిగా కామోత్కటోద్వృత్తి సం
చలితుండై యరుదెంచు దానవపతిన్ సామీరి వీక్షించుచున్.

ఇంతటి భోగ భాగ్యవిధ మింతటి రాజస మింత వైభవ
మ్మింతటి గౌరవమ్ము కలదే మఱి యెవ్వరి కేని విశ్వమం
దంతట నెచ్చటైన యని యచ్చెరువందుచు చూడసాగె నొ
క్కింతగ క్రిందకున్ డిగి మహీరుహశాఖల వాయుసూనుడున్. 259

ఈ చటులప్రభావమహనీయుఁడు, తీవ్ర తపోవిశిష్ట దీ
క్షాచణుఁడన్న కీర్తియును కల్గిన వా, డి దియేమి కర్మమో
నీచత నిట్టు లన్యరమణీమణులన్ చెఱఁబట్టు ఘోరపా
పాచరణుండునై రఘువరాగ్రణికే యొక యెగ్గు సేసెడిన్.

అని యోచించుచు శింశుపాతరువు మధ్యన్ పత్రముల్ చాటుగా
తనయాకారము కప్పిపుచ్చుకొని, సీతాసాధ్వియున్నట్టిపై
పున కే తెంచుచు నుండె నేమి దురితమ్మున్ చిత్తమందెంచి వ
చ్చెనో యీదుష్టుఁడ టంచు మారుతియు దృష్టిన్ నిల్పి నాదైత్యుపై

అకృతాలంకృత, మశ్రుసిక్త, మతిదీనాస్యమ్ము, దీర్ఘవ్యధా
వికలాకారము, శుష్కదేహము, భయోద్విగ్నమ్మ సంస్కారకే
శకదంబమ్ము మలీమసాంబరము నౌ క్ష్మాజాత రూపమ్మె దై
త్యకు లాధీశునకున్ గనంబడియె సౌందర్య ప్రభారాశిగా.

సరసీ జేక్షణ, నీలకేశిని శరత్ చంద్రాస్య బింబోష్ఠియున్
గురుభారస్తన హీనమధ్యయగు నాక్షోణీజ సౌందర్యమున్
బరికింపం దరికేగె రావణుడు దీప్తప్రాభవోత్కంఠతో
నర యక్షోరగ దేవతా విభులకందన్‌రాని గర్వమ్మునన్.

ప్రబల దీర్ఘ నాసాపు టో చ్ఛ్వాసితముల
భయదముగ వచ్చు ఆబోతు బాటనుండి
తొలఁగు ఆవులట్లు గ దైత్యు త్రోవ నుండి
తప్పుకొని రట జేరిన దైత్యసతులు. 264

మానిని : హేయవిజృంభణ మేచెడి హాసము
లిగ్గడ నింపుచు నెక్కుడుగా
నాయసురాధిపు డాతుర పూర్ణ మ
హోట్టమునన్ దడబాటునడన్
ఆయమ దగ్గర కాగక వచ్చుట
నారసి భీతహృదంతరయై
కాయము నెల్లను క్ష్మాసుత వేగమె
కాళుల సేతులఁ గప్పికొనెన్.

పదిమాసమ్ముల కాలమేగినది, యీ భామాలలామమ్ము నె
మ్మది నేమున్నదొ చెప్పు దీ దనుజసమ్రాట్టింత యల్పుండె ! యం
చెద జన్మించిన కోప మాపు కొని దైత్యేశుండు పల్కెన్ లస
న్మృదు వాక్యమ్ముల జానకిన్ దనవశం బెట్టైన గావింపగా.

తనువున్ గప్పుచు నన్నుఁజూచి భయమందన్ మానుమో లోకమో
హన సౌందర్య విలాస భాసురతనూ ! హ్లాదైక లీలా వినూ
తన హేలన్ విహరించు కాలమిది సీతా ! నాకునున్ నీకు నీ
వనుమానింపక రమ్ము నీమృదుపరిష్వంగమ్ము నాకీయగన్.

ఈలంకా మహనీయ రాజ్య మిక నీవే యేలగావచ్చు నో
శ్రీలాలిత్యముఖారవింద మధుమూర్తీ ! నిత్య మానందవ
ల్లీ లావణ్యమనోజ్ఞ డోలికల దేలింతున్ గదే జానకీ !
త్రైలోక్యాధిప భోగభాగ్యము సమస్తమ్మున్ ద్వదీయమ్ముగా.

సదయాపాంగ విలాస సుందర సరోజాస్యచ్ఛవీ ! నాశిరం
బిది నీసుందర పాద పీఠముల యందే యుంతు ప్రేమోల్లస
న్మృదు భావామల పుష్ప మాధురులపేర్మిన్ నమ్ము మీమాట నీ
పదపూజన్ బ్రతు కంతయున్ మనెదనే భద్రాయ తోత్సాహినై. 269

పాడొనరింపఁబోకువె ప్రభాత సరోజమనోహరాస్య! నీ
పోడిమి, రామునిన్ మఱచిపొమ్మిక నీమగఁడాతడెట్లగున్
లేడినిఁ గూడఁ బట్టుకొనలేని బడుంగతడేల నీకు. నే
నీడును జోడు నీకగుదునే, మహినేలు మగంటిమిన్ చెలీ.

నను శాసింపుము దీపి తామల మతీ ! నా ప్రాభ వమ్మొప్ప నీ
జనకున్ నేడె దిగంతరాళ జగతీ సామ్రాజ్యపట్టాభిషి
క్తునిఁ గావింతును సంతసమ్మిదియుఁ గాకున్నన్ వచింపంగదే
మనమం దున్నయభీప్సితార్థము దయన్ మన్నించి నన్ మైథిలీ !

ఆనందమ్ముగ నీవు నా ప్రణయ రాజ్యప్రాజ్య సింహాసన
స్థానం బందున జేరవచ్చిన నిమేషమ్మందె నిన్ దాకుదున్
గానీ, యంతటి దన్క నీదరికి నేగన్ నమ్ము మీ మాట నా
ప్రాణప్రాణమ వంచు నెంచెద భయభ్రాంతిన్ విడం జూడుమీ.

నాకున్ గాంచన రత్న సుందర విమానమ్మున్న దీపుష్పకా
ఖ్యాక మ్మయ్యది కామరూప గమన ఖ్యాతమ్ము నిన్దానిపై
రాకాచంద్ర మయూఖ రంజిత వనప్రాంతమ్ము లా నందన
ప్రాకారమ్ములఁ ద్రిప్పి చూపుదునికన్ ప్రాభాత పద్మచ్ఛవీ.

పూవు మెఱుంగు పూత పాలుపుల్ దొలు కాడెడు నీవయస్సు నీ
యౌవన మెల్ల నాయడవి యందలి వెన్నెలఁ జేసె రాముడో
శ్రీ విలసత్ సుగంధలహరీ పరిశోభిత పుష్పకోమలీ !
రావణుఁ డట్లుచేయడు పరాకునగూడ నిజమ్ము పల్కెదన్. 274

ఏమెకమో బలింగొనక నింకను దా బ్రతికుండె నేని నీ
రాముఁడు వార్ధి దాటి యిటు రాగలడా ! యిటు వచ్చెనేనియున్
నామును ముందునన్ నిలుచు నంతటి వాడును గాదు జానకీ !
రాముఁడు, రాముఁడం చిటుల రాయిడులం బడు టేల నీకునున్.

ఆలస్యమ్మిక నేల? చూడు మిటు సీతా ! నూతనాలంకృతి
శ్రీలావణ్య విభూషణాంబర రుచిస్స్రగ్ర ప్రసూనావళీ
మాలారమ్య పురస్కృతుల్ దితిజభామారత్నముల్ నీదుపా
దాలం బెట్టిరి, లేచితాల్చుమివి సీతా! నాదుదేవేరిగా.

కామతమస్సు పైకొనిన గాఢ వికారము నందు రావణుం
డామెయి పల్కుటల్ వినుచు నాతనిపైఁబడి యొక్కత్రొక్కునన్
భూమినిఁగూల్చు నాగ్రహముఁ బూనియు వానరుఁడూరకుండె ; దా
నేమి దలంచెనో మది నొకించుక, రాముని యాజ్ఞ లేకనున్.

ఆపగలేని భర్తృవిరహార్తికి లోగి, దురంత దుఃఖ వీ
చీపరిపీడితాత్మయగు సీతకు చేతమునందు చిచ్చులం
దాపిన యట్లు, వాడిమొనతాల్పుల ముల్కులు గ్రుచ్చినట్లుగా
నై పిశితాశి పల్కులు విషాగ్నులఁగ్రక్కిన వంతకంతకున్.

మానడు రావణుండు తనమాటలు, వానిమొగమ్మె చూడ దా
మానిని సీత; వేదహితమార్గమనస్వితఁ గల్గు రామ భూ
జానిని గూర్చి దానవుప్రసంగము దుస్సహమై, తృణమ్ముచేఁ
బూనుచు నడ్డుగా, దనుజ భూవిభు దిక్కయి యామె యిట్లనున్.

కనువిందౌ హరివర్ణశోభిత పశుగ్రాసమ్ముగా ధాత్రి నీ
తృణమైనన్ దన పుట్టు వెల్ల చరితార్థీభూతమై గ్రాలు నో
దనుజాధీశ ! యిదేల నీకు పరకాంతామోహ దుర్మార్గ సం
జనితాశాపటుపాపసంచరణ నీచంబైన దుర్వృత్తియున్.

మాయలమౌని వేషమున మాటలు నేర్చి కఠోరవృత్తి న
న్నీ యెడ కీవు బల్మిఁ దరలించితి వియ్యది పాపమంచు నీ
కేయొకరున్ వచింపరె? వచించిన గూడను, నీకు లెక్కలే
దా! యొక రన్న మంచి పలుకైనను, బ్రహ్మమహాన్వయోద్భవా ! 281

నా కర్మ మ్మిటు వ్రాసియుండె నుదుటన్, గాదేని యచ్చోట శ్రీ
కాకుత్స్థాన్వయరమ్యకీర్తి, రిపువర్గధ్వంసి, కాలాగ్ని రే
ఖాకోదండుఁడు రాముఁడున్న యెడ నీకంఠమ్ము లుగ్రాస్త్ర ధా
రాకృత్తమ్ములు చేసి యుండెడిని గృధ్రశ్రేణికిన్ విందుగా.

ఆతని ధర్మపత్నిని మహాగ్ని సమాన పవిత్ర నైన నే
సీతరుణమ్మునందె శపియించి నినున్ బరిమార్పఁ జాలియున్,
బ్రాతిగ, ప్రాభవచ్ఛటుల పౌరుష వహ్ని రముప్రవీరుఁడే
సీతల లెల్ల డుల్పు టవనిం దగు కార్యముగాఁ దలంచితిన్.

నీకామార్తి ప్రగాఢమై సఱిగినన్ నిత్యమ్ము క్రీడింపు మీ
నీకాంతాతతిఁ గూడి, అన్యవనితానీకమ్ముపై మోహవాం
ఛాకాలుష్యము లేల? వేఱొకడు పుష్పాస్త్ర జ్వరార్తుండునై
నీకాంతం జెఱఁగొన్న యప్పు డెడదన్ నీకెట్లగున్ జూచితే.

దనుజుఁడ వీవు మర్త్యవనితన్ దగ నేనును నీకు, నిప్పుడై
నను రఘురాము పాదనలినమ్ముల నన్గొని పోయి జేర్చుచో
నినుఁగరుణించి బ్రోచు మహనీయ విశాల దయాసుధాబ్ధి య
య్యినకులనాథుఁ డిద్ది యొనరింపు మికన్ బ్రతుకం దలంచుచో.

అనివచియించి సీత దను జాధిపుడుఁన్ దన కన్నుదోయి ముం
దున విపరీత కామమద దుష్టపిశాచముగా నిలుచుండి యుండుటల్
గనుగొనలేని శోకమున కాల్వలుగట్టిన బాష్పముల్ గనుం
గొనల స్రవింప వెన్దిరిగి కూర్చొనె నావలి దిక్కు మోముగా.

ఏమే, మూర్ఖపు మట్టిబొమ్మ! విను మెంతే గౌరవప్రేమ భా
వామోదంబున మాప్రభూత్తముఁడు మాట్లాడంగ మర్యాదగా,
నీ మోమైనను జూపవేల యనుచున్ నిందించు చాదానవీ
స్తోమం బామెను చుట్టుముట్టగనె, దైత్యుం డడ్డుగా నిల్చుచున్. 287

ఔనే, యోసి ధరాత్మజా! యెడమొగంబై యిట్లు నీవుండుటల్
మానారీసహజమ్ము నా బిగువు సుమ్మీ యంచు భావింతు, ని
ష్ఠైనన్ బోయినదేమి, నీచరణదాస్యమ్మానగా పల్కుచు
న్నా నేకోరిక యున్నదో సరగునన్ వాక్రుచ్చి శాసింపవే.

అడిగిన నీదుప్రేమమధురాశలు తీర్చగలే దటన్న యే
యెడమును కల్గనీను, వినవే హృదయ మ్మఖిలమ్ము నుంచి నీ
యడుగుల దామరల్ కొలువులై మనని మ్మిటు పైని నన్ను నీ
పుడమిని, చారు శారదిక పూర్ణసుధాకర చంద్రికాద్యుతీ !

నారలుగట్టి భీకరవనమ్ముల రామునివెంట నేగు నా
యాఅడు వేల నీకు మగువా ! మధుమాస విలాస కేళిశ్రం
గారవనమ్ములం దసుర కాంతలు సేవలొనర్ప నాకడన్
జేరి నిశాటరాజ్యమహి నేలుము పట్టపుదేవి వై యికన్.

తులువతనమ్మునన్ మదముతోబడి తూలుచు దానవేంద్రుడున్
బలికిన దానికిన్ బదులు పల్కదు, చూపును గూడ వానిపై
నిలుపదు సీత, దుఃఖ మెదనిండిన కాయము ఊయి యైనటుల్,
కలుషితవర్తనుండు దశకంఠుని వాక్కఠినోపలాహతిన్.

పావనవేద ధర్మ విభవప్రథితాకృతి సీత మౌనమం
దే విలయాగ్నియున్నదియొ యీదురితాత్ముని చావుకై, జ్వల
ద్దావము చుట్టుముట్టిన విధమ్మున తిమ్మిరిగొన్న రిమ్మలో
రావణుఁ డాగ్రహుండయి ధరాసుత పై కరుదెంచు నంతలో.

ఆగు మటం చొక ర్తతని హస్తముఁ బట్టుచు నాపఁ గన్నులం
దూగిసలాడు కోపమదియున్ పదిరెట్లగు కామదుర్మదో
ద్వేగ మొకింత యాపుకొని పృథ్వీజనుం గనుచున్ వచింపగా
సాగెను రావణుండు పరుషప్రకటోత్కట దుష్ప్రలాపముల్. 293

''నా''యను దిక్కులేని యొక నాతిగ నీపతియున్ మఱంది ని
న్నా యటవీస్థలిన్ విడచినందుల కేనుగదా తలోదరీ
సాయమొనర్చి తెచ్చి నిను సమ్మతితోఁ గపగూడు మంచు ప్రే
మాయతభావమెంచి యభిమానము నుంచితి నింత నీపయిన్.

వినుతప్రాభవ వైభవుల్ త్రిజగతీ వీరాధివీరాగ్రణుల్
వినమత్ శీర్షులు నై భజించు ప్రభుతల్ వెల్గొందు సమ్రాట్టునై
నినుప్రేమించి వరించి వచ్చితిని తన్వీ! ఈమహాభోగ భా
గ్యనిధిన్ కాలునఁ దన్ను వెట్టిమతివిన్ గాబోకు ధాత్రీసుతా !

ధరణిన్ సాటియెలేని కోమలివి సీతానీవు, ప్రాభాతసుం
దర బాలారుణరశ్మి నీవదన సౌందర్య మ్మికన్ నామన
స్సరసీజమ్ము వికాస మందఁగల వీక్షామాధురుల్ జింది నా
కరమున్ బట్టు శుభక్షణమ్ము కయి నే కాంక్షించు చుంటిన్ చెలీ !

ఓరిమి నిట్లు తాను చనవొప్పిన కూరిమిఁ జూపగా తిర
స్కారమె గాని వేఱొకటి గానక, జానకి పై దురాగ్రహా
క్రూరవికార రూపమున కోరలు విచ్చు మొగమ్ము కారముల్
నూరిన తీరునన్ నుడివె నోటికి వచ్చిన యట్లు దైత్యుఁడున్.

దాపై వచ్చి కరమ్ము సాచితిని సీతా ! ఒక్క పల్కైన రా
దీ పంతమ్మున కర్థమేమి యిక రెండే రెండు మాసమ్ములే
నాపై నిల్పను చేరు మీగడువులోనన్ నన్ను లేదేని ప్రా
ణాపాయము తప్ప దిప్పు డయినన్ నామాట లాలింపుమీ.

కనుగొను మోసి ! యీదనుజకాంతలు కత్తులు దూసి కోసి నీ
తనువు సమస్త మాగడువు దాటిన నాటికి నోటి కింపుగా
తినుటకు వండి పెట్టెద రిదే తుదిమాట యటంచు నాజ్ఞలా
వనితలకిచ్చి రావణుఁడు వచ్చిన దారినిఁ బట్టె క్రుద్ధుఁడై. 299

దనుజకులేశుఁ డిట్టు లిలుదారిని బట్టుట జూచి ధాన్యమా
లినియను నాతి అడ్డమయి లీలగ వాని కరమ్ముబట్టి యో
యనుపమ సుందరాంగ విను మంద మొకింతయులేని సీతకై
మనసది యేల, నన్నుగొని మన్మథ రతికేళిని దేలుమా యనన్.

జానకి మీదనే తలపు సర్వము నిల్పిన దానవాధిపుం
డానన మెత్తియైన గనఁ డాయతివన్ వినఁడామెపల్కులన్,
మానస మేదియో యితర మార్గమునం జరియించు నూహలో
దానికరమ్ముఁ గ్రక్కున విదల్చి వదల్చుకొనెన్ వడి నిల్లుసేరగా-

ధరణీజాతను లోఁగొనన్ బడిన యత్నమ్మెల్ల వమ్మై హృదం
తరమం దేమియు తోచబోవనియవస్థన్ కోపసంతాపసం
భరితుం డంగలు సాచికొంచుఁ జనె శుంభద్వేగియై రాక్షసే
శ్వరుఁ డుద్విగ్నమనస్కుఁడై శకలితాశావేశ చింతాత్ముఁడై .

దానవు డేగె, దైత్యవనితల్ తనకెట్టి విపత్తు గూర్చునన్
ప్రాణము దీతురో యను భయమ్మున దిక్కొకడేదియున్ మదిన్
గానని సీత కా యెడమకన్నదరెన్ శుభసూచకమ్ముగా
మానసమందు దైన్యమొకమాత్రము తగ్గిన శాంతి గూర్చుచున్.

## దైత్యస్త్రీల దుష్ప్రవర్తన

క్రచ్చుఅలేచివచ్చి పడగల్ బుసకొట్టిన దుష్టసర్పమై
చిచ్చులు గ్రుమ్మరించి చనె సీతపయిన్ దశకంఠు డుగ్రకో
పోచ్ఛలితప్రచండ పరుషోక్తుల ; గుండెల యందు శూలముల్
గ్రుచ్చిన యట్టులై పుడమికూతురు చేతనదక్కి సోలగా. 304

కావరమేచినట్టి తమకమ్ములు గ్రమ్మిన పాపచిత్తుఁడా
రావణుఁడన్న దుర్మదదురాసదముల్ వినుచున్న దేవక
న్యావళి కశ్రులొల్కె నయనాంతములన్, సుగుణాఢ్యయౌ నొక
ర్తెవిధి వంతఁ గుందుట సహింతురె సుంతయు సాటి మానినుల్.

సారతరమ్ము లైన గుణసంపద లాకృతిఁ గొన్న సాధ్వి యీ
ధారణిజాతదాపునకుఁ దానయి రాగలడా ! దశాస్యుఁ డే
దూరమునుండియో దుడుకు దూరుల ప్రేలును గాని యంచు సా
మీరియు వేచియుండెను సమీపకుజమ్మున మంచివేళకున్.

ఆనతి యిచ్చి యేగె నసురాధిపుఁ డాగ్రహుఁ డౌచు సీతనె
ట్లైనను లోగొనన్ వలయునంచు, నదే తమకున్ నెపమ్ముగా
దానవకాంతలెల్ల వసుధాత్మజ చుట్టునుఁ జేరి వాకొనం
బూనిరి సూటిపోటువిసముల్ కరవాలము లెత్తి చూపుచున్.

పౌలస్త్యుఁ డీతడు బ్రహ్మకు మనుమఁడు
రావణుండీతడు రమణి! వినుము,
సర్వదేవతలను శాసించు ప్రభువు మా
దశకంఠుఁ డతనికిఁ దగుదు వీవె,
త్రిభువన సామ్రాజ్య విభవముల్ నీకె ట్లు
లబ్బు రావణు నంకమందుఁ గాక,
దేవేరులందున రావణుం డిక నిన్నె
మిన్నగాఁ జూచునో మెలత వినుము. 308

వీరుఁడాతడు సొగసైన వెలఁది వీవు
వ్యర్థ మొనరింపఁ బోకు నీయౌవనమ్ము
ప్రభువులకు నెల్ల ప్రభువు రావణునెదిర్చి
బ్రతుకలే వొక్క దినము ధరాతనూజ!

వలచినీకైవచ్చి నిలచిన స్వామిని
చిన్న బుచ్చితి వేమి చేటె నీకు?
రావణాంతఃపుర రాణివాసముకన్న
అడవులు మేలటే యతివ నీకు?
సిగ్గు లేదే నీకు సీతా యొకింతైన
మగవారి నెదిరించి మాట లాడ ?
బడుగు రాముఁడె గాని పటుదైత్యవీరుఁడు
తగడటే నీకును తగుల మాడ?

స్త్రీలకును మధ్య గానని చెప్పుచుంటి
మింతదనుకను గాక మాకేమి పట్టె,
ఎఱుగుదువు నీవె దశకంఠుఁ డిడిన యాజ్ఞ,
కలవు మాయొద్ద వాడికత్తులును సీత!

అని దితిజాంగనానిచయ మాడెడి నిష్ఠుర దుష్ప్రలాపముల్
విని సహియింప లేని పృథివీజయు వీనులు మూడి నట్టులున్,
తనువున నిప్పుకల్ చెఱగి తార్చిన యట్లయి వారిమోములన్
గనుటకె భీతి జెంది వణకాడుచు నిల్కడలేని కాళులన్. 312

హనుమయు దాగియుండి దను జాంగనలన్ గను చెట్టుక్రిందకే
జనకజ తానుఁజేరి కనుజంటను గాల్వలుగట్టు నశ్రులన్
గనలిన కంఠనిస్వనపు గద్గదికన్ విలపించె నా నిశా
వనితయె ప్రత్యుషస్తుహిన బాష్పము లోడిచి తోడు నిల్వగన్.

గట్టు తెగినట్టి కడలియై చుట్టు ముట్టి
పైఁబడెడు దైత్యవనితల బారినుండి
యెచటికేగును? తానెట్టు లేగ గలదు?
వలను జిక్కిన పులుఁగయ్యె వసుధపుత్రి.

ముక్కలుగఁగోసి తింద మీ మూఢురాలు
చచ్చిపోయిన దనుచు నిశాటపతికి
చెప్పుదము లెండు లెండంచు సీతముందు
వికట తాండవ మాడిరా వెలఁదు లెల్ల.

అంతులు మాన రెంతకును రక్కసిమూకలు వంతులాడుచున్
వంత మెసంగ పల్కుదు రవాచ్యము లొక్కరి మీరి యొక్కరున్
దంతురితోగ్రరూపముల; దాత్రిజయున్ తుదకె ట్లొ గుండెనొ
క్కింతగ నిబ్బరించి పలికెన్ బటునిశ్చయ వాక్యధీరతన్.

చెప్పుడు మీరలెన్నయిన చిన్నము చిత్తము నంటఁబోవు మీ
తప్పుడు పల్కులెల్ల వసుధాసుతకున్; వినుఁడొక్కమాట మీ
దెప్పరి కంపు మాట విడఁదీయగఁజాలదు రామునుండి న
న్నెప్పటికిన్ రఘుప్రవరుఁడే హృదయేశ్వరుఁడుర్వి జాతకున్-

నిరతము రామచంద్రు ధరణీవరు నమ్మి చరించు సాధ్వినై
వరలెడు నన్ను నిచ్చుటకు బల్మినిఁదెచ్చిన రావణాసురుం
డెఱుగడొ మంచి చెడ్డ తనకింటను భార్యలు లేరొ, యిద్దియున్
దురితమటంచు చెప్పు సుదతుల్ తనలంకను కానరారొకో !

రాముఁడు గీముఁ డంచును తిరస్కృతి సేతురు మీరెఱురుంగ రా
రాముఁడు సత్య సద్గుణపరాక్రముఁ డీదశకంఠులంకకున్
దీమస మొప్ప రాగలఁ డెదేనిముసమ్మున దుష్టదానవ
స్తోమ వినాశ మాక్షణమె చూతురు మీరును కండ్ల ముందుగన్-

అతడు వచ్చి రెండు నెల లంతకు మించిన నాడె చంపుడీ
సీతనటంచు జెప్పి చనె, శ్రీరఘు రాముని పత్నియైన యీ
సీతయుఁజచ్చునేయటులఁ, చెట్టున కుచ్చుదగిల్చి రామునే
చేతము నందలంచుచును జీవముఁబాయును గాని ధాత్రిపై-

అనుచును బాష్ప సిక్తనయనాంచలయై విలపించు జానకిం
గని దనుజాంగనల్ చెలులు కంటిరె! యీయమ దొంగవేసముల్
కనులను గప్పి పోదమని గావును కారులు పల్కుచున్నదీ
దినమె వధించి యీమెనిక తిందము విందుగ నంచు నుగ్రలై.

కలకు cగత్తుల నూపుచు cగరములందు
నుర్విజకడకు వారేగుచున్నయంత
కడు వడిగ లేచి వారి మార్గమున కడ్డు
త్రిజట యను దైత్యకాంత పర్వెత్తి వచ్చి.

త్రిజట

ఆగుడు ! అగుడో యతివలార ! నిజమ్ములు సీతపల్కు, లు
ద్వేగము మానుడింక వినిపింతును నాకల యొండు, రాముcడున్
సాగరమెల్లదాటి తనసైన్యముతో, దను జేంద్రుcద్రుంచి తా
నేగెను సీతతోడ మహనీయత మీరగ నన్న లిప్తలో.

ఏమీ! చెప్పుము, చెప్పుమో త్రిజట! నీవేస్వప్నముం గంటివే
సామం బొప్పగ రాముcడిచ్చటికి cదాcజన్దెంచి గొంపోయెనా
భూమీజాతను ; ఎంతఘోరము నిజమ్మున్ బల్కవే స్వప్నమం
దేమే మున్నది వార్ధిదాటి యతc డెట్లేతెంచెనే, లంకకున్.

త్రిజట వెఱ్ఱిది గాని ధరిత్రియందు
కలలు కల్లలె యగును నిక్కమ్ములగునె,
యనుచు దైత్యకాంతలు చిత్త మందొకింత
సందియము తోనె విని రామె స్వప్నకథను-

వినుcడని పల్కె నాత్రిజట; వీరుcడు రాముcడు కీశసేనతో
వనధిని దాటి వచ్చి శరవహ్నుల లంకను మండ బెట్టె; రా
వణుcడును తైలసిక్తమసి వర్ణుcడు ముండితశీర్షుcడున్ దశా
ననముల నెత్తురుల్ దెఱల నాల్కలు వ్రేలగ గార్దభమ్ముపై- 326

జనె నల దక్షిణమ్మునకు; చచ్చిరి దానవ యోధు లావిభీ
షణు డొకరుండె నిల్చెనిట; జానకిc దోడ్కొని యుత్తరాశ క
య్యినకులరాజు రామవిభు డేగె విమానము నెక్కి రాజలాం
ఛన విభవోల్లస ద్విజయ సంపదలన్, గపిసేన గొల్వగా.

పరమపతివ్రత భవ్య చరిత్ర
వరగు ఙాన్విత సీత పాదాలకెరగి
చరియింత మీపయి సద్వర్తనమున,
అరుగు దేరుండని యనినంత త్రిజట.

సీతమొగమ్ముc జూచుటకె సిగ్గయి యేమియు పాలుపోవకన్
చేతన దక్కి యాత్రిజట చెప్పిన మాటకు దైత్యకామినుల్
భీతమనస్కలై పరుపు బెట్టిరి తామిట విన్నదెల్ల నా
రాతిరియందె పోయి వివరమ్ముగ రావణుతో వచింపగా.

కోఱలు జూపి జానకిని కోసుకు తిందమటంచు వచ్చు కో
పారుణనేత్రలన్ త్రిజట యాపెనుగాని, సమీరజుండు దు
ర్వారమహోగ్రముష్టి పటుపాటవమున్ జవిc జూపి ప్రోవులన్
బేరిచియుండువాడె ఒకపెట్టున వారల రక్తమాంసముల్.

కరవాలమ్ములు జూపి సీతపయికిన్ గాఱ్ఱవ్వు దైత్యాంగనా
దురితమ్ముంగని కిన్కc బూను హనుమంతుండింత శాంతించె; నా
ధరణీ జాతకు వామనేత్ర మదరెన్ ధైర్యమ్మొసంగెన్ సమా
దరమొప్పన్ వినిపింపగాc త్రిజటయున్ దాగన్న స్వప్నమ్మటన్.

అటు లోకింపక యూఱట నంది, మరల
తనదురంతవేదనలను తలcచు కొనుచు,
నలల తాకిడి కూగిసలాడి పోవు
నావవలె కదలాడె జానకియు మిగుల. 332

కొంచెపు బుద్ధి రామనృపకుంజరుఁ గోరితి పైడి లేడిఁదె
మ్మంచును, పల్కరాని నుడు లాడుచు నీసున సర్వసద్గుణా
భ్యంచితమూర్తి లక్ష్మణుని ఁబంపితి నాతని వెంట; నన్నునే
వంచనఁ జేసి కొన్నది విపర్యయ మూరక ఁబోవునే తుదిన్.

అక్కడ యేమి య్యెరొ ముగురత్త లయోధ్యను సేవసేయువా
రొక్కరు గూడ లేక, ఎటులుండిరొ నామఱఁదుల్; మఱెక్కడన్
దిక్కొక ఁడేని కన్పడని దీనత నేపడియుంటి; లక్ష్మణుం
డొక్కఁడె తానుసేయవలయున్ బరిచర్యలు రామమూర్తికిన్.

రాముని వెంట ఁదమ్ముడునరణ్యము జేరుటతో తపస్వినీ
భామిని యయ్యె నూర్మిళయు; పట్టపుదేవి పదమ్ము పట్టలే
దామెకుఁగూడ మాండవికి, నన్నియు వేదనలై యయోధ్యలో
మామకు మారుగా మిగిలె మాన్యగుణుండు సుమంత్రు ఁడొక్కఁడున్.

వనధితరంగ మగ్నులగు వారికి ఊతలభించు చాడ్పునన్
పెనగొను శోక వీచి పరిపీడిత సీతకు ఁగ్రొత్తయాసలున్
మనమునఁదోచె నాత్రిజట మాటలకున్; హనుమంతుఁడంతయున్
కని మది నెంచె చేయదగు కర్జము పూరితిసేయు మార్గముల్.

హనుమత్ సీతాసంభాషణము

సీతకు రాముమాటలును జెప్పక వెన్కకుఁబోవరాదు, తా
నీతరుణమ్ము నం దిట చరించుట దైత్యు లెఱుంగ రా, దెదో
రీతిని యింత దన్క పచరించినకార్యము పూర్తి కావలెన్;
చేతుల కందు కొమ్మయును చీలి తుదిన్ పడిపోవరాదునున్.

మారుతి కంతయున్ పటు సమస్యయె, క్రిందికి నొక్కమారుగా
బీరము జూపి దూకునెడ పృథ్విజ వీడెవడో నిశాటు ఁడం
చారటఁజెందు; తుట్ట తుద కామె పదమ్ముల చెంత కెట్టులో
చేరిన యప్పు డేమని వచించుటయో అదియున్ సమస్యయే- 338

అదవదఁజెందుచున్ వెడలి రట్టిటు రక్కసులున్ విలంబన
మ్మొదవగగూడ; దేది యెటులుండునొ యాపయి చెప్పఁజాలమి
య్యది యదనైన కాలము ధరాత్మజ వద్దకు నేగ నంచునె
మ్మది పవ నాత్మజుండు పదిమారులు లెక్కలు గట్టె యూహలన్.

పూవుల బోని మెత్తదనమున్, గరుణార్ద్రము రాము చిత్తమా
దైవము సుప్రసన్నలలితమ్ముగ చూచెన యేని సత్పుల
శ్రీవిభవమ్ములై యలరు చేసిన నాచెయిదమ్ము లంచు నా
పావన రామమంత్రము జపమ్మొనరించుచు నాత్మలోపలన్-

పాటయు గాదు, గానవిభవమ్ములరన్ సురలోక భాషలో
మాటయుగాదు, లోకజనమాస్య వచస్సుల తేటతెల్లమై
వాటిలు తీయముల్ తొనకు బాసలతో నట జెట్టు కొమ్మకున్
జాటున నుండియే పలుక సాగె నిటుల్ హనుమంతుఁడర్మిలిన్.

చల్లని పిల్లగాలులు కొసల్ దెసలందున పూవుఁదావులన్
జల్లెడు వేళ, మారుతి ప్రసంగములాచిఱుగాలి రివ్వలో
నల్లన వచ్చి విన్నడియె నావసుధాత్మజ వీను దోయికిన్
వెల్లువ జాలులై విరియవిచ్చిన తీయని పూవుఁదేనెలై.

మంజరి: ఇనకులనృపతులు మనువుమాంధాత మొదలగు వారియం దధికతేజస్వి
దశరథు పుత్రుండు ధైర్యసాహసుడు రాముడు సుగుణాభిరాముండు భువిని
తపసి జన్నముగాచె తాటకంజంపె జనకజన్ బెండ్లాడె శంభు విల్విరిచి,
తనసతి తోడను తమ్మునితోడ వనుల రాముండుండ జనకు నానతిని,
జనకజం దొంగిలి చనె రావణుండు. తనసతిన్ వెదకుచు వనులరాముండు
కిష్కింధ యందు సుగ్రీవుతోచెలిమి పాటించె. వానర వల్లభుండంత
జనకజన్ వెదుకంగ సకలదిక్కులకు కపులను బంపె నాకపిసేన గూడి
సాహసమ్మున నేను జలధిలంఘించి దనుజు లంకనుజేరి వనములోనిచట
సీతయెట్లుండు నో చెప్పగా వినుచు అట్లున్న నిన్నునే నరసితినమ్మ-
చేసిన యత్నమ్ము సిద్ధించినాదు జనువు ధన్యమ్మయ్యె జననియీనాడు. 343

అని విరమించె పావనియు ఆర్ద్రము లామధురోక్తి రీతులన్
జనకజ యాలకించి మది సంతస మచ్చెరువున్ జెలంగ తా
ననయముసంస్మరించు రఘునాయకు రాముఁదలంచి పల్కె జీ
వన మిడినట్టి యీమధుర భాషణ మెవ్వరి దంచునర్థిసల్-

కలయగఁజూచి జానకియు గాంచెను శీర్షమునెత్తి చెట్టు కొ
మ్మలనడుమన్ వసించు హనుమన్ దరుణార్కునిఁబోలు వానరున్,
లలితసువర్ణవర్ణు, గపినాయకు మంత్రిని వాయుసూనునిన్,
తెలివలువల్ ధరించుచు, మదిన్ వెఱపున్ గలిగించు వానినిన్.

అనయము కానలందుఁదిరుగాడుచు కాలము వెళ్ళబుచ్చు నీ
వనచరుఁడేమి యీపగిది వాకొనుటెట్టులు రాము గాథ నా
కనుఁగవ ముందునన్, నిజము గావుత మియ్యది యంచు మ్రొక్కె నా
జనకజయున్ బృహస్పతికిన్ విధి కగ్నికిన్ మదిన్.

కలఁతన్ బెట్టుచుమున్న పీడకల గాఁ గన్పించుచున్ కోతి భీ
తిల జేసెన్; శుభమౌను గాత మిథిలాధీశుండు నాతండ్రికిన్
విలసన్మూర్తులు రామలక్ష్మణులకున్ ; వీక్షించి తీనాడు క
న్నులముం దీకపి నేమి యౌనా యనుచున్ దుఃఖించె పృథ్వీజయున్.

పెను వెతలందు నిట్లు పరిపీడితయై స్రవదశ్రు పూరితా
నన యగు జానకింగని మనమ్మున నేమియు పాలుపోక అం
జనసుతుఁడామహీరుహము శాఖల కొంచెము డిగ్గి సాను భూ
తినయ వచస్సులన్ నుడివె తీయనిమాటలు తేటలూరగా.

ఫుల్లాంభోరుహపత్రనేత్రవు మహాపుణ్యాత్మ వీవిట్లు ప్రా
ద్దెల్లన్ గన్నుల నీరుగార్చుచును శోకింపన్ గతంబేమి, ఓ
తల్లీ ! యెవ్వరవమ్మ ! నాగసురకాంతాలోకసౌందర్యసం
పల్లీలల్ గనుపించునిన్నుఁగన భాస్వత్ సాధు రమ్యాకృతీ! 349

కమనీ యోజ్జ్వల మంగళాకృతివి ఓ కళ్యాణి, ఆకాశమ
ధ్యము నందుండి ధరిత్రికిం దిగిన దివ్యద్రోహిణీ తారవో,
విమల శ్రీయుత వా యరుంధతి వొ,నిర్వేల వ్యధాదుఃఖ భా
రము నీకేలనొ తల్లి, బంధుగులు దూరప్రాంత మం దుండిరో.

ఏమైనన్ భవదీయ రూపసుషమన్ వీక్షింపగా ; రాజక
న్యామూర్తిత్వము, భోగ భాగ్యయుత రాజాంతః పురీ ముఖ్య దే
వీమాన్యాకృతి యున్ స్ఫురించు నెద గానీ, దేవతారూపు నీ
కేమాత్రము లేదటంచు మదిలో నెంతున్ సరోజాననా.

నీమోమందము, నీధరించినది మేనింద్రాంగనా మాన్య వే
షామర్యాదయు చూచినంతన జనస్థానమ్ము నందున్న నా
డా మాయాదితిజుండు దొంగిలిన స్త్రీవా సీతవా! చెప్పు మ
మ్మా!మే లౌనిక రామ భూవిభుని భార్యారత్న మీవేకదా!

చనవులు నిండు నెయ్యమున చల్లని మాటల నిట్లుపల్కు యా
వనచరు జూడగా విహిత భావమొకింతగ గల్గి సీతయా
ననమున క్రొత్తగా వికస నమ్ముదయించుటఁగాంచి అంజనా
తనయుడు వేచియుండె వసుధాత్మజ యేమను నన్న యూహలన్.

తనలో తానెదియో తలంచి, తుదకున్ ధాత్రీజ వృక్షమ్ముపై
హనుమంతుంగని రామచంద్రుని యరణ్యావాసమున్ తాను రా
ముని వెంటం జనుదెంచుటల్ దితిజుడున్ మోసమ్మునందన్ను బ
ల్మిని దోడ్తెచ్చుటఁజెప్పి మాఱుపలుకుల్ లేకుండ శోకింపగన్.

ధరణిజ యీమెయే యను ముదమ్మున పావని వృక్షశాఖలన్
సరగునడిగ్గి జానకి దెసన్‌గని కైజత మోడ్చి నీవికన్
వెఱవకు మమ్మ రాముఁడును వేగమె వచ్చును, రామదూత నై
పరువున వచ్చి తీ కుశల వార్తను నీకెఱిగించు కోరికన్- 355

వేద వేత్తయు బ్రహ్మాస్త్ర విదుఁ డతండు
దశరథు సుతుండు రాముండు కుశలముచట
రాము ననుజుడు తేజోవిరాజితుండు
లక్ష్మణుడు మీకు కైమోడ్పులను పచించె.

ప్రవిమల సాధు భాషణలు పావనిపల్కులు విన్నయంతనే
యవనిజ హర్ష భావ పులకాంకిత యై హను మంతుఁజూచి యో
ప్లవగవరేణ్య నీవచనపద్ధతి కబ్బురమయ్యెఁగాని ని
క్కువముగ రామదూత వని కోతివి నిన్నెటు నమ్మఁజాలుదున్.

మునివయి వచ్చి మా కుటికి మోసమునన్ ననుఁబట్టి నాడ వీ
వనచరరూపుతో మరల వచ్చిన దైత్యుఁడ వేమి సేయగా
మనమున నెంచి వేసమును నార్చితి విచ్చటి కే విదారణం
బొనరుప నున్న వాడ వొకొ యుర్విజమాత్రమునీకు దక్కదున్-

రాముని దూతయౌ వనచరప్రవరుండవు నీవె యైనచో
సేమము నీకగున్, శుభము సేకురుఁజెప్పు మొకింత యారఘు
స్వామిగుణమ్ములున్, పలుకు చందము; లక్ష్మణుఁడెట్టి వాడు, నన్
స్వామి తలంచునే మనము నం దని జానకి బల్కె హన్మయున్.

జననీ! ధన్యుడనైతి, నాప్రభువు భాస్వత్ సూర్యతేజస్వి, చం
ద్రుని సంపూర్ణకళాకృతిం బలె ప్రసన్నుం డాతఁడావిష్ణుదే
వునికిన్ సాటి యశోధనుం, డినకులోద్భూతుండు శ్రీరామమూ
ర్తిని వర్ణింపఁదరమ్మె సత్యవచనోద్దీప్తోరు వాచస్పతిన్-

రమణీయాకృతి రామభూవరుడుఁధర్మస్వాంతుఁ, డుద్యత్‌ప రా
క్రమ కోదండుడు, రాజశీల మలరారన్ నిగ్ర హానుగ్రహో
ద్యమ దక్షుండు; సుమిత్రసూతియు సముం డన్నింట శ్రీరామ చం
ద్రమహీజానికి కీర్తియందు, ధనురస్త్ర ప్రౌఢ విద్వత్తులన్.

ధరణిజ! నీవెఱుంగుదు గదా రఘు వంశమనోజ్ఞ మూర్తులా
యిరువురు యిర్వురే రణమహేశ్వరు లుత్తమ రాజలాంఛనుల్;
నిరుపమ వార్షు కాంబుదవినీల శరీరుఁడు రామచంద్రుఁడున్,
వరుస పదారు వన్నియల బంగరు బొమ్మ సుమిత్రపుత్రుఁడున్. 362

సురుచిరమూర్తులున్ సుగుణసుందరు లారఘురామలక్ష్మణుల్,
పరువము గన్న భాస్కరుని వంశమునన్ మణిమూర్తు లిర్వురున్,
ధరణిని నేటి దన్క గుణధన్యులు మాన్యులు నిట్టి వీరశే
ఖరులు మఱెవ్వరెచ్చటను గానగరా రని లోకులందురున్.

ఇంచుక రాము నోట జనియించిన మాట యొకండుచాలు ధ
ర్మాంచిత వేదమార్గ పథమయ్యది, ఆలకు మార్దవంబు క
ల్పించగఁజాలు సాధువును; ఎంత వచించినఁజాలదా కృపా
ప్రాంచదుదార భావమహితాత్ముని రాముని గూర్చి చెప్పగా.

రాముఁ డజేయ విక్రమధురామహిమాన్విత ధైర్యసాహసో
ద్దాముఁ డతండు లేని తరి తాపస వేషము నూని వచ్చి నిన్
కామ మదప్రవృత్తి దశకంఠుడు దొంగిలిపోయి లంకయం
దీమెయినుంచె తత్ఫలిత మేదియొ చూచు నతండు శీఘ్రమే.

రావణుఁడట్లొనర్చిన దురాగతమున్ విని యాగలేని దుః
ఖావిల చిత్తులై నిలిచి రచ్చట రాముడు లక్ష్మణుండు సు
గ్రీవుడు మూవురున్ నిను స్మరించుచు; వేగమె వచ్చి యాదశ
గ్రీవుని శీర్షముల్ దునిమి పృథ్విజ! నిన్గొనిపోవు రాముఁడున్.

నమ్ముము తల్లి! నేపవన నందనుఁడన్ హనుమంతుఁడన్న నా
మమ్మున వానరాధిపుని మంత్రిని, రాముని లక్ష్మణున్ వనా
ధ్వమ్మునఁజూచి తోడ్కొనుచు వచ్చితి వానర రాజు నొద్దకున్
సమ్మతి c జెల్మియయ్యె రఘు నాథునకున్ గపినేత కచ్చటన్.

తీరదు కోపమా సమరధీరులకున్ దశకంఠు శీర్షముల్
ధారుణి cగూలు దన్క, యిదితప్పదు వత్తురు వారు శీఘ్రమే;
వారును సే మ మా యెడను పర్వున నేచని నీదు వార్తయున్
వారికి సెప్పగావలయు వంతలికన్ విడుమమ్మ నీయెదన్. 368

మనసున్ విప్పుచు రామలక్ష్మణుల సేమంబున్ సుధాసారవా
చనుడై తెల్పిన వాయుసూను గనుచున్ క్ష్మా జాతయున్ వానిపై
ననుమాన మ్మెడలింప లేక, నను మాయా వాక్యముల్ దెల్పి వం
చన సేయన్ చనుదెంచినాడవని నాస్వాంతమ్ము బాధించెడిన్.

మనుజులు లేరె వేరయిన మార్గము లేదొకొ దూత నంప నా
యినకుల రాజ శేఖరున కీకపి కావలెనా? మహాంబుధిన్
వనచరు లెట్లు దాటెదరు, పల్కగలారొకొ యిట్లు, రామల
క్ష్మణులకు నైన దాటుటకు సాధ్య మొకో జలరాశి నంతయున్.

ఎఱుగుదు నందు వా యినకులేశుని యాతడు నన్దలంచునా
విరహవిచార మగ్ను డెటు వేగుచు నుండెనొ యేమొ, లక్ష్మణుం
డెఱుకువతోడ నన్ను కొనరించునె సేవలు రామమూర్తి కా
బరువిక తగ్గునే, కనుగవన్ భువినాతని జూడ నేర్తునే.

గడు విక రెండు మాసముల కాలమె యంతటి లోన రాము డీ
యెడ కరుదేరకుండినను పృథ్వితనూజకు నేమియున్న దీ
యిడుముల మధ్య జీవితము నేదొగతిని సమయింతు నంచు దం
దడివడి యేడ్చు జానకికి నంజలిఁబూనుచు నాంజనేయుడున్.

అమ్మా నమ్ముము నాదుమాటలను, మాయాదైత్యుడన్ నేనుగా
నమ్మా! శంభునియంశతో నతుల సత్వాఢ్యుండనై ధాత్రి జ
న్మమ్మున్ గాంచితి నంజనానిలులకున్, రామావనీ స్వామి నన్
నెమ్మిన్ నమ్మిన బంటుగా ననిపె నన్వేషింప నిన్నీయెడన్.

రాముఁడు వార్ధి దాటి యిటు రాగలడాయను శంక మాను మా
రాముఁడజేయ విక్రమధురా మహిమాన్విత ధైర్య సాహసో
ద్దాముడు, విల్లునమ్ములను దాలిచి నిల్చిన యేని లోకసం
స్తోమము నిల్వజాల దొక తోయధి యాతనిముందు లెక్కయే. 374

తన సాయమ్మున సూర్యుపట్టి సుఖమందన్ రాజ భోగమ్ములన్,
జననీ! రాముడు మాత్ర మొంటిగనె తత్శైలమ్ము నందే వసిం
చును చిత్తమ్మున నిన్ దలంచుచు నెదో శోకమ్మునన్ భూమిజం
గను భాగ్యమ్మికఁగల్గునా యను వియోగ వ్యాకులోద్విగ్నతన్.

''ఎఱుగదు నన్ను వీడి దినమేనియు పెండిలి నాటి నుండి యా
ధరణి జ సీత, నాసకలతన్వున ప్రాణము ప్రాణమా మనో
హరమధుమూర్తి లేక సుఖమన్నది నాకిక నేల'' నంచునున్
నెలుదలు వోవు లాకటిక నేల పరుండును రాముడొంటిగా.

''సీతకు మొక్కలన్న, వికసించిన మవ్వపుబూవులన్నచోఁ
బ్రీతి, నవాంకురమ్ములను వేడ్కగ పెంచుచు నుండు నామె'' యం
చాతడు శీతలాంబువుల నాపువు మొక్కల వద్ద బోసి ని
శ్చేతను డై నిలంబడును, సీత యనన్ మది యెంతమెత్తనో.

తనశోకమ్మును తానె మ్రింగుకొని వంతన్ మున్గి కన్నీరునిం
చును, సీతాయని నిద్రలో పలవరించున్, చెంతనున్నట్టివా
రును తమ్ముండెది యేని సాంత్వనపుఁ బల్కుల్ దెల్పఁగాఁ బూనుచో
మనసీయండును మాటలాడడును రామస్వామి మౌనమ్మునన్.

అతడు వసించు నాప్రసవణాద్రిని పూఁబొదలెల్ల సాక్షిగా
ప్రతిన నొనర్చి తెల్పుదును రాముడు నా ప్రభు, వీవు మాతవున్,
క్షితిపయి మీపదాబ్జయుగసేవలు నాపరమార్థసాధనల్
సతతము; నమ్ము మీ పలుకు సాధుమతీ రఘురాము గేహినీ.

అదియేదో యొక దుర్ముహూర్త మసురుం డానాడు కొంపోవుటే
మొదలై రాముడు లక్ష్మణుండును వనమ్ముల్ నాల్గుమూలల్ నినున్
వెదుకం బోవని చోటు లేదు, నిను నన్వేషించు చున్ రాత్రులన్
నిదురంబోవను లేదు, అన్నమయినం దిన్నట్లె కాన్పించదున్– 380

ధరణిజకోసమై వనపథమ్ముల రాముడు బోవువేళలన్
వరుసగ నాజటాయువు కబంధుడు ఆశబరీలలామయున్
సరసతఁజెప్పి నట్టినుడిచందములున్ కపినాథు చెల్మియున్
గరువలిపట్టి సర్వమును క్ష్మాసుతకున్ వచియించె నమ్రతన్.

వీనులకున్ జటాయు వను పేరు వినంబడి నంత కన్నులన్
జానకి కన్నీరుల్ దొరల సాగె వడిన్, తనకై నిశాటుతో
ప్రాణములొడ్డి పోరిన మహామతి యావిహగుండు, సీత కున్
మానసమున్ గరంచిన సమార్ద్రతులవ్వి కృతజ్ఞతాశ్రువుల్-

జనకజ నెన్నడేని గనఁజాలుదునా యను చింతతోడ కా
ననముల బట్టి వచ్చు రఘు నాథుని కూఱట గొల్పు నట్టి సూ
చనలును దోచె గ్రీష్మ దివసమ్ముల రాలిన జల్లులట్లుగన్
వనచర రాజు వీటికిని వచ్చిన నాడె మనోగతమ్మునన్.

తన కనుసన్నలన్ మెదలు దాసులు వానరు లెంద ఱుండినన్
కనుగవ నెత్తి చూడఁ డిది కావలెనంచును కోర డాతఁడా
జనకజలేని నాకు సుఖసంపద లేలని కుందు నొందు; రా
మునిగని నిస్పృహోయులు కపుల్ సయితమ్మిరి యాడి యేడ్తురున్.

అలరుల్ విచ్చిన పూవు దీవలను నీవైయుందు వం చాసతో
గలయం జూచును, కోయిలే కడనొ శాఖన్ గొంతు సారింప నీ
పిలుపంచుం జనుచుండు, రాముని కికన్ వెన్వెంట సౌమిత్రియే
కలఁడోదార్పగ, నెమ్మదిన్ గలఁచు శోకమ్మింత చల్లార్పగన్-

అడిగితి వేదొ నేనుడువు నంతకు ముందె, భయమ్ము నంది బె
గ్గడిలితి వేను రాక్షసుడ గాను ; రఘూత్తము సత్కృపాదృతిన్
బడసిన వాడ నీవనము నందున నిన్గని నంత సంతసం
పడితిని, స్వామి రాముడును వచ్చును నిన్గొని పోవజానకీ! - 386

తనవయి ప్రేమ రాముఁడెద దాచెనె యింతగ నన్న యూహలో
జనకజ గుండెయల్ కరగి జారె నవాశ్రువు లింక వేగమా
దినకర వంశజుం డరుగు దెంచును ద్రుంచును దైత్యునన్న వా
ర్తను విని మోము విచ్చిన ధరాసుతఁజూచి సమీరసూనుడున్.

అవు నమ్మా, రఘు వీరు వెంటఁగపిసైన్యం బెల్ల నేతెంచు నా
దివి జారాతిని మట్టు బెట్టగ, సమిద్ధీరప్రతాపాఢ్యులా
ప్లవగోత్తంసులు వార్ధి సంతరణమున్ లంకాపురీ ధ్వంసమున్
వివి ధోపాయములన్ బొనర్తురిదియున్ వీక్షింతు వీవే యికన్-

కోతిగ నన్నుఁ జూడకు మకుంఠిత సాహస నిర్విరోధ వే
గాతిశయుండ నీ జలధి నంతయు దూకితి రామ మూర్తికిన్
దూతగ వచ్చి, కామగమనుండను వాంఛిత కామరూపుడన్
ప్రీతిగ c జూచి నాపలుకు విన్నపమున్ వినుమమ్మ వేడెదన్.

ఉరుతరమైన నాపటు బలోగ్ర రయోద్ధతికేమి, రాఘవే
శ్వరుకరుణావిలాస విభవమ్మొక టున్నది నాకుఁజాలు నీ
ధరణి నసాధ్యమన్న దెడదన్ గను పింప దొకింతగూడ సా
గరమును లెక్కసేయ కొక గంతున నేనిటు దూకి వచ్చితిన్-

రాముని యాజ్ఞ లే కరమరంబడి చూచుచు నుంటి గాని నా
భీమబలమ్ము జూపి యొకపెల్లగ నీవన మెత్తి నిన్ను నీ
రాముని వద్దc జేర్చగల ప్రాభవమున్నది తల్లి! యానభ
స్సీమలకైన నేనెదుగు చేవగలాడను చూడు మంచునున్.

చంచలద్వాల నిపీడి తాఖిల దిశాస్థానమ్ము లూటాడగా
పెంచెన్ దేహము వాయుసూనుడు మహాభీలాకృతిన్ విక్రమో
దంచత్ ప్రౌఢ విజృంభణోద్ధత తనూద్రాఘిష్ఠ తేజశ్చ టల్
పంచారించుచు భూనభస్థలులు గప్పన్ సీతకాశ్చర్యమై. **392**

మేరు గిరీంద్రు నున్నతిని మించి నభస్స్థలి నంటు రూపవి
స్తారుడు వాయుజం డవనిజం గని ; నాభుజపీఠమందు నం
జేరుము తల్లి రాముకడఁజేర్తును ; లక్ష్మిని విష్ణుమూర్తికిన్
క్షీరసముద్రరా జిడిన చెల్వు లెసంగిన రీతి నంచనన్.

నీవని నంత సాహసబలీయుడవే హనుమంత! నన్ను గొం
పోవగ సంద్రమందు బడి పోదు నొ యేమొ; నిశాట యోధులున్
ద్రోవలు గాచి యెట్టి  యెసరుల్ ఘటియింతురొ యిట్టి యత్నమా
పావన మూర్తి రామ నరపాలుడు నెమ్మది సమ్మతింపడున్.

జనకుని యజ్ఞవాటికను జన్మమునందితి, కోసలావనీం
ద్రునకును గోడలైతి, గుణ ధుర్యుడు రాముని పత్నినై యిటుల్
జనుదునె కన్మొఱంగి కపిసాయములన్ ; దనుజేంద్రుఁడట్లు వం
చనమెయి మౌని వేసమున నన్గొని వచ్చెను గాక లంకకున్.

వినుము మఱొండు నేనగుచు వేఱుగఁజెప్పగ నేల, క్రూరులా
దనుజుల బారి బడ్డ తన తన్విని రక్షణసేయు కార్య మా
యినకులజుండు రామధరణీంద్రుని కర్తము, వేరు దారులం
జనుటలు పౌరుష ప్రబల సాహసు ఁడారఘురాముఁడోర్వడున్.

అనిన మహీజ వాక్యముల యందొక యర్థమునాత్మలో పలన్
హనుమగ్రహించి శీఘ్రముగ నారఘుసత్తము వద్ద కేను ని
న్గొనిచను నూహలో నిటుల కూడని తొందర మాట లాడితిన్
జనని! క్షమింపు మన్న కపి సత్తమునిన్గని నవ్వె సీతయున్.

ఇంక మ ఱొక్క మాట జననీ! యిదె నాకడ నున్న రామనా
మాంకితమంగుళీయకము నాతఁడొసంగిన దానవాలుగా
నంకిలి మాని దీనిఁ గొనుమా, నిను గన్గొన నాకు నెట్టి యా
తంకము లేక రక్షనిడె తల్లియిదేనని యిచ్చె హన్మయున్. 398

అచ్చపు రత్న కాంచనమయ మ్మది సీతకు గుర్తె దానినీ
వచ్చిన కోతి వంచకుఁ డెవండును కా దిక రామ మూర్తికిన్
నచ్చిన బంటె యీతడను నమ్మిక గల్గిన భావమాధురుల్
మచ్చికలై ప్రసన్న ముద మంజుల మయ్యె మహీజ యాస్యమున్.

తాము వివాహమైనపుడు తండ్రి యొసంగిన పెండ్లి కాన్క శ్రీ
రాముని యంగుళీయము నురమ్మునఁబెట్టుచు కండ్ల కద్ది యా
రాముడె వచ్చినట్లు దన రామునిఁజూచిన యట్లు లెంచుచున్
భూమిజ తాల్చె నశ్రు కణముల్ జడిగా తను వెల్లఁ బుల్కలై.

రాముని వ్రేలియందు రుచి రమ్యము లేలి వెలుంగు లాలనల్,
గోముగ నాడు చెక్కిళులకున్ వలపుంబులకల్ రచించిన
న్ప్రేమగ వచ్చినట్టి కరుణోదయ సాదరభావ భాగ్యమీ
కోమల కాంతి రాశి యను కొంచును సీత శిరమ్ము వాలిచెన్.

అంధ తమసమ్ము నెడఁబాపు నరుణు కరణి,
నెడద యందలి దైన్యము నెడలఁజేయ
నరుగు దెంచిన యట్లయి హనుమ రాక
పలికె నిట్లు సీతయు గపిప్రవరుఁజూచి.

హనుమా నీబల పాటవమ్ము విదిత మ్మంభోనిధిన్ దాటి దై
త్యనివాసమ్మగు లంక కొంటరిగ ధైర్య మ్మొప్ప నేతెంచినా,
వినవంశాధిపు దౌత్య కార్యమున కీవే యర్హు డంచెంతు రా
ముని సేమమ్మును దెల్పినావు మది సమ్మోదమ్ము నిండారగా.

తెలుపు మిదొక్కమాట కపిధీవర! యేలొకొ రామలక్ష్మణుల్
ప్రళయ పరాక్రమ ప్రబల వహ్నులు నాకొఱ కింత దన్కనున్
బలములు గూర్చి రావణునిపైఁ బడరారు వియోగ వేదనా
కలితుడతండు మందమతి కాడుగదా రఘురాము డింతకున్. 404

సు(గ్రీవుండును వచ్చునా కపి భటస్తోమంబుతో సైన్య సా
మ(గ్రీ సంయుత వీరుడై, భరతుఁడున్ మన్నించునా నన్ను, పం
క్తి (గ్రీవుం డని ఁగూలుటల్ దురకుఁ(బ్రీతిన్ జూతునా, వేదనా
వ్య(గ్రీ భూతుఁడు రాముఁడిప్పు డలసత్వం బంద కుండున్ గదా.

తనకీ దానవ బాధలంతమయి చిత్తమ్మందు శాంతత్వమున్
గొను టేనాడిక నంచు వందురెడు నాక్షోణీజకున్ మ్రొక్కి యా
హనుమంతుండును సందియంపడకు మాతా! దైత్యుడీలంకకున్
నినుఁ దోడ్తెచ్చు టెఱుంగ డా(ప్రభు వికన్ నేనేగి తెల్పన్ వలెన్.

(ప్రకటతరాత్మగౌరవ విభాసురుఁ డు(గ్రమహా(స్త్రపాటవత్
వికలిత శా(త్రవుండు రఘువీర శిఖామణి రాముఁడా కిరా
తకదనుజేం(ద్రు నిం దునిమి తథ్యమ నిన్గొని పోవు; రాజ్ఞిగా
నిక నినుఁ జూచు భాగ్యము లభించును వేగమె మాకయోధ్యలో.

అనుచున్ మ్రొక్కులు దీర్చి నిల్వబడు నాహన్మంతునిం గాంచుచున్
తనయున్ బంపెడు మాతృ వత్సలత చందం బొప్పగా గద్గద
స్వనయై కన్నుల న(శ్రుధారలొలుకన్ క్ష్మాపు(త్రి పల్కెన్ మన
మ్మున నూల్కొన్న తలంపులొక్కపరి మోముందమ్మిలో వెల్వడన్.

ఇమ్ముగ నీకునుంగరము నిచ్చిన రాముడు నీదుపల్కులన్
నమ్మను లంకయందుఁగని నట్టిది వీనుల విన్నదిన్ సమ
స్తమ్ము వచింపుమా దశరథాత్మజు లిద్దరికిన్; (గహింతురే
చుమ్మల యందు వందురుచు క్షోణిజ యున్నదొ దైత్యులంకలో.

ఆయత బాహు వి(క్రమ బలాధిక శౌర్యమహో(గ్ర వీరనా
రాయణు లా సహోదరులె అల్గిర యేని (త్రివిష్టపమ్ములున్
డాయగ లేవు, రాక్షసగణ మ్మొకలెక్కయె వారికిన్ తృణ
(ప్రాయము లట్లుఁ జూచి బడవైతురు చండతరా(స్త్ర వహ్నులన్. 410

అనియొక్కింత నిమీలి తాక్షియుఁనెదో యాలోచనామగ్నయై
మనసున్ గన్నులు రామ చంద్రు మహిమన్ మన్నించు ధ్యానోపము
ద్రను పృథ్వీజయు బల్కె, సత్యమును ధర్మమ్మున్ కృపాదృష్టి తో
ననుసంధించు మహోత్తమవ్రతుఁడు నానాథుండు నన్నోముతన్.

ఎవని పదాంబుజాత రజ మీశిరమందున భూషణాయతం,
బెవని మృదుస్మితార్ద్ర రుచు లీ బ్రతు కంతకు వెల్గు దారు లౌ,
నెవని కరాంగులీ మృదువు లీ తనుధన్యతఁగూర్చు స్పర్శ లా
ప్రవిమల సాధుశీల గుణరమ్యుఁడు రామునకున్ నమస్కృతుల్.

సదమల రాజసౌధ పృథు సంపద కాదని భార్య నూర్మి ళా
సుదతిని యింటిలో విడచుచున్ సుకముల్ వలదన్న దీక్షలో
వదినకు నన్నకున్ విపిన వాటిక సేవకుడైన త్యాగశీ
లధనుఁ డుదార సద్గుణుడు లక్ష్మణ మూర్తికి నాశిషమ్ములౌ.

రావణుఁజంపగా నిటకు రాముడు వచ్చుటకున్ సహాయదీ
క్షావిధి సర్వయత్నములు సల్పుచు నుండిన కీశరాజు సు
గ్రీవున కంగదాదులకుఁ బ్రీతిగ నే శుభమున్ వచించి తంచు నో
పావని చెప్పుమా'' యనిన పల్కులు విన్న సమీర సూనుడున్.

ఆర్తిలోఁగూడ ఎంతటి యార్ద్ర మూర్తి
అవనిజ ! యెడంద బడబాగ్ని నణచు కొన్న
పరమకరుణాబ్ది యామె తత్వ మ్మనూహ్య
మనుచు మారుతి తనకార్యమును దలంచి.

తరువుల్ చాటుగఁ జేసి చూతురదె దైత్య స్త్రీలు వేవేగనే
నరుగంగావలె నిన్నుఁ గన్గొనిన యట్లా స్వామికిన్ దెల్పగా
గురుతే దైన యొసంగి పంపుమని మ్రొక్కుల్ వెట్టి నిల్చున్న వా
నరవర్యుంగని సీత అచ్చెరువొకింతన్ దోచు దృగ్రేఖలన్- 416

చూడామణి

ఆరఘురాముడే యడిగెనా, మఱి నీవుగ నానవాలునున్
గోరుచు నుంటివో తెలియకున్నది, ఆతడెఱుంగడా, మహా
వారిధి లంఘన ప్రథిత పాటవశాలివి, యంగుళీయక
మ్మారక యిచ్చెనా వనచరోత్తమ! నిన్నునుఁదాను నమ్మకన్.

రామక్ష్మాపతి వర్తన మ్మదియు చిత్ర మ్మోచుఁ గాన్పించు నా
కేమో అర్థము కాదు చిన్నమును విన్మీగాధ హన్మంత; శ్రీ
రాముండొక్క దినాన నన్నుఁదనతో రమ్మంచుఁగొంపోయి కే
ళీమోహమ్మున జల్లులాడె కొలనిన్ లీలా వినోదమ్ముగా.

ఆరగ నిచ్చి వస్త్రముల నాయెడ చల్లని చెట్లనీడకున్
చేరితిమంత, రాముడును చేయికి చేయిని కూర్మిఁ జేర్చి నా
యూరుల మీదనున్ శిరము నుంచుచు నిద్దుర వోవు వేళకున్
గేరుచు వచ్చి నాయురముఁగీరెను కాకి యొకండు ధూర్తతన్.

నాథుని నిద్ర భంగమగు నన్న భయమ్మున నూఱకున్న నా
మీదకు మాటిమాటికిని మిట్టిపడున్ బలిభుక్కు, కొట్టినన్
పోదది, వాడిగోరులను మోటు తనమ్మున గీర బోవ నే
వేదనఁ జెందుచున్ గదలి వెన్కకు తప్పుకొనం దలంపగా.

స్తనముల మధ్య ముక్కు కొన చయ్యనఁ గ్రుచ్చి పెకల్చి మాంసపుం
దునుకను, నెత్తు రోడికలతో తడిముద్దగు నన్నుఁ దాకి మే
ల్కని కినుకన్ రఘూత్తముడు కాకిపయిన్ వదలెన్ తృణమ్ము మం
త్రనియత శక్తితో విధిశరప్రతిమాన మహాయుధమ్ముగా.

వదలదు కాకి నాయిషువు, వాసవు పుత్రుఁ డటన్న పక్షి య
య్యది చతురాస్య దత్త వరమబ్బిన జీవియు, భూదివమ్ములన్
పది దెసలందునన్ దిరిగి బాసటఁ గానక రాము సంఘ్రములం
దదవద వ్రాలి కన్నును తృణాస్త్రసమర్పణ జేసి తాచనెన్. 422

సీచత నాపయిన్ బడగ నేర్చిన కాకినిఁద్రోచు సత్కృపా
శ్రీచణమూర్తి రాఘవుఁడు, శీఘ్రమ నన్గాని పోడొ రావణున్
పీచమడంచి, బాహుబలవీరమహేశ్వరు లన్నదమ్ములున్
వేచనుదెంచు వేళకయి వేచుచు నుంటి సమీర పుత్రకా.

గడు వికరెండుమాసముల కాలము రావణు చేతులందునన్
మడియుట యో మఱొక్కటియొ నానొసటన్ విధివ్రాసె నిద్ది నీ
నుడువుట యందె సర్వమును నున్నది వెన్కకు బోయి ; రామచం
ద్రుడు తనభార్యనున్మఱవ నోపడటంచు ఁదలంతు మారుతీ.

వానరవర్య! రామ నరపాలునకీకథఁ జెప్పుమీ యభి
జ్ఞానముగా హృదంతరమునం దెలియంగల డాత,ఁ డిచ్చటన్
వానర నాథునిం బ్లవగ వర్యులగూడి రఘుప్రవీరుడం
భోనిధి దాటివచ్చు దినమున్ గణియించుచు వేచి యుండెదన్.

ఈనాయూహను మువ్వురే గరుడుడు న్నీవున్ మహావాయువున్
గానీ వార్ధిని దూకనేర్తురు కడంకన్ ; స్వామి సాహాయ్యమై
ధీనైపుణ్యుడెవండొ రావలెను వార్ధిన్ వారధిన్ గూర్చి యో
ధానీకమ్మును లంకఁ జేర్చగను, సాధ్యంబిద్ది యౌనందువా.

ఇంతగ చేటుమూడి బ్రతుకీగతి నున్నది, రామమూర్తి నా
చెంతకు వచ్చునప్పటికి జీవము లుండునొ లేదొ నాకు, నీ
వంతు వచింపు మేగి రఘువర్యున కోకపివర్య లేడికై
పంతము బట్టి వారి నటు బంపినపాపము పండకుండునే.

అనిదుఃఖించు ధరిత్రిజం గనుచు నాహన్మంతుఁ డమ్మా యదే
పనిగా క్రందులు పోదువేల రిపు విధ్వంసప్ర తాపాఢ్యుఁ డా
ఘనుడారాముడు వచ్చు, కీశపతియున్ గావించు సాహాయ్య మీ
వనధిన్ దాటుదు రెల్లరున్ దనుజవిధ్వంసమ్ము తథ్యమ్మికన్. 428

ఇందుల కంతరాయ మెదియేనియు గల్గిన యేని మద్భుజా
స్కంధము లందునన్ గడువు కాలము లోపల మోసితెత్తునా
నందముతో సలక్ష్మణుని నాప్రభువున్ ; దశకంఠునిన్ చమూ
బంధు సమేతమున్ దునుము పాటవ ధుర్యులు వార లిర్వురున్.

సందేహింపకు మమ్మ వానరచమూసామర్థ్య మాత్మన్, దిశా
సందోహమ్మును చుట్టిరాగల, రుదంచత్ శైల శీర్ష స్థలం
బందం జాలుదు, రేయుపాయముననో యంభోనిధిన్ ఆలతో
బంధింపగల రానిశాట నిధన ప్రత్యుత్క మైకాగ్రతన్.

హనుమ నుడివిన పలుకుల నాలకించు
సీత ముఖసీమ యొకక్రొత్త చెలువెసంగి
దైన్య మెడలి వికాసవంతముగ దోచె ;
మబ్బు చెఱవీడు చంద్రబింబమ్ము పగిది.

భూమిజ నెమ్మదిన్ ప్లవగ పుంగవు నందలి రామ కార్యదీ
క్షామతమున్ గ్రహించి కడు జాగ్రతగాఁ దన చీర కొంగునం
దే ముడిఁ బెట్టి యుంచినది యుజ్జ్వల హేమ మణీమయమ్ము చూ
డామణి దీసి చూచుచు వడంకు కరమ్మున హన్మకిచ్చుచున్.

హనుమా యిమ్మిది యానవాలుగను నాప్రాణేశుఁ డా రామ చం
ద్రున కాతం డిది చూచి నంతటన నాతోబాటుగా కోసలేం
ద్రుని, నాతండ్రిని గూడ మానసము నందున్ జ్ఞప్తి కిం దెచ్చి, వ
చ్చిన నీకార్యము పూర్తియౌటకును హర్షింపంగలండాత్మలో

ఆరఘుమూర్తి రాగలిగి నప్పటి మాటగదా, శరీరమీ
ధారణినిల్పు నాకు ; పిశితాశనుఁ డీల్గి మదీయ బాధలే
తీరున తీరునోయది మదిన్ గనుమంచు వచింపు మా మహా
ధీరులు రామలక్ష్మణ సుధీగుణ మూర్తులకున్ కపీశ్వరా. **434**

సాగరమ్మెల్లదాటి రఘుసత్తముసేమము దెల్పినావు. నీ
యాగమనంబు నాకును ముదావహమయ్యె శ్రమమ్ము వాయ నీ
వాగుము నేటికేవిట రహస్యముగా నెటనైన, మద్వ్యధో
ద్వేగము తగ్గ, దాపున కపిప్రవరుండవు నీవుఁగల్గుచో.

అనలో దాత్తము లుర్విజావచనముల్ హన్మంతు స్వాంతమ్ము నం
దమ్మృతాసారము లట్లుఁదోచి యతడమ్మా ! నేనిటన్ నిల్వగా
సమయం బియ్యది యౌనె? యిచ్చటి సమాచారమ్ము సర్వమ్ము శీ
ఘ్రమతెల్పన్ వలె, రామ భూవిభుని లంకాయాత్ర సాగన్ వలెన్.

అను నాయంజనసూతి తొందరలు తానాత్మన్ ధరిత్రీజయున్
గని, వాత్సల్య సుధాస్రవన్మధుర రేఖల్ మోము నం బ్రామగా
చనుమో మారుతి నీదు కార్యములు భాస్వద్దిగ్జయోపేతవ
ర్ధనతన్ మించుత వజ్రదేహి వగుగాతన్ నీకు నాదీవనల్.

నిరుపమ శౌర్యధైర్య మహనీయుడ వీ వెటనున్ననున్ సదా
వరుణుఁడు వాయు వీశ్వరుఁడు వహ్నియుఁ బ్రోతురుగాత వేగమీ
వరిగి యటన్ రఘూత్తమున కంతయు తెల్పుచు తోడితెమ్ము వా
నరవిభుసేనతోడ ననినన్ విని పావని కైజత మోడ్చి సీతకున్.

అచ్చోనేగి వచింతు రామునకు నీ వన్నట్టి దెల్లన్ ; వడిన్
వచ్చున్ తమ్మునిగూడి స్వామియు, కపి వ్రాతమ్ము సుగ్రీవుడున్
వచ్చున్, రాముని చేతి శాత విశిఖ జ్వాలన్ దశగ్రీవుడున్
చచ్చున్ తథ్యమటంచు సీతకు నమస్కారమ్ము లర్పించుచున్.

తోకన్ ద్రిప్పుచు రామదూత కృతిసంతోషంబు నిండార పెన్
వీకన్ దానరిగెన్ ; నిశాటతతి యెందేఁదన్ను వీక్షించి పై
పైకిన్ దూకి యెదుర్చుచో నిజభుజావష్టంభ శుంభద్బలో
ద్రేకమ్మున్ గనఁ జేతునన్న కుతుకోద్దీప్తోరు దర్పమ్మునన్. 440

హనుమయు నేగి నంత, దను జాంగన లాయమయుల్ఁజేరి యా
జనకజ; యెవ్వరే యతడు చయ్యననీకడకేగు దెంచి యిం
దనుకను మాటలాడి చనె, నాతడెవం డది యేమి బాసయే
వనచరు నట్లు మాకు కను పట్టె నతండెటకేగె నింతలో.

తెలుపుము వేగ వాడరుగు దెంచిన హేతు వదేమి? పారిపోఁ
దలచితివేని చెట్టునకు తక్షణమే నినుగట్టి వైతు మం
చలజడిఁజేయగా త్రిజట అడ్డుగ వచ్చిటువంటి చెట్టలున్
వలదిక సీతపై ననుచు వారల నావల కంపె నేర్పుతో.

ఆతడెవండొ నేనును సమస్త మెఱుంగను నేడొ చేపె మీ
కాతడె చెప్పు నేమొ యను నా ధరణీసుత యన్న మాటకున్
భీతిలి దైత్యభామినులు వేగమె యేగి దశాస్యుజూచి యా
కోతియు జానకిన్ గలిసి కొన్న విధమ్ము వచింపబోవగా.

ననుఁబువు సెజ్జలందు మదనోత్సుకుఁడైన నిశాట రాజు కా
వనితలు చెప్పి నట్టిదియె పట్టదు; కామము నెత్తికెక్కగా
గనబడునే వినంబడునె గాఢ వధూపరిరంభ సంభ్రమ
స్వనితము మధ్య నెవ్వరయి వచ్చిన యెంతటి వార్తదెచ్చినన్.

వలదని చెప్పినన్ త్రిజట, వచ్చితి మీపనిఁ బూని స్వామికిం
దెలుపుటకై యశోకవని తీరులు బోవు విధమ్ము కొంత ; కా
వలసిన వారి చెప్పదగు వార్తలు గూడ వినండతండు ఆ
వల మనకేల యం చెవరు వచ్చిన దారిని వార లేగిరిన్. 445

ఆశ్వాసాంతము

హనుమయు నశోక వనమున
దనుజస్త్రీలకు నడుమగ ధరణీతనయన్,
తనయత్నము సఫలమ్మయి,
కనువిందుగ గనఁగలిగిన కథయిది రామా.

శాశ్వ తానంద లక్ష్మీప్రసాద భాగ్య
వరదుడవు, నిత్యకారుణ్య భావుకుడవు,
నిత్య సత్యవ్రతివి ధర్మ నియతమతివి,
రమ్య సద్గుణ సాంద్ర శ్రీరామచంద్ర. !

భావము సర్వ మీవయయిఁ భావిత కార్యము సర్వ మీవుగా
త్రోవలు జూపగల్గు నెనరుల్ గను టెన్నటి కబ్బునంచు నీ
పావన పాదసేవలను బాసటగాఁగొని యేగు చున్న నా
జీవన యాత్రయందున ప్రసిద్ధిని సిద్ధి నొసంగు మీశ్వరా ! **448**

ఇది శ్రీ హనుమత్ప్రబంధము ద్వితీయభాగము
సీతాదర్శనము, రావణునిదుర్భాషలు, దైత్యస్త్రీల దుష్ప్రవర్తన,
త్రిజట స్వప్నము, హనుమత్ సీతాసంభాషణము, చూడామణి అనుకథలుగల
తృతీయాశ్వాసము.

# శ్రీ హనుమత్ప్రబంధము

## ద్వితీయభాగము : చతుర్థాశ్వాసము

శ్రీ సీతాహృదయాంబుజ
భాసుర బాలార్క కిరణ, భక్తత్రాణా!
త్రాసిత దుష్టాసురగణ,
దాసజనభయార్తి హరణ, దశరథరామా!

హనుమంతుని వాలమ్మున
కనలము ముట్టించి త్రిప్ప నసురేశు భటుల్,
హనుమయు లంకను గాల్చి
కనదురువిజయముఁబడసిన కథ యిది రామా!

దేవా, అవధరింపుము,

### ఆంజనేయుని బలవిజృంభణము

భూమిజ యిచ్చినట్టి మణిభూషను భద్రమొనర్చి, చిత్తమం
దామెను జూచినా ననెడి హర్షమునన్ పులకీకృతాంగ్రచే
తో మహనీయ విక్రమ కుతూహల తాండవమాడె, నాయశో
కామల కాననాధ్వములయందున మారుతి చెట్టు చెట్టునన్.

చెట్టులనున్న పండు లిరు చేతులఁద్రెంచి భుజించి, పాదసం
ఘట్టన పాటిత ప్రబల కానన వృక్ష విదీర్ణ శాఖలన్
గుట్టలు పేర్చి, నల్దెసలకున్ బడి ప్రాకిన పూల తీవలన్
కట్టలు గట్టి పీకి, కడు గర్వము నన్ నిలుచున్న మారుతిన్.

దండులుగా నశోకవని ధాపున కాపరులైన దైత్యులా
గండర గండడౌ కపినిఁగన్గొని కత్తులతోనెదుర్చ నా
తండును మేను పెంచుచు నదాటుగ 'హు' మ్మని యార్చి నంతనే
గుండెలు జారి వారు పరుగుల్ గొని రావణుఁజూచి మ్రొక్కుచున్-453

దానవనాథ! మీ చరణ దాసుల విన్నప మాలకింపు డీ,
వానరుఁడెవ్వడో యెంయిల వచ్చెనొగాని అశోకసుందరో
ద్యానము పాడొనర్చి మముఁదాకెను పైబడి, వానిధాటికిన్
ప్రాణముఁ బిగ్గఁబట్టుచు దొరా! యిటు వచ్చితి మయ్య భీతితో.

త్రుంచని తీవలేదు, పడఁద్రోయని చెట్టును లేదు, నుగ్గుగా
వించని కేళికావిమల వేదికలేదును, కన్నుఁగప్పియా
వంచకుఁడెట్లు లంకకును వచ్చెనొ మేమిక పోవఁజాల మా
పంచకు, పోయినన్ తనువు ప్రాణము లుండవు నేడు మాకికన్.

ఆపలుకుల్ వినీవినని యట్లు సురావశుఁడై దశాస్యుఁడే
హో పరిహాస రీతిగ నొహో! ఒక కోతికి నీగతి భీతిఁజెందియా!
మీపని మాని వచ్చిరిటు మీరలు కోతిని బట్టి వేగమా
కూపము నందుఁ ద్రోయుఁడని కోపమునన్ గనె వారినెల్లరన్.

చేయున దేమిలేక మతి చేద్పడి వారును కొంత తోడుతో
నాయెడ కేగినంత నెదురై కపి వర్యుడు పెద్దమ్రాకులన్
మోయుచుఁదెచ్చి వారిపయిమోదును పైఁబడి నంత ప్రాణముల్
పోయెను వారికచ్చటనె; పోవని వారును పర్వు లెత్తిరిన్.

వానరు రాకయున్ త్రిజట స్వప్నమునుం దలపోసి లంకలో
దానవలోకమంతయును దల్లడిలెన్, కపిగాదు దేవసం
ధానిత శక్తియేదొ యయి తానరు దెంచె నికన్ మఱేవిప
త్తీనగరమ్ము నెల్లఁదహియించునొ యన్న భయాకులమ్మునన్-

ఆలరి కోతిగాడొకఁడు హంతకుఁడై విహరించి లంకగ
గ్గోలొనరించె నన్న పలుకుల్ విని నెత్తురు నెత్తి కెక్కి క్రో
ధాలసుడైన దైత్యవిభుఁడంపెను కాకలు దీరి నట్టి యో
ధాళినిబిల్చి వాని దునుమాడక రావల దన్న యాజ్ఞతో. 459

అనుకొని నట్టి పైన దితులంతయు, దానవసైన్య వాహినుల్
మునుకొని వచ్చుచుండె మొగమోటమి నాకికనేల నంచు నా
హనుమయు దీర్ఘతాల భయదాకృతిఁదాలిచి, సింహనాద మొం
డొనరిచె దిగ్వి పాటన సముత్కట పాటవ కంఠ నిస్వనిన్-

దిక్కులు పిక్కటిల్లె, జలధిజ్వలనంబుబికెన్; మహారవం
బెక్కడి నుండి వచ్చె నెవ రింతటి దుర్దమ శక్తిమంతుడం
చక్కడనే మహోగ్రకపి నాహనుమన్ గని రాత్మ ధైర్యముల్
దక్కిన బిక్కమోములను దైత్యకులాధిపు సైనికాగ్రణుల్.

జయమౌగావుత రామ లక్ష్మణులకున్, క్ష్మాపుత్రికెల్లన్ శుభో
దయమౌగావుత, రామదూతనయి సీతం జూడగా వచ్చితిన్
వియదధ్వమ్మున వార్ధి దాటి హనుమ న్వీరాగ్రణిన్, రావణుం
డయినన్ జాలడు నాకటంచు నఱచెన్ హన్మంతుఁ డుగ్రాకృతిన్.

కపి యితఁడేమిసేయు మన కాపరులన్ భయపట్టె నంతె యా
చపలుని పట్టు కొందమని సైనికులున్ వడి వచ్చి పైఁబడన్
కపివరుఁ డాయశోక వనికాముఖతోరణమున్ పెకల్చి వా
రిపయికి వీకమీఱ విసరెన్ నలుదిక్కులు బట్టి పర్వగా.

వనితలు వచ్చి చెప్పి రొక వానరుఁ డుర్విజ ఁజూచి వెళ్ళుటల్,
వనచరుఁడాయశోకవని పాడొనరించిన వార్తఁదెచ్చిరా
వనపరిపాలకుల్, కపినిఁబట్టఁగఁ బంపిన సైన్య నాయకుల్
వెనుకకు వచ్చినట్లు కనుపింపక రావణుఁడుండె యోచనన్.

తలఁకు వహించి రావణుఁడెదన్ దిగులొందుటయున్ గ్రహించి, యో
విలసిత దైత్య రాజ్యపదవీవిభవ ప్రభువర్య నీకిటుల్
గలఁత లివేల మేమిచటఁగల్గగ, కోతినిఁబట్టి లిప్తలో
నిలుతును నీదుముందనుచు నేగె జవంబున జంబుమాలియున్. 465

ప్లవఁగు వధించి వత్తునని పల్కిన ధీరుఁడు జంబుమాలియున్
బవరమునుండి వెన్కకును వచ్చిన జాడయుఁగానరాక దా
నవవిభుఁడంపె యోధుల ననంతబలాఢ్యు లమాత్యపుత్రులన్
వివిధమహాయుధమ్ములును వీరవరేణ్యుల సాయమిచ్చుచున్.

ఒకరికి వెన్క నొక్క రిటులుద్ధతులై రణ భీకరారవ
ప్రకటిత కోపవేగ పటు పాటవులీయసు రాళి మీదమీ
దకుఁజనుదేరుటల్ గని క్రుధాపరిణద్ధ విలోకనానల
ప్రకరము లేర్చుచున్ నిలిచె పావని, పావకశైల మట్లుగన్-

పోరిరి వారు దర్ప పరిపూరిత దారుణయుద్ధమాయలన్,
పోరెను రామమంత్ర పరిపుష్ట బలాన్విత ధీయుతుండు సా
మీరి యితం డొకండెయయి ; మిన్నులు ముట్టిన వా సమీకకా
ర్యారభమాణ దుర్దమరుషాయుత గర్జన లందునిందునన్-

కుటిల దానవసైన్య పటలమ్ముపైగాని
అరుగంగ నీదు కోపాగ్నిదృష్టి!
ఎదిరించి పోరాడు మద వైరిపై గాని
వాలగానీ దుగ్ర వాలనిహతి;
రామనామాక్షర రమ్యమంత్రమెగాని
చేరనీడన్యమ్ముజిహ్వపైని
జానకీ శ్రీపాద జలజాతములఁగాని
నిలుపడు ధ్యానమ్ము నిముసమేని,
తనయమోఘ మహాబల ధైర్యములకు
జనకజారఘూత్తముల దీవనల బలము
తోడుగానయి హనుమదుద్ధురమహోగ్ర
శక్తి చెండాడె దశకంఠు సైన్యములను- 470

ప్రాకటక్ష్వేళో గ్ర పటుతరార్భటులకు
దితిజసేనలు దశదిశల (జెదర,
నిష్ఠుర నాసికా నిశ్వాస రయమున
రథపంక్తి దూర దూరములు తొలఁగ,
దీర్ఘ బాహు ద్వయీ తీవ్రఘాతమ్ముల
సచివపుత్రులు ధరాస్థలినిఁగూల
కఠి నాంఘ్రి శితనఖక్రకచ ఘట్టన హతి
సైన్యాధిపతుల శీర్షములు తునుఁగ,

అసురసేనల చూపుల కందనట్టి
వీర విక్రమ వేగ దుర్వారపటిమ
మెఱుము లురుములు నగుచు సామీరి తిరిగె,
భయద యమదంష్ట్రి కోగ్రప్రభావ మడర.

శివదివ్యాంశయొ, రామనామ జప సంసిద్ధి ప్రభావాప్తియో,
పవమానాత్మజు శౌర్యపాటవ దవజ్వాలావలీఢంబులై
యవనింగూలెను దైత్య సైన్యములు, లంకాధీశు శీర్షమ్ముపై
పవిఘాతమ్ముగఁదోచె మారుతి సమిత్ప్రజ్ఞాపరిష్కారముల్.

వచ్చెను జంబుమాలియును, వచ్చిరి దానవసైన్యనాయకుల్,
వచ్చి రమాత్యపుత్రులును, వచ్చిన వారలు వచ్చినట్లుగా
చిచ్చుఱమంట యాప్లవగశేఖరు చేతులఁజిక్కి చచ్చిరా
చచ్చిన వార్తలన్ విని నిశాటకులేశుడు భీత చిత్తుడై.-

అంతలు సేసె రాముడిటకంపిన కోతియొకండు, రాముఁడే
వంతెనయో రచించి, కపివాహిని తో జల రాశి దాటి తా
నెంతలు సేయునో యిటుపయిన్ మనలంకను జేరి యున్నవి
భ్రాంతిని మున్గి, చంపెద ధరాసుత నంచుఁగృపాణముం గొనెన్. 475

అవనిజ కిచ్చినట్టి గడు వడ్డుగ వచ్చెను గాని యా క్రుధా
వివశుఁడు రావణుండు పృథివీజను ముక్కలు సేసి సర్వది
గ్వివరము లందునన్ విసరి వేసెడు వాడె క్షణమ్ములోన నా
ప్లవఁగవరుండొనర్చిన విపత్పరిణామ పరాభవమ్మునన్.

అక్షయకుమారవధ

అలుపములైన యత్నముల యందిక లాభము లేక వేగమే
యలఘుతరోగ్ర విక్రమ సమన్వితుఁడౌ సుతు నక్షయాఖ్యునిన్
బిలిచి బలప్రసిద్ధులగు వీరుల తోడుగ నిచ్చి పంపె న
బ్బలితపు వానరుం గదిసి పట్టి వధింపగ నెట్టులైననున్.

ఉత్సావా : సాహసమ్ము బలము పెంపె సంగ నక్షయుండు ను
త్సాహభరిత చిత్తుఁడగుచు దారుణాయుధాళితో
వాహినీ ప్రవాహ మసురవాహినీసమేతుడై
ఆహవమ్ముసేయ నరిగె హనుమపై రథస్థుడై-

రూక్షాలోకన ధైర్యసాహససమగ్రుం డాగ్ర హోదగ్రయు
ద్దక్షోణీ నిన దార్భటుల్ సెలఁగ, యోధశ్రేణులున్ వెంటరా,
నక్షీణోద్ధతి భిండివాల శితకుంతప్రాస బాణాలితో
రక్షో నాయకు డక్షయుండు చనె దర్పాటోప దీప్తాస్యుడై-

శైలప్రాంశు శరీరు ఁడూర్జిత భుజాస్కంధుండు, సౌవర్ణవ
ర్ణాలంకారిత దేహవర్ణుఁడు, మహోగ్ర త్రాణుఁడాజానుబా
హాలంబుండు, మహాబలోల్లసిత సర్వాంగ ప్రభుండైన లాం
గూలిం జూచుచు నక్షయుం డతులిత క్రోధారు ణాక్షుండు నై.

ఔరా! అక్షయుఁడేగు దెంచిన భయ మ్మావంతయున్ లేకయే
పోరాడన్ గమకించు కోతికిక చావున్ జూపు దంచున్ మహో
గ్రారావమ్మున రోషసంభరిత శౌర్యాకారుఁడై సైన్యమున్
బ్రేరేపించుచు లేచె నక్షయుడు గర్వీభూత చేతస్కుడై. 481

నాదర్పోద్ధతి కోహటించి చని యిందన్కన్, త్రపన్ వీడి నా
మీదన్ దూకుదు రీనిశాటు లిపుడున్ మేలే, యటంచున్ మహా
క్రోధోద్భూత పరాక్రమక్రమ నటత్ భ్రూరేఖి కాభీల రా
ద్రోదీర్ఘుండయి లేచె మారుతియు యుద్ధోద్యోగ ధైర్యాఢ్యుడై.

రథోద్ధత: వానరప్రవరుపై మహోగ్రుడై
దాన వాగ్రణియు దాడి సేయగన్,
పూని శైలములు పోరి నట్లుగా,
కాను పించె రణ కంపి తోర్వియున్.

కరికరిని, గిరిని గిరియున్,
సరిసరి యయి జరిపి నట్టి సమరాభముగా,
కరువలి సుతుతో నసురే
శ్వరుసుతుడొనరిచె బవరము పటుతర శక్తిన్

నొప్పింపన్ హనుమంతు నాహవమునన్ దూటాడి వేటాడుచున్
నిప్పుల్ గ్రక్కెడి శక్తిమ ద్విశిఖ పంక్తిన్ నిర్విరామంబుగా
గుప్పించెన్ దను జేంద్రు పుత్రుడవి తాకున్ తాకవన్నట్లు నే
ర్పొప్పన్ దప్పుకొనెన్ మరుత్సుతుడు ధైర్యోపాయ ధీయుక్తుడై.

కుపితుల్ దానవ సైనికుల్ సకల దిగ్వ్యూహమ్ము సంధించి, యా
కపినిన్ బట్టుట కేగగా హనుమ దీర్ఘాభీల వాలోద్భవా
తప విక్షేప మహాప్రభంజనములన్ ధట్టించి రెట్టింప, త
ద్విపరీత ప్రతిఘాత కాయసురులున్ భీతిల్లి పర్వెత్తగా-

సేన పాఱిపోయె, బాణముల్వమ్మయ్యె,
పొట్టికోతి యెంత గట్టివాడొ !
ద్వంద్వయుద్ధమునకు దానె పోవలెనని
తలచె దైత్యరాజ తనయుడడరి. 487

ప్లవగోత్తంసునిపైకి బహుబలదర్ప ప్రజ్ఞ చూపన్ నిశా
టవరుండున్ గదఁబూన, తాలతరు వ్రూడన్ బీకి చేఁబట్టి యా
ప్లవగుం డుగ్రత లేచి మోదఁదొడగెన్ బ్రత్యర్థినిన్; దిక్తట
మ్మవిసెన్, తాలగదాయుధమ్ములకు మధ్యన్ ఘోర సంగ్రామమై.

విదితాభీల పరాక్రమ ప్రతిభు లా వీరాగ్రణుల్ పోరగా,
గదయున్ తాలము లొండొకంటిపయి వీకన్ దాకి నుగ్గయ్యె, న
య్యదనున్ గన్గొని దైత్యుఁడున్ గదిసి బాహాబాహి యుద్ధమ్మునన్
దుదముట్టింపగ నాకపిప్రవరుపై దూకెన్, మదేభమ్మటుల్.

గ్రక్కదలన్ రణస్థలము, కండల నెత్తురు లూరు తెంపు తో,
నెక్కటిపోరి, నాయిరువు రేచి పెనంగుచు నున్నవేళ పే
రుక్కున హన్మయున్ ప్రబలి ఒక్క యదాటున దైత్యుకంఠమున్
గ్రక్కునఁ నొక్కిపట్టి యొడికారమునన్ బడవైచి త్రొక్కినన్.

అచలనిభమైన దైత్యు దేహమ్మునుండి
నెత్రు టేరు లుప్పొంగి ధరిత్రినిండె,
శైల సానువు లందుండి నేల పయికి
జారి పడు శోణవర్ణ నిర్ఝరములట్లు.

కపి బలమ్మున సర్వాంగకములు చీలి
అక్షయుఁడు ముక్కముక్కలై యవనిఁ బడుట
చూచియును, చూడలేని, సంక్షుబ్ధమతులు
అసురసేనలొనర్చె హాహారవమ్ము.

విజయశ్రీ హసితాననుం డగుచు దిగ్వీథుల్ చలింపగ, వా
యుజు ఁడుంజేసిన సింహనాదములు రాజోదాత్త శుద్ధాంత స
ర్వజన మ్ముల్కిపడన్, శ్రవశ్లథములై వ్యాపించె, లంకాపురీ
ధ్వజమే కూలినయట్లు తోచినది దైత్యస్వామి స్వాంతమ్మునన్. 493

అక్షయ ధైర్యదోర్బల సమన్వితుఁడూర్జిత శౌర్యసాహసా
ధ్యక్షుడు వైరినిర్మథన దక్షుఁడు దివ్యవరప్రభావితుం
డక్షయుఁ డంతమొందె కపి హస్తములం దను వార్త వించు, నా
రాక్షస నాథుఁ డేడ్చె, రణరంగము నన్ పశువేడ్చు చాడ్పునన్

పితరు నోదార్ప వచ్చిన పెద్ద కొడుకు
నింద్ర జిత్తును గని దనుజేంద్రుఁ డెడద
పొంగి వచ్చు దుఃఖమ్ము నాపుకొని కొంత,
నుడివె నిట్టులఁగన్నీరు తుడుచుకొనుచు.

తనయాచూచితె, లంకకెట్టుల మహోత్పాతమ్ము వాటిల్లెనో
హనుమంతుం డట, రామ దూతయట, యెట్లా వానరుం డబ్ధిదా
టెనొ లంకం జొఱఁబాఱి తాఁదునుము చుండెన్ దెత్యులం బట్టి నీ
యనుజుం డక్షుడుగూడె కూలె నట, కట్టా! వాని దర్పోద్ధతిన్.

మును సుగ్రీవుని, వాలినిన్ గపికుల ప్రోద్దాములన్ జూచితిన్
గనరా డింతటి వాడు; ఎట్లచటి కేగం గల్గెనో సీతనుం
గని యేమే మొ వచించి వచ్చెనట, వేగ మ్మింక నీవేగి వా
నిని బంధించుచుఁదెమ్ము కొల్వుకడకున్ నేనేగగా నేటికిన్.

జనకుం డన్నది విన్నయంతనె యుదంచ ద్యుద్ధ సంరంభ సం
జని తాలాప వికంపి తాఖిల దిశా సంశ్రేణియై రత్న కాం
చన శోభాంకిత కింకిణీ ధ్వని విలాసాంచ ద్ర థంబెక్కి రా
వణు పుత్రుండు మహోర్భటిం జనె కపిన్‌బంధించి తోడ్తేరగన్.

దను జౌద్ధత్యముఁజూచి మారుతియు నుద్యత్క్రోధ దర్పమ్ముతో
దనువున్ బెంచుచు సర్వ దిగ్బిదము నాదమ్మొందు గావించుటన్
గని చాపమ్ము ధరించి యింద్రజి మహోగ్ర ప్రౌఢ దుర్దాంత బా
ణనికాయోత్థిత వహ్నులా హనుమపై నాటించె శుంభద్గతిన్. 499

దనుజు నిశాత బాణ రయ ధాటికి మించిన వేగ మూర్తియై,
దనుజుని బాణ సంజనిత దావము మించిన తేజమై, మరు
త్తనయుడు నింగిపైకెగసి తప్పుకొనెన్; గపి యెచ్చ టున్నదిన్
గనుగొనలేక నింద్రజియు గాసిలె నాశుగ పంక్తి వ్యర్థమై.

హనుమంతున్జెఱబట్ట, మంత్రములు మాయల్ వజ్రతుల్యమ్ములౌ
ఘనశస్త్రాస్త్ర వితానముల్ పనికి రాకన్ దైత్యుఁడుద్విగ్నుఁడై
మన సొక్కింతగ బిగ్గ బట్టుకొని బ్రహ్మాస్త్రంబు నేయంగ తత్
ఘనపాశమ్మునఁ జిక్కి మారుతి తనంతన్ దాను పృథ్వింబడెన్.

ఇది బ్రహ్మాస్త్ర మహామహ మ్మఖిల లోకేడ్యమ్ము, నా జీవన
ప్రదభాగ్యమ్మగు గాత మంచు, గపియున్ బంతమ్ముతో దీనినే
నెదిరింపం దగదంచు లొంగినటులన్ నేలంబడన్ సమ్ముదా
స్పదనృత్యోన్మద నాదముల్ జలిపి రుత్సాహమ్మునన్ దానవుల్.

రావణునికొల్వు

చీరుడు ముక్కముక్కలుగ చీల్చుడు చంపుడటంచు చుట్టునుం
జేరి నిశాట సేన కపి శేఖరు పైబడి కాలు సేతులన్
నారల గట్టి బంధితు నొనర్చి దశాస్యుని కొల్వులోనికిన్
దారుల వెంట నీడ్చి త్వరితమ్ముగ దెచ్చిరి తిట్టి కొట్టుచున్.

దశశిర :కోటీర ధగధగాయిత రత్న
కాంతి రంజిత సభాగారమలర,
చందనాంచిత దేహ సౌందర్యమును హేమ
మణి భూషణాంశుక మ్మినుమ డింప,
భుజకీర్తి భూషణ స్ఫురిత బాహు ద్వంద్వ
మురుఫణాధర రూపములు వహింప,
త్రైలోక్యపాలనో ద్యన్మహాశేము షీ
సంభవ ప్రభుత లా స్యముల వెలుఁగ, 504

జపతపఃఫల బ్రహ్మతేజః ప్రపూర్ణ
మహిత గాంభీర్య సార సమ్మాన్యమూర్తి,
స్ఫటిక మణిగణ విరచి తాస్తరణకాంతి
భాసురోజ్జ్వల కనక సింహాసనమున-

శ్రీ విభవ కామినీజనసేవితుండు,
త్రిజగతీ పాలనార్హసుధీబలుండు,
సచివ సామంతపరివృత సార్వభౌముఁ
డయిన రావణుంగనె పవనాత్మజుండు.

ఈ దైత్యుం డతిలోకవైభవ కళాపృక్తుండగున్, బ్రహ్మతే
జోదీవ్యత్ ద్యుతిరేఖ వీనిముఖముల్ జూడంగఁ గాన్పించు, సీ
తాదేవిన్ జెఱగొన్న దుర్నయ చరిత్ర మ్మొండు లేకున్నచో
యాదేవేంద్ర సముండె యంచుఁ దలఁచెన్ హన్మంతుఁడుల్లమ్మునన్.

అసుర పతిరాజ వైభవం బరసి హనుమ
యెంత అద్భుతం పడెనొ, దైత్యేంద్రుఁడంత
కంటె నచ్చెరు వందె నాకపినిఁజూచి,
ఒక రొకరి నిట్లు వీక్షించు చున్నయపుడు.

ఎదుటన్ హన్మని జూచినంతన క్రుధావిక్షైక రక్తాస్యుఁడై
యిదియున్ వానరమ్మైన మద్భటుల నిట్లేలా వధింపంగలం
డిదియేదో పటు శక్తి, కాని యెడ, నందీశుండొ బాణుండొ యి
య్యది కావచ్చు నటన్న సందియము దైత్యాధీశుఁడొందెన్ మదిన్.

నీవెవ్వాడవు కోతివా? మఱియొకం డేయింద్రుఁడో పంపగా
నీవేతెంచితొ యంచమాత్యులును బ్రశ్నింపంగ లంకేశు ది
క్కై- వాక్రుచ్చెను వాయుజుండు; దితిజేంద్రా! వానరేశుండు సు
గ్రీవుండంపగ రామదూతనయి ధాత్రీజన్ గనన్ వచ్చితిన్. 510

నేనెవ్వండను గాదు వానరుడ, తన్వీరత్న మా జానకిన్
గానంగల్గితి, వాయుసూనుడను హన్మంతుండు నాపేరు, నీ
సేనానీకము నన్నెదుర్కొనుచు నాచేజచ్చిరిన్, శౌర్యపా
రీణుండన్ నను నెట్టియాయుధము పోరిన్ గూల్చగాఁజాలదున్.

నిను వీక్షింపఁదలంచి ఇంద్రజికి నేనే లొంగిపోతిన్, మహీ
జను బల్మిం జెఱగొన్న నీపని దశాస్యా! యెంతనీచమ్మొ నీ
మన మం దెంచితొ లేదొ, నీదయిన సేమమ్మెంచి, సుగ్రీవుఁడం
పిన సందేశము నీసభాముఖమునన్ విన్పింతు నాలింపుమా.

దానవ నాథ! రామవిభు తన్వినిఁ దెచ్చితివీవు, యుద్ధవి
ద్యానిటలాక్షుఁడారఘుకులాధి పుఁడాతని కామెనిచ్చి, నీ
ప్రాణము నిల్పు కొమ్మనుచు వానరరాజు వచించె, రావణా!
నేనను మాటలున్ వినుము నీహిత మెంచి వచింతు నిచ్చటన్.

సకలారాతి విదారణోద్ధత పటిష్ఠస్వామి రామప్రభుం
డొక బాణమ్మున వాలినిం దునిమె, వీరోత్తంసు డాతండు తా
నిక కోదండము నెత్తెనేని భువనానీకమ్ములున్ నిల్వవీ
వొకలెక్కా, సకలమ్ము ధ్వంసమగునం చూహించు కొమ్మీమదిన్.

ఆనాడీ వొనరించి నట్టి పని కామాంధ్యప్రవృత్త్యైక కా
ర్యానీతమ్ము మహీసుతాపహరణమ్మా కాదు, లంకాపుర
శ్రీ నాశమ్మగు కాలపాశము భవద్గ్రీవమ్మునంజుట్టె నా
వో నక్తంచరనాథ! నీ వెఱుఁగవేమో నీదు దుష్కృత్యమున్.

నేనొకరుండ గాదు! గణనీయులు వానరులేగుదెంచి లం
కానగరమ్ము నల్గడల గాల్చెదు నాడు, రఘుప్రవీరుడ
స్త్రానల రాశులన్ గురియు నప్పుడు నీపలు కాలకింపరో
దానవ నాథయెవ్వరును, తప్పదు పాపఫలంబు నీకికన్. **516**

పరమ దయాసుధాబ్ధిరఘువంశ్యుడు రాముఁడు, నీవువేగ మే
ధరణిజనిచ్చి యాతనిపదమ్ముల వ్రాలి నిశాచరేంద్ర! నీ
నిరుపమ దైత్యరాజ్యమహనీయ సుఖమ్ములు నీదు ప్రాణమా
వెరవున నిల్పు కొమ్మని కపిప్రవరుండు వచించి నంతనే.

ఔరా! యీకపి మాట వింటివె ప్రహస్తా! నన్ను శాసించుచున్
గారుల్ ప్రేలెడి వీనిఁ బట్టు కొని ముక్కల్ ముక్కలుంగా మహా
వారాశిం బడవేయుడంచును క్రుధావహ్ని చ్ఛటా జ్వాలికా
క్రూరాస్యుం డయి దైత్యనాథుఁడఅచెన్ కొల్వెల్ల మార్మ్రోగగా.

వచ్చిరికింకరుల్ ప్లవగ వర్యునిఁగత్తులు దూసి చంప, నా
వచ్చుట లాపుచున్ దనుజ వల్లభు ముందునకేగి చెప్పగాఁ
జొచ్చె వినమ్రుఁడౌచు ననుజుండు విభీషణుఁడో త్రిలోకసం
పచ్ఛయ నాథ! దూతయయి వచ్చిన వానినిఁజంపుటేలయా!

ప్రీతిగ స్వామి యాజ్ఞ నెఱవేర్పగ వచ్చెడు అస్వతంత్రుఁడౌ
దూత అవధ్యు డంచు విబుధుల్ వచియించిరి దానవేంద్ర! యీ
నీతి విధమ్ము నీవెఱుఁగ నేర్పని వాడవు గా దొకింత నా
చేతము జెప్పి నాడ నెది చేయుటకున్ దగు దీవె సోదరా!

ఆతని చేష్ట లాతఁ డని నట్టివియున్ సహియింప రానిచో,
ఏతగినట్టి శిక్షయె విధింపుడు చాలును, మీ పరాక్రమ
ఖ్యాతినిఁజూపగా నరుగు డారఘురాముని పైకి గాని, యీ
దూతను బట్టి చంపు నొక దోషము మీరు వహించు టేలనన్. 521

తమ్మని మాట లాత్మ కహితమ్ములై యయ్యును రావణుండు చి
త్తమ్మున గొంత మెత్తబడి దైత్య భటావళి వైపుఁజూచి వా
లమ్మునఁ జిచ్చు పెట్టి యవలన్ పురవీథుల నీడ్చి(ద్రిప్పుడీ
కొమ్మ మెకమ్ము నం చనగ కోతిని గట్టిగఁబట్టి యా భటుల్.

తోకకు గుడ్డ పీలికల దొంతరలన్ బిగఁజుట్టి తైలపుం
బాకములందు ముంచి పెను మంట రగుల్చుచునున్న గూడ ని
ర్వ్యాకులుడా మరుత్సుతుఁడు వాలమునందున లేమ సంజ్వల
ద్భీకరవహ్నులందుఁగను పించె వియత్పథమధ్య భానుఁడై.

వీరలు చిచ్చు పెట్టి నను వీథుల నీడ్తురు గాక లంకయం
దారయవచ్చు దారులరహస్యము లంచు మదిందలంచి సా
మీరియు మిన్నకున్నదియె మేలని యెంచి నిశాటు లాకపిన్
కారులు తిట్టి కొట్టి గుదిగట్టుకుఁగట్టుచు ద్రిప్పి రెల్లెడన్.

హనుమను తోక గాల్చి పురమందునఁ ద్రిప్పుచునున్న వార్తలన్
వినిన మహీజ శోకభరవిహ్వలయై తన మేలు గోరివ
చ్చిన కపి కీ వెతల్ విధి రచించెనె యంచతిదీనయై మన
మ్మున ననలుందలంచి కొని మ్రొక్కులు దీర్చెను ధ్యానమగ్నయై.

ఓనిరతప్రకాశ కిరణోదయ భాసురమూర్తి, వీతిహో
త్రా! నెనరుంచి నాపయి రవంతగ విన్నప మాలకింపుమా;
ఏను నిరంతరమ్ము పతియే పరమాత్మగ నెంతు నేనియున్,
భానుకులుండు నాకుశల వార్త నెఱింగెడు వాడె యేనియున్-

దానవ నాథు సైన్యరచిత జ్వల దగ్నుల బాధ లామరు
త్సూనునిఁ దాకకుండ దయఁజూడుము వేడుచునుంటి నంచు నా
జానకి విన్నవించు నిముసమ్మున వహ్నియు చల్లనయ్యె తీ
వ్రానల కీలతాప మనిలాత్మజు నంటగఁబోని రీతిగా. 527

ఉన్నది తొల్త రాముదయయున్, గిరియున్ జలరాశియర్మిలిన్
నన్ను ననుగ్రహించి రిక నావసుధాసుత సత్కృపాశిష
మ్మున్నది; నాదుతండ్రి పయి నుండిన సఖ్యతc జూచి కొంత నన్
మన్ననcజేసెనంచు పవనాత్మజుc డగ్నికి మ్రొక్కె భక్తిమై.

పెంచెన్ దేహము తాలసామ్యముగcగన్పింపన్, తనూబంధముల్
త్రెంచెన్, సర్వదిగంచలావృత నభస్తీరమ్ము మార్మ్రోగc గా
వించెన్ రావము, దైత్య పట్టణముపై విప్పారు ఆగ్నేయశ
స్త్రాంచద్రీతి నొనర్చె మారుతియు తానై స్వైర సంచారమున్.

తైలవర్ధిత దీర్ఘ వాలాగ్ర వహ్నికా
జ్వాల లట్లే రేగి ప్రబలుచుండ,
ఆగ్రహావేశ ధుర్యన్మహోన్నతరూప
మగ్నిచ్ఛటాగోళ మట్లువెలుcగ,
వాలాగ్ని నిర్గతాభీల ధూమౌఘమ్ము
విద్యుదన్విత మేఘ వృత్తిc దనర,
వహ్నిదీపిత వహావాలదైర్ఘ్యమ్ము మ్రొక్క
ధూమకేతువుగ దైత్యులకుcదోప.

అబ్ధి లంఘించు నాటి సాహసము కన్న
వందరెట్లైన బలపాటవమ్ము మెఱయ,
చటుల దుర్వార విపుల తేజస్వియగుచు
పావనియు పైకెగసి లంకపై వెలింగె.

వాలమునుండి రాలిన రవల్ రగిలించిన నిప్పుమంటలం
గాలcదొడంగె లంకయును, కన్నులు గప్పుచు నెట్టు లీ మహా
జ్వాలలు లేచెనో తెలియcజాలని దైత్యపురీ నివాసు లా
కీలల మధ్యcజిక్కుకొని క్రేళ్ళురుకుల్ బడి రన్ని దిక్కులన్. 532

ఆయతచండవేగ చటులాగ్నిగ మారుతి సంచరింపగా
వాయువు సాయమై దెసలఁబ్రాకిన పహ్నిశిఖాచయమ్ము దై
తేయపురీ విశాలపరిథిం బడి యేగును గాని యాకడన్
డాయవు ; సీతయుండిన వనమ్ము, విభీషణుఁడున్న గేహమున్.

హేలన్ వహ్నిరగుల్ప మారుతియు నెట్లేతెంచి యెట్లేగునో
యాలోకించిన వారె లే, రతుల దావాభీల వాలానల
జ్వాలాదగ్ధము లంకసర్వము మహాసంక్షుబ్ధమై పోయె నే
యాలంబమ్మును లేక ఆలనయు లే కాక్రంద నోద్రిక్తమై.

రోదకము: ఈదెస నాదెస నెచ్చట గన్నన్
ఏదరి కింజననీయని లంకా
వీథుల నగ్నులు వెల్వడి రేగన్
రోదనలందసురుల్ బడి రార్తిన్.

ఆదశకంఠ దర్ప దళ నాకృతి మారుతి కల్పితమ్ములై
మీదకు మీదకు న్నెగసి మిన్నులకున్ జెలరేగు చున్న లం
కాదహనార్చులం గని మొగమ్ములు విచ్చియు నీవిపత్తు స్వ
ర్వీథుల నంటునేమొ యని భీతిలిరాత్మల వేల్పుగుంపులున్.

క్రిందికిఁ జూచి పావని యొకించుక నాలుగు మూలలందు నీ
సుందర పట్టణమ్మునకు చూడు రగిల్చితినంచు నెమ్మదిన్
గ్రందులు పోయిపోయి తటకాపడె నాయనలమ్ము మధ్య యే
కుందుల నందెనో పుడమికూతురు సీతయటన్న వేదనన్.

నేనై చేసిన యీ యకార్యమునకున్ బృథ్వీజయున్ నష్టమే
యైనన్ వేగమె రామలక్ష్మణు లసుత్యాగమ్ము గావింతు, రా
పైనన్ వానరనాథుడుం గపులు నిల్వంబోవ, రీవార్తకున్
ప్రాణాలన్ భరతాదులున్ విడువ ధర్మధ్వంస మే యౌనిటన్. 538

అని, యేహోనియు సీతకున్ గలుగ రాదంచున్ హనూమంతు డ
య్యనిలున్ వహ్నిని రాఘవున్ వినతుఁడై ప్రార్థించు చున్నంతలో
వినవచ్చెన్ వినువీథి నొక్కపలు కాపృథ్వీజ సేమం బటం
చును కర్ణద్వయికిన్ సుధామధువచస్ఫూర్తి ప్రకాశమ్ముగన్.

వారిధి తీరనీరముల వాయుజుడుం దన వాల వహ్ని జ
ల్లారిచి యేగి సీతచరణాబ్జములన్ బ్రణమిల్లి తల్లి! దే
వారులు నాదు వాలమున కగ్నిరగిల్చిరి, నీకృపామృతా
సారసువృష్టి నే బ్రతుకఁ జాలితి లంకయు దగ్ధమైనదిన్.

స్వామికి వేగ నిన్గనిన వార్తను జెప్పవలెన్, భవత్పదా
బ్జామల సీమలన్ మనెడు వాడను పంపు మటన్న పావనిన్
భూమిజ జూచి యోప్లవగ పుంగవ! తాళుము నేటికీ యెడన్
నామది కింత యూఅట గనంబడు నీకు లభించు శ్రాంతియున్.

నీకును దక్క నన్యులకు నీరధి దాటగ శక్యమౌనె, నీ
వీకడలిన్ తరించి వచియించితి వారఘురాముసేమ మో
యీ కపి వర్య! నాయెడద నింకను శంక నశింపఁ బోదు సు
శ్రీకుఁడు రాముఁడిచ్చటికి చేరవలెన్ గడు వేగు లోపలన్.

అని యాజానకి యన్న భావయుత వాక్యమ్మున్ సమాలోచనన్
విని, హన్మంతుడు తల్లి! నానుడుపులన్విశ్వాసముంచంగదే
దనుజున్ దున్మును, నిన్ను దోడ్కొని యయోధ్యన్ జేరు రాముండు, మి
మ్మును వీక్షింతుము మేము కోసలమహీభూజానిగా రాజ్ఞిగా.

వానర నాథుఁడున్ బ్లవగ వాహిని తో నరు దెంచు, రాముడున్
వానరు లెల్ల దాటుదురు వార్ధిని, భీకర సంగరమ్మునన్
దానవుఁడీల్గు రాము నిశితాస్త్రమునం దిది నీవె చూతు వో
జానకి ! తథ్యమీ పనులు సాగును మాసము దాట కుండగన్. 544

విని తత్ ప్రస్ఫుట వాక్య వైఖరులు పృథ్వీజాత యొక్కింత వి
చ్చిన యాస్యాంబుజ మెత్తి ప్రేమమయ దృష్టిన్ జూచినంతన్ మరు
త్తనయుం డంజలి వెట్టి సీతకభివాద మ్మిచ్చి శ్రీరామద
ర్శన కౌతూహలి యై పయోనిధి తటీ శైలమ్ము చేరెన్ వడిన్.

ఆరోహించుచు నాథరాధరము నొక్కంగన్ హనూమంతు డా
పారావారము పైకి దూకె చరణ ద్వంద్వమ్ము దట్టించి త
ద్భూరి ప్రాభవ పాధఘట్టన హతిన్ భూమీధరం బద్రువన్
వేరుల్ దన్కను ద్రెళ్ళి వృక్షలతు లుర్విన్ వ్రాలె నొక్కుమ్మడిన్.

భుజంగప్రయాతం:

వియద్వీధి నున్నట్టి వేల్పుల్ కడున్ వి
స్మయంబంది చూడన్ ప్రచండాహి వేగో
దయస్ఫార ధైర్యాతి దర్పాధి కుండై
రయం బొప్పగా వానర శ్రేష్ఠుఁడేగెన్.

భద్రకము:

వాతవీచి భయంబునన్
సీత యిచ్చిన రత్నమున్
బ్రాతిగా కడు భద్రమౌ
రీతి దాచెను హన్మయున్.

హనుమచ్చండ రయప్రకంపితము నై యంభోధర శ్రేణి తు
త్తినియల్ గా నలు ప్రక్కలన్ జెదరె, పాథోరాశి భంగమ్ములు
ర్విని మ్రింగంజనునట్లు లేచె, పవనోర్మీ వ్యాప్తమై భీషణ
ధ్వని యొక్కండది దిక్కులంజనె భయోత్పాతమ్ముఁ గల్గించుచున్.

ఆవలి తీరమందు కపు లాతురతన్ గను లెత్తి ఎప్పుడా
పావని వచ్చి, చల్లనగు వార్తను దెచ్చునటంచు దిక్కులం
ద్రోవలు జూచు చుండ, నొక దూరమునన్ గనవచ్చె దక్షిణా
శావలయమ్ము జీల్చి వరుసంబడివచ్చు ద్యుతి ప్రతానమున్. 550

వెను వెంటన్ బవనోర్మి కాంతరితమై విన్పింపగా ఘూరిని
స్వన మొక్కం డది యాంజనేయుడును గావచ్చున్న యాసన్ కపుల్
చని రొక్కొక్కరె యామహేంద్రగిరికిన్ సామీర్కై నింగిపై
గను చూపందిన మేరఁ జూచుచును జాగర్య ప్రతీక్షాత్ములై.

వచ్చెను వెన్కకుం దిరిగి వాయుతనూజుఁడు దైత్యులంకనుం
జొచ్చిన నాటి భూరిరయ శోభల మించి వెలుంగు సంతసం
బచ్చుపడంగ, రాఘవున కావసుధాత్మజ వార్తఁ దెల్పగా;
వచ్చి మహేంద్ర శైలమున వ్రాలె, కపుల్ గని చుట్టు ముట్టగన్.

''చూచితి సీత'' నం చనిలసూనుఁడు పల్కనొలేదొ గంతులన్
వైచుచు నేక కంఠమునబల్కిరి ''జే'' యనుచున్, కరమ్ములన్
సాచి కవుంగిలించిరి, బుజమ్ముల మోయుచు ద్రిప్పి స్వాగత
శ్రీ చిగురొత్త సన్నుతులఁజేసిరి హన్మకు వేడ్క మీఱగన్.

అమృతాసారము లక్షరాక్షరము ల ట్లాలించి రా వానర
ప్రముఖుల్, మారుతి వార్ధి దాటి దితిజావాసమ్ము నంజొచ్చి శో
కము రూపమ్మగు ధాత్రిజాతకు రఘు క్ష్మానాథు వార్తన్ సమ
స్తము విన్పించుచు లంకఁ గాల్చిన కథన్ సర్వమ్ము వాక్రువ్వగా.

దనుజుల మధ్య జానకి వెతల్, పవనాత్మజుఁజంప వాలమం
దనలము ఁబెట్టి యీడ్చిన దురాగతమున్ విని యెక్క పెట్టుగా
వనచరు లాగ్ర హోగ్ర బలవత్ పటు ధీరత నార్చి లేచి రా
దనుజులఁబట్టి తక్షణమె ధ్వంసమొనర్చు తలంపు పెంపునన్.

హనుమంతుంగని జాంబవంతు డనురాగానంద మేపార నా
యన! నీకీర్తి జగమ్మునన్ నిలుచు చంద్రార్కమ్ముగా నంచు మూ
ర్కొన శీర్షమ్మును, అంగదుండలరి మాకున్ నేడు నీవోమరు
త్తన యా! జీవనదాత వంచును పొగడ్తల్ సేసె హర్షంబునన్. 556

దాశరథిదయ, సీత వాత్సల్యగరిమ,
మీదు దీవనల్ నాకును ప్రోదిగాగ
చేయఁగల్గిన యంత నేచేసి నాడ
ననుచు నమ్రుఁడై వారి కాహనుమ మ్రొక్కె.

ఆలస్యంబిక గూడ దంచు కపులాహన్మంతు వెంటన్ మహో
హేలాకేళి వినోదమోదమద వైజృంభ ప్రదీప్తాత్ములై
వాలమ్మున్ పయికెత్తి త్రిప్పుచు కడున్ వైళంబ కిష్కింధలో
వ్రాలన్ పర్వులు దీసి రుత్కట రయ ప్రారంభ సంరంభులై.

పంతం బాడుచు దూర మెంచుచు కపి వ్రాతంబు కిష్కింధన
ల్లంతం గాంచుచు పట్ట రాని ముదమే పారంగ సుగ్రీవుఁడా
పొంతం బెంచిన రమ్యమౌ మధు వనంబుం జేరుచున్ దద్వనో
పాంతం బెల్లను క్రిందుమీదులుగ సేయన్ సాగి రౌత్సుక్యులై.

పొదలపెకల్చి, తీవలపువుల్ విరజిమ్మి, ఫలోర్వీజమ్ములన్
మొదలులు పట్టి కూల్చి, ఫలముల్ దినిత్రేనిచి, తేనెపట్టులన్
విదిలిచి తప్ప త్రావి, వనవీధుల వెంబడి గెంతుచున్ యదా
యదలు గఁ జేసి రావనము నంతయు వానరు లొక్కపెట్టునన్.

మధువులు ద్రావి త్రావి, కడు మత్తులు నై విహరించుచున్ వనం
బదవదఁ జేయు వానరుల నారసి యావనపాలుఁడల్కతో
దధిముఖుఁడన్న వా డెదిరి దర్పమునన్ బెదరింప వానిపై
నదలుచు కేరుచున్ తరిమి రావలకున్ కపులెల్ల రేకమై.

దధిముఖుఁడేగి చెప్ప కపితండ మొనర్చిన దుండగమ్ము లా
యధిపుఁడు వానరేంద్రుఁడది యంతయు సీతనుఁజూచి వచ్చి స
మ్ముదమున వానరుల్ సలుపు పోడిమి గా గ్రహియించి వెంటనే
దధిముఖు తోడు కొంచుఁ జనె దాశరథుల్ వసియించు చోటికిన్. 562

## హనుమంతుఁడు సీతవార్త రామునకు నివేదించుట

సీతనుఁజూచి వానరులు చేరువకుం జనుదెంచి నట్టి వా
చేతలు దోచు చుండె నదె శ్రీరాఘురామ! వనమ్మునన్ గపి
వ్రాతముసేయు నల్లరులు రాయిడులం గనుచుండ; ధారణీ
జాతను గూర్చి నీమది విచారము మానుమటన్న యంతలో.

వచ్చిన వానరేశ్వరుని పల్కులకున్ మొగముల్ ముదమ్మునన్
విచ్చిన రామలక్ష్మణులు వేచెడి ప్రస్రవణాద్రి మీదకున్
వచ్చి రయమ్ము నన్ దిగిరి భాసుర హర్షవికాస సమ్మదం
బచ్చులు వోయు రూపముల నాకపు లంగద హన్మదాదులున్.

''సీతను చూచితిన్ నియత జీవన,'' నాదితి జేశు వీట నా
మాత నటంచు వ్రాలె హనుమంతుఁడు రాముని పాద సుందరా
బ్జాతములందు, హర్షజనితామల బాష్పజలార్ద్ర లోచన
ప్రీతిగ స్వామి దర్శన ప్రహృష్ట సుఖానుభవ ప్రభావుఁడై.

వనచరులున్ రఘూత్తముని పాదములన్ బ్రణమిల్లి వారలా
వననిధిఁజేరు టా పిదప పావని వారిధి దాటి దానవే
శునిపుర మంతయున్ వెదకి చూచి యశోకవనమ్మునందు సీ
తనుగని వచ్చి చెప్పిన కథన్ వివరించిరి నమ్ర వాక్కులన్.

సీతయు లంకలో జీవించి యున్న
ప్రీతిఁగొల్పెడి వార్త విని రామ మూర్తి
ఆమె యెట్లున్నది, ఏమి చెప్పినది
ఆమాట వినిపింపు డనినంత హనుమ.

స్వామీ! నీ కరుణాశిషమ్మున మహావారాశిలంఘించు చో
నామార్గమ్మున నాగమాతయును మైనాకాద్రియున్ జూపి రెం
తోమర్యాదను,చెట్ట రక్కసిపడంతుల్ సింహికాలంఖిణుల్
తామై నన్నెదిరించి వచ్చి రొక ఘాతన్ నెత్తురుల్ గ్రక్కుచున్. 568

మణిమయ సౌధశోభితము మంజుల కాంచన దీప దీప్తమౌ
దనుజపురమ్ము జొచ్చి వసుధాసుతకై నలుమూలలన్ దశా
స్యుని నిలయమ్ము సైతమును జూచియు సీతను గానలేక లం
కను నలుప్రక్కలన్ మరలఁగానగ నేగిన దెల్ల వ్యర్థమై.

తుట్ట తుదకేను దైత్య నాథుని విహార
భాసు రోద్యానక మశోక వనము నందు
కావలిగ నున్న రాక్షసాంగనల మధ్య
దీనమూర్తి సీతను జూచినాను రామ!

మబ్బు గ్రమ్మిన చంద్ర బింబమ్ము పగిది
బెబ్బులులకు చిక్కిన లేడిపిల్ల వోలె,
దారుణాతప తప్త పద్మమ్ము పగిది,
దనుజ కాంతల కుటిల తర్జనల మధ్య

మాటి మాటికి రామ రామా! యటంచు
పతివియోగ విచార సంవ్యథిత చిత్త,
అశ్రుధారామలిన వదనాంబుజాత,
దీన మూర్తి సీతను జూచి నాను రామ!

హనుమ వచించుచుండ నిటు లా రఘురాముడు లక్ష్మణుండుక
న్గొనలను జారు నీటి చినుకుల్ తడియొత్తిరి సారె సారె కా
జనకజ దుస్థితిం దలఁచి; స్వాంతము నందు విచార బాధ నా
హనుమ యణంచుచున్ నుడివెనావలి సంగతి నిట్లు నమ్రుడై.

సామర్థ్య మ్మెనయంగ మూడు జగముల్ శాసించు మా దానవ
స్వామే నీకరమున్ గ్రహింపఁదగడా, సర్వావనీరాజ్య హే
లామర్యాదలు కాలదన్ను టది యేలా పిచ్చి దానా! యటం
చేమేమో దను జాంగనల్ పలికి రాపృథ్వీజనుం జూచుచున్. 574

ప్రబల దానవ రాజ్యవైభవ విలాస
రత్నకోటీర భూషణ రమ్య పత్ర
గంధ మాల్య విభాసు రాకారుఁడగుచు
రావణుడు వచ్చి వివిధ దుర్భాషలాడె..

అవనిజయున్ దశాస్యు మొగ మారయ కావలి వైపె జూచి శో
కవివశ యౌచు గడ్డి పరకన్ దనకడ్డుగఁబెట్టి యోయిదా
నవపతి! నీదురాగత మణంపగ రాముడు వచ్చు తన్మహో
స్త్రవిలయ వహ్నికీలలను చత్తువు నీవిక తథ్యమం చనన్.

సకల ప్రాజ్యసుఖోప భోగ విలసత్ సంపన్నిధుల్ నీదు కా
ళ్ళకడం బెట్టెద రామువీడి నను హేలన్ జేరుమీవేగ జా
నకి! నీకున్గడు వొక్కమాసమె యగున్ నన్ జేరుటో లేకని
న్నిక గత్తిన్ దెగగోయుటో యనుచు పంక్తిగ్రీవుడేగెన్ బ్రభూ!

రావణుఁడేగె దుర్ణయ దురాలపనంబులనాడి యాడి, యా
కావలి వారికిన్ నిదురగ్రమ్మిన దాస్యములందు; వేగ నే
నావసు ధాత్మజాత వినునట్టుల చెట్టుననుండి యే, సుహృ
ద్భావ మెసంగు బాసలను పల్కుదొడంగితి నల్ల నల్లనన్.

దేవేంద్రుండె సుహృద్వరుండయిన కీర్తిన్ లోకసమ్మాన్యమౌ
మీవంశోన్నతియున్, దశాననుడు బల్మిన్ సీతఁగొంపోవ మీ
రావన్యాధ్వము లందునన్ బ్లవగ రాజ్యమ్మున్ సమీపింప సు
గ్రీవుండున్ సఖుడైన సంగతులు వర్ణింపంగ, నా తల్లియున్-

తరువున నున్న నన్నుగని దానవుఁడే యితడొక్క డెవ్వడో
మరల ననున్ కనుల్మోఁగు మాయలమారి యటంచునెంచి ని
వ్వెఱఁబడి దుఃఖ మొందు పృథివీజను గాంచుచు చెట్టు క్రిందకే
నరిగి తదంఘ్రి పద్మముల కంజలి వెట్టి శిరమ్ము వాల్చుచున్. 580

ఆమెకు నమ్మకమ్మొదవ నంతయుఁజెప్పితి మిమ్ము గూర్చి మీ
రీమెయి నామెకై పరితపించుచు నుండుట; లబ్ధి దాటుచున్
దీమస మొప్ప మీర లరు దెంతురు రావణుఁబట్టి త్రుంతురం
చా మెకు గుర్తు మీరిడిన యంగుళిముద్ర నొసంగితిన్ ప్రభూ!

మాతకు దెల్పి తేను హనుమంతుడ, వాయుసుతుండ నిట్లు మీ
దూతగ వచ్చి నాడనని తోయధి దాటుచు నొక్కగంతు నం,
దాతత శక్తి సాహససమర్థత నెంతటి కార్యమైన నుం
జేతును కామ రూపి నని చిత్తమునన్ నను నమ్మ వేడితిన్.

కరకమలమ్ములన్ గొనుచు కన్నుల కద్దుచు నుంగరమ్ముదా
నురమున దాల్చి యశ్రుఝరు లుర్విజరాల్చుచు మీకు గుర్తుగా
శిరమున నున్న భూషణము శీఘ్రమె దీసి యొసంగె, రాఘవే
శ్వర ! గయి కొమ్ము దీని నని వాయుజుఁ డిచ్చె వినమ్ర శీర్షుడై.

అమరేంద్రుం డిడి నట్టిదిన్, దివిజ పూజ్యమ్మిద్దియున్, మావివా
హమువేళన్ దనతండ్రి కాన్క యగు సమ్యగ్భూష ధాత్రీజ శీ
ర్షమునందున్ వెలుగొందు నన్న తలఁపుల్ జన్మింపనద్దానివ
క్షము నందద్దుచు రాముడేడ్వఁగని యూశ్వాసించె సౌమిత్రియున్.

ఈ నవరత్న భూష నిడి, పృథ్విజయున్ నుడివెన్ ప్రభూ! అభి
జ్ఞానము గాగ కాకియు కుచమ్మును జీల్ప తృణమ్మె యమ్ముగా
వానిని శిక్ష సేయుటయు, ఫాలమునన్ దిలకమ్ము వోవగా
దానిని దిద్ది నావట మురమ్మలరంగ శిలారజమ్మునన్.

ఈసున నన్నదల్చి బెదరించెడు రక్కసి గుంపు మధ్యనే
మాసము కంటె నిల్వను సుమా యని చెప్పెను జీవితమ్మునం
దాసయు గానరాని బహుళార్తినిఁగుందుచు, నిన్నె భక్తివి
శ్వాసములన్ దలంచుచు పవల్ నిశలన్ ధరణీజయున్ ప్రభూ! 586

కనుగవ నశ్రువుల్ దొనక క్ష్మాసుత పంపిన దయ్య్య నన్ను మీ
కును వినిపింపనామె పలుకుల్, మఱి నేనును వచ్చు వారితో
నను నెదిరించు దానవగణమ్ములఁదున్మితి నింద్ర జిత్తు రా
వణు తనయుండు నన్ను గొని బందిగ కొల్వునకేద్చు నుద్ధతిన్.

అనుజుడు నౌ విభీషణుడు నడ్డుగ వచ్చెను గాని రావణుం
డును నను జంపువాడె, దహనోత్కటవహ్ని రగిల్చి తోకకున్
నను విడువంగ కోపమున నాదనుజేశుని లంక సర్వమా
యనలుని పాలొనర్చితి నయా! నిలుపోపగ లేక నెమ్మదిన్.

నీకరుణావిలాస మది నిప్పులు జానకి యున్న చోటికిన్
బ్రాకగలేదు; తోకపయి వహ్ని లెగంబడి మండు చున్ననున్
నాకును మేనిపై నొకకణమ్మును వేడియులేదు, నేడు మి
మ్మికడఁజూచు భాగ్యము లభించిన ధన్యుడ నో ప్రభూ ! అనన్.

ఓనిరవద్య ధైర్య మహిమోన్నత! ఓ కపిలోక ధూర్జటీ!
దానవ భూమిఁజొచ్చి, వసుధాసుతఁజూచిన వార్త దెచ్చి, నా
ప్రాణము నిల్పఁగల్గిన మహాత్ముఁడ వంచును రాము డామరు
త్సూనుని కౌగిలించెను మధుస్మిత దీపిత సుందరాస్యుఁడై.

జానకి వార్తయుందెలిసె సైన్యము సిద్ధము సేయు తొందరన్
వానర నాథుడుండె, తనవద్దను సర్వసమర్థుడౌ మరు
త్సూనుడు గూడ నుండు శుభ సూచనలం దొక నూతనోత్సు కా
నూన మనః ప్రశాంతి మది నూల్కొనె రాముని కాత్మయందునన్.

దానవ నాథునిం దునిమి ధారుణిజన్ గొనిరాగ రామ భూ
జానియు తొందరన్ బడుచు స్వాంతమునన్ దన జైత్రయాత్రకై
వానర రాజు కా పగిది వార్తల నంపె, మహోద్య తోత్సుక
స్వానములన్ బొనర్చి కపివర్యులు హర్షమునన్ జెలంగగన్. 592

తక్కిన మూడు దిక్కులకు ధారుణిజం గన నేగి యామెనే
బ్రక్కను గానకన్ తిరిగి వచ్చిన వానరులున్ మరుత్సుతుం
డక్కడఁ జెప్పుచున్న కథ నంతయు, ఁబ్రీతిగ వించు చిత్తమం
దక్కజ మంది హర్ష వివశాత్ములు నై వినుతించి రాతనిన్.

జనకజఁజూచి వచ్చితిని, సర్వము దైత్యుని లంకలోపలన్
వినినది కన్నదెల్ల వినిపించితి నోప్రభు! మీరు రాకకై
జననియు వేచియున్నది నిశాటుల మధ్య నటంచు రాముల
క్ష్మణులకు భక్తి పూర్వక నమస్కృతులన్ బచరించె హన్మయున్.

ఆశ్వాసాంతము

దైతేయుని లంకకు మీ
దూతగఁ జని యతి వివేక ధూర్వహమతియై
వాతాత్మజుఁ డుర్విజఁ గని
యేతెంచి వచించిన కథ యిది రఘురామా!

దనుజులమధ్య దీనయగు ధాత్రిజ కూఱట గొల్పి వచ్చుచో
దనను వధింప పైఁబడిన దైత్యుల నుక్కడగించి లంకయం
దనలము బెట్టి కాల్చిన మహామతి మారుతి వీర గాథలన్
వినిచితి నిట్లు రామ! రస విస్తృత సుందర పద్యవిద్యలన్.

పరమ విహిత వీక్షా! భక్త రక్షైక దీక్షా
సరస మృదుల భాషా! చక్షు రానంద వేషా!
సురభయ పరి హారా! సూరి చేతో విహారా!
శరవిదళితవైరీ! సర్వలోకోపకారీ!

ఇది శ్రీ హనుమత్ప్రబంధము ద్వితీయ భాగమున
అశోకవన విధ్వంసము, ఆంజనేయుని బలవిజృంభణ, అక్షయకుమారవధ,
రావణుని కొల్వు, లంకాదహనము, హనుమంతుడు రామునకు సీత వార్త
దెలుపుట కథలుగల చతుర్థాశ్వాసము. 597

# శ్రీహనుమత్ప్రబంధము

## ద్వితీయ భాగము : పంచమాశ్వాసము

## రావణవధ- శ్రీరామపట్టాభిషేకము

శ్రీకాకుత్స్థాన్వయ నీ
రాకర కార్తికరమ్య రాకా సోమా!
ప్రాకట కోసల రాజ్య
శ్రీకర పట్టాభి రామ ! సీతారామా!

వానర సేన వెంట నడువన్ వనరాశిని దాటి లంకలో
దానవనాథు దున్మి , వసుధాసుత తోఁజను దెంచి గౌరవ
శ్రీనెగడన్, అయోధ్యనగరీప్రజ గొల్వగ, కోస లావనీ
మానితపట్టభాగ్యమహిమన్ గొను నీకథ యిద్ది రాఘవా!

దేవా అవధరింపుము.

### విభీషణుని శరణాగతి

ధారుణి జాత వార్తకు ముదమ్మును బొందియు రాము నాత్మలో
నూఱట గాన రాదు; పవనోద్భవుఁడుద్దతి దాటెగాక యా
వారిధి దాటు టెట్లు కపివాహినిఁ దోడ్కొని, యెట్టి చెట్టచే
కూరక ముందె యాపుడమికూతునుగన్గొను టెట్టు లంచునాన్.

సుగ్రీవుం డరుదెంచి సర్వజగతీ శూరుండ వీ చింతనా
వ్యగ్రత్వం బది యేల రామ! సమర వ్యాపార ధౌరేయ సా
మగ్రీ సర్వ సమర్థులుత్కట బలోన్మత్తుల్ రిపుధ్వంసకో
దగ్రుల్ వానరులుండ వార్ధి యొకలెక్కా యంచు వాక్రువ్వగా.

హనుమంతుండును వచ్చి మ్రొక్కులిడి, దైత్యాధీశు లంకాపుర
మ్మున ప్రాకారరహస్యమార్గ వివరమ్ముల్, దుర్గమ ద్వార బం
ధనిరోధమ్ము, లనేక కుడ్యచయ సంధా నాథ్వముల్ దానుఁ జూ
చినవెల్లన్ రఘు వీరులున్ విన వచించెన్ స్పష్ట వాక్యమ్ములన్. 602

శుభసంసూచనగా నభస్స్థలము నన్ సూర్యుం డు దాత్తుండు నౌ
నభిజిద్దీప్తముహూర్త కాలమున మఱ్ఱాడే కపి శ్రేణులున్
రభ సోద్వేగము తోడ వెంట నడువన్ రాముండు దర్పోల్లస
ద్విభవుండై చనె దక్షిణాంబుధి తటీ వీథిన్ మహేంద్రాద్రికిన్.

భీమాటోప విజృంభమాణ కద నాభీలాకృతుల్ వానర
స్తోమంబుల్, పదఘట్టి తావని రజస్తుంగా భ్రసంశ్రేణి భూ
ద్యోమార్గంబులఁ గ్రమ్మ నట్లు చని రత్యుగ్రార్భటుల్ మ్రోగ శ్రీ
రామక్ష్మాపతి కార్య నిర్వహణ ధౌరంధర్య పారీణులై.

చారుల్ శీఘ్రము వచ్చి దైత్యపతికిన్ సాష్టాంగముల్ వ్రాలుచున్
తీరమ్మందున వార్ధి కావల సమీర్ధీరుల్ కపుల్ లక్షలై
చేరన్ జూచితి మోప్రభూ యని వడిన్ జెప్పంగనే రావణుం
డారాటం పడె గుండెలోఁజొనిపినట్లై వాడి శూలమ్ములన్.

వానరుఁడొక్క- డేచి నలుప్రక్కలఁ జిచ్చులు బెట్టె లంకకున్,
వానర సేనతో నిటకు వచ్చి రఘూత్తము డేమి సేయునో
దానయి పోల్చఁ జాలని వితాకున మంత్రులఁబిల్చి కొల్వునన్.
దానవ నాథుఁడీ బెడద దాటు ను పాయముఁజూడు డీ యనన్.

దీమస మేపు మీఱు రణధీరనిశాచర వీరు లార్భటిన్
రాముఁడో! గీముడో! అసలు రాగలడా జలరాశి దాటి, తా
నేమటుమాయనైన పొగ రెక్కిన కోతులఁగూడి వచ్చినన్
మీమును ముందు మ్రింగెదము మేకొని వారినటంచు నార్చుచున్.

విభీషణుని శరణాగతి

పిడుగులటుల్ పదాహతుల పృథ్విని(ద్రొక్కు-చు, పండ్లు గీటుచున్
పిడికిలులన్ బిగించుచును బెబ్బులు లట్టుల బొబ్బలార్చుచున్
పెడసర మాటలన్ దితిజ వీరులు కారులు పల్కు-చుండగా
కడువడి వారికిన్ నడుమ కైజత మోడ్చి విభీషణుం డనున్. **608**

వినుమో దానవ నాథ! నీకెడద సంప్రీతిన్ ఘటింపంగ నే
ర్చిన వీ మాటలు గాని విల యార్చిష్మంతుఁ, డా రాముఁడ
న్నను లోకైక మహాధనుష్కుఁ డతనిన్ గాదంచు గాఱ్ఱువ్వు టె
వ్వనికైనన్ గొనితెచ్చుటే సకల విధ్వంసంబు చేఁజేతులన్.

అనుగుం దమ్ముఁడ నీదు సేమ మెద యందాసించి వాక్రుచ్చు నా
వినతుల్ విన్మిక యింత రామునకికన్ పృథ్వీజ నర్పించి యా
తని కారుణ్య ఫలమ్మునన్ మనుము నిత్యశ్రీలు దీపింపనాన్
విని దైత్యేశుడు తాడితోరగఫణా విర్భూత ఫూత్కారుఁడై.

ఛీ! పాపాత్ముడ! నీవిటుల్ పలుకగా సిగ్గైన లేదా త్రిలో
కీ పూజ్యుండను రామచంద్రు నెదుటన్ గేల్మోడ్చి నిల్చుందునా
పోపొమ్మంచు విభీషణుం దరిమె కొల్వున్ జేర వద్దంచునున్;
పాపస్వాంతులు స్వార్థులై యరయరున్ బాంధవ్యముల్ సైతమున్.

పరిభూతుండయి యావిభీషణుఁడు సద్భావుల్ సఖుల్ వెంట రా
శరణంచున్ పఱతెంచి రాము చరణాబ్జాతమ్ములన్ వ్రాలగా
కరుణాసింధువు రాముఁడాదరణ వీక్షావృష్టితో వానికిన్
శరణీయన్ వినిపించె నాతఁడును తాఁజన్దెంచు వృత్తాంతమున్.

కావలె నంచు రాముడడుగన్ వచియించె విభీషణుండు నా
రావణులంకలోని వివరమ్ములు సైన్యబలాబలమ్ములున్
ద్రోవలు సందు గొందులును దుర్గ నిగూఢ మహాయుధస్థలుల్
రావణమేఘనాదుల దురాసదమాయలు యుద్ధ వేళలన్.

మలిన జలమ్ములన్ మధుర మంజుల పద్మము పుట్టి కాంతిమత్
సలలిత రూప సంపదల సౌరభముల్ విరజిమ్ము నట్లుగా,
తులువల మధ్య సాధు చరితుండు విభీషణుడున్ జనించి ని
ర్మల చరితార్థుడై మనియె రామనృపాలుని యాశ్రయమ్మునన్. **614**

వారధి నిర్మాణము

శ్రీరాముండు పయోధి తీరము కడన్ జేరంగ, ఘోరమ్ముగా
తీరమ్మున్ దన వీచికాగ్రములతో దీంద్రించి కోరాడు నా
పారావారము గాంచి యీ జలధి సర్వం బెట్లు లంఘించెనో
ధీరుం డా పవనాత్మజుం డనుచు బొందెన్ సంభ్ర మాశ్చర్యముల్.

తనమార్గంబున కడ్డుగానగు సముద్యద్గర్వ రేఖా తరం
గనికాయోర్జిత నిస్వనోచ్చలిత దిక్చక్రావధిన్ వార్నిధిన్
గని శ్రీరాముడు వేడ సౌమ్యముగ మార్గం బీయగా, సాగరుం
డను కూలింపడు మానడున్ బటు తరంగారావ దర్పోద్ధతుల్.

వంచింపం బని లేదు వార్ధికనుచున్ భావించి రాముండు ప్రయో
గించెన్ నారిని తత్ప్రచండ ధను రాకీర్ణోగ్ర టంకారముల్
పంచారించుచు దిక్తటమ్ము లదరన్; వారాశి మర్త్యాకృతిన్.
వంచెన్ శీర్షము రాముముందు నిటులన్ వాక్రుచ్చుచున్ నమ్రతన్.

నీమార్గంబున కడ్డురా దగనయా! నిన్గాంచి యుప్పొంగి నా
నామోదంబున ; నేనెఱుంగుదును రామా! నీప్రయత్నమ్ములన్;
నామీదన్ రచియించి వారధిని సైన్యంబెల్ల పోవచ్చు వే
తే మార్గంబిక లేదటంచు నుడివెన్ శ్రీరాముతోఁ బ్రీతిమై-

జలతత్త్వమ్ము నెఱింగి నట్టినలుఁ గీశాధ్యక్షు డర్థింపగా,
నలవోకన్ నలు దిక్కులన్ తిరిగి యుద్దాంబైన పాషాణపం
క్తుల నావానర సేన లేగి కడకన్ దోడ్తెచ్చుచుండంగ నా
జలధిన్ సేతువు గట్టె నా నలుడు పెల్చన్ పంచరాత్రంబులన్.

నృత్యన్మంజుల హస్త తాళములతో, నిర్నిద్ర గీతాళితో,
ప్రత్యాలీఢపదమ్ముతో విజయ భద్రస్థైర్య ధైర్యంబుతో,
ప్రత్యక్షప్రమదమ్ముతో వన చరవ్రాతమ్ము లాలంకకున్
ప్రత్యాసారము లొప్ప వారిధిపయిన్ బర్వెత్తి రుద్రిక్తులై. 620

అదియున్ వారధి కాదు వార్ధిపయి, దైత్యాధీశు దుర్మంత్ర దు
ర్మద దుర్నీతికి మృత్యువేదిక; మహోద్యద్ధర్మ సంస్థాపనా
స్పద సంధానము; సర్వలోక హిత శశ్వద్రామ రాజ్యోదయ
ప్రదభాగ్యమ్మది యంచు దేవగణముల్ భాషించి రబ్రష్టలిన్.

వానరాసుర యుద్ధము

భానుమరీచికల్ పుడమి పైఁ బడువేళకు లంకమీదికిన్
వానరసేన వచ్చి పడె నన్నది చూడఁదలంచి మేడపై
దానవభర్త వైభవమదమ్మున నిల్చుటఁ గాంచిక్రుద్ధుడై
వానరనాథుఁడా యసుర పై వడి దూకుచు నొక్క గంతులో
వానిశిరమ్ముఁ దన్ని పడవైచె; పదంపడి యంగదుండు నా
దానవుఁగాంచి వాని దురితమ్ము వ చించి బలమ్మెలర్ప లం
కానగరీమహాసదము గ్రక్కున గూలిచి కాలి తాకుతో,
వానర సేన ధైర్యబల పాటవముల్ జవి జూపె నచ్చటన్.

అరయక ముందు వెన్క, లనికై నడపెన్ దితిజుండు సైన్యముల్;
ధరణికి శ్రేయమై యెసఁగు ధర్మవిధానము లొక్కవైపునన్,
ధరణికి కంటకమ్మయిన దైత్యవిధమ్మొక వైపునన్ జగం
బరయగ రామరావణమహారణ మైనది లంకలోపలన్.

పటుదుర్వా రబలప్రదర్శనధురా ప్రారంభసంరంభ మం
దటుల న్యోన్య జిగీష మీఱ సమరాహంకార సంభారము
ట్టుట లూగాడు పగన్ పెనంగుచును పోరం జొచ్చి రిర్వాగులు
త్కట రోషప్రకటోద్య తాహవ కళా దర్పంబు లే పారగన్.

కులిశ తోమర వాలాసి కుంత పరశు
నికర ముద్గర శూల మ్ము లొకరి వగుచు,
చరణనఖములు ఱాలు వృక్షమ్ము లొకరి
యాయుధమ్ములై యచటి యాహవమెసంగె. 626

తేజితబాణ హస్తులు ప్రదీపిత శౌర్యకళామహోల్లస
ద్రాజిత తైజసాకృతులు రాముడు లక్ష్మణుఁ డామరుత్సు తుం
డోజ బుజమ్ములం దిడి మహోత్సు కతన్ గొనిరాగ దైత్యుపై
నాజికి వచ్చి రుగ్రనయ నాకృతు లిర్వురు వచ్చి నట్లుగన్.

నాగబంధము

రాముడు లక్ష్మణుండుఁగపి రాజును తక్కిన వాన రాగ్రణుల్
భీమ పరాక్రమోగ్రులయి వీరవిహార మొనర్ప దానవ
స్తోమము లార్తులై వెనుక ద్రోవలు బట్టు టఁగాంచి యుద్ధమా
యామహనీయుఁడింద్రజితుఁడార్చుచు నేసెను నాగ బంధమున్.

ఎక్కడి వార లక్క డనె పృథ్విని వ్రాలిరి; రామలక్ష్మణుల్
చిక్కిరి నాగ పాశమున చేష్టలు దక్కుచు, హన్మ దాదులా
యిక్కము జూచి బెంగ వడి రేమియుఁదోచక యింత లోన దా
నెక్కడనుండియో దిగియెనేలకు వైళము వైన తేయుఁడున్.

ఉరుతర పక్షమారుత రయోచ్చలి తోన్నత పర్వతుండునై
గరుడుఁడు రాగ నాగపరికల్పిత బంధములూడె, రాఘవే
శ్వరుడును లక్ష్మణుం డఖిల వానరు లెప్పటి యట్ల లేచి; రా
గరుడడు రామలక్ష్మణుల కాళ్లకు మ్రొక్కుచు నేగె వెన్కకున్.

ఊఱక మేఘనాదుని మహోరగపాశము నాశమయ్యె నం
చారట మంది దానవమహారథు లీసున తేరు లెక్కి యే
తేరగ పోరి, కంతకు పదింతలు రోసము దూసి యుద్ధ కా
ర్యారభ మాణులై ప్లవగరాజును ముందిడి యేగి రా కపుల్.

తేరిన యుద్ధమాయ గడి దేరిన ధీరత రక్కసింపుచున్
బోరికి వచ్చి పాసి రసువుల్ దశకంఠుని సైన్యనేత, లా
వీరమహేశ్వరుండు రఘువీరుడు గూల్చెను కుంభకర్ణునిన్,
కారెను బోతు బోలు నతికాయుని గూల్చె సుమిత్ర సూనుడున్. 632

నిముసముగూడ ధైర్య మెదనిల్వని రావణుఁడింద్ర జిత్తుతో
సమయము వచ్చె నోతనయ సాగవికన్ మన మాయ లా రఘు
ప్రముఖుని చండచాప శరపంక్తుల ముందికలంక గావ నీ
సమధిక వహ్ని హోమ పటు శక్తి నిఁ జూపుము ప్రాపుగాననన్.

## సంజీవని

హోమము పూర్తిఁజేసినసము జ్జ్వల సత్త్వుఁడు, ధైర్య సాహస
స్థేమ మహోగ్రరూప పరిదీపిత శూరుఁడు, మేఘనాదుఁడు
ద్దామమహోర్భటిన్ సమరధారుణికిం జని యేసె మంత్రవి
ద్యామహనీయ శక్తి నొక దానిని మిన్నులు మీద బడ్డటుల్.

విస్తృత శక్తిమంత మతివేల మహోగ్రమునైన వాని బ్ర
హ్మాస్త్రము ధాటి కోడి కపులందరునేలకు వ్రాలి పోయి రా
యస్త్రము నందు గౌరవము నాత్మఁదలంచుచు రామలక్ష్మణుల్
నిస్తుల శౌర్య ధుర్యులవనిం బడి చేతన దక్కియుండగా.

హనుమన్ గన్గొని జాంబవంతుడు మహాత్మా నేడు మామేని జీ
వనముల్ నిల్పగఁజాలు దీవె యగు దప్పా! చూడు మారామల
క్ష్మణులున్ మూర్ఛిలి నారు, వేఱు విధమున్ గాన్పించ దాయోషధీ
ఖని శీతాద్రికి బోయి తేవలయు వేగమ్మొప్ప సంజీవనిన్.

కాలము లేదు మాటలకికన్, తొలి ప్రొ ద్దగుపించు ముందె శీ
తాలయ మేగి రావలయునం చనిలాత్మజుఁడు న్న పాటుగా
వ్రాలిన భక్తి మ్రొక్కి రఘు రామున, కాత్మఁదలంచి జానకిన్
తాలమహోన్నతుండు వియ దధ్వముపై కెగసెన్ జవమ్మునన్.

అని మొనఁగూలి రింద్రజితు నాయుధధాటికిఁ జిక్కి రామల
క్ష్మణు లని హర్ష నాదములు సల్పగ దానవ సైన్య ముక్కునన్,
వనచరముఖ్యు లొక్కొకరె వచ్చి దిగుల్పడి చూచి రామల
క్ష్మణులను, దిక్కుగానని వగన్ విలపించిరి నిస్సహాయులై. 638

ఆకాశమ్మున ఁదారకల్ సెదర, నాశాంతమ్ము లూగన్, జవో
ద్రేకప్రౌఢిమ నంజనాతనయుఁడు ద్దీపించి శీతాచల
ప్రాకారమ్ములు దాటి యోషధి నగ ప్రాంత మ్ములం జూచి, యే
యాకారమ్మున నెచ్చటైవెదకి దా నచ్చోట సంజీవనిన్-

వీకన్ ద్రవ్వి గ్రహించు తీరెఱుగకన్ విద్యోత దివ్యౌషధీ
శ్రీకప్రోజ్జ్వల రూపమై వెలుగు నద్రిన్ పాదమూలమ్ముగా
జేకొంచున్ దన హస్తమందుఁజనె నా శ్రీరాముడున్ లక్ష్మణుం
డేకష్టంబున నుండి రో యను తలం పేచన్ మదిన్ రాయిడై.

తొలిప్రొద్దున్ నునువెల్గు తూర్పుమల పైఁదోచన్ కపుల్ దిక్కులన్
గలయం జూచుచు నుండ నాతురతతోఁ, గన్దోయి మిర్మిట్లుగా
వెలుగున్ జిమ్ముచుఁగాను పించెను నభోవీధిన్ హనూమంతుడు
జ్జ్వల మౌ నౌషధ శైల భాగమొక హస్తమ్మందు నం దాల్చుచున్.

క్షతగాత్రుల్ మృత దేహులున్ మరల నాసంజీవనీ సన్నిధిన్
క్షితిపై నెప్పటి యట్ల లేచి రెలమిన్ స్మే రాననుల్ వానరుల్;
స్మిత రేఖాద్యుతు లాననాబ్జముల క్రొంజెల్వమ్ముల న్నింపు దీ
పిత తేజస్కులు రామలక్ష్మణులు సుప్తిన్ వీడి రు జ్జీవులై.

పారావారము నెల్ల భూరి జవసత్వ స్ఫూర్తి లంఘించి సీ
తారామామణిఁ జూచి వచ్చె; నొక చేతంబూని నేడీమహా
భారంబౌ నచలమ్ముఁ దెచ్చెనని యావాతాత్మజుం జూచి యీ
వీరుండుగ్ర మహేశ్వరుండని కపుల్ వేనోళ్ళ శ్లాఘించిరిన్.

తనవిజయమ్ము చాటు కొని తండ్రిని గూడి మహోత్సవమ్మునన్
దనరెడు మేఘనాదు నెడదన్ ములికింగొనలట్లు నాటె నా
వనచర హర్ష నాదములు; బ్రహ్మమహాస్త్ర మె పాడి దప్పెనా
యనుచు పునః ప్రయత్నము మహానల హోమముఁబూనె నాతఁడున్.

అకటా నేటికి నింద్ర జిత్తు విలు కాడై వచ్చె మామీదకీ
యెకసక్కెమ్ముల వేవొ చూచెదను నేడే యంచు యుద్ధోన్ముఖ
ప్రకటోద్యత్ప్రళయాగ్నివోలె వెడలెన్ రామాను జుం డుగ్రకా
ర్ముక మాహేశ్వర విక్రమక్రమధురా రోచిఃప్రభాపూర్ణుడై.

ఇంద్రజిత్తు వధ

అన్నకు మ్రొక్కి, చండధను రస్త్రములన్ భుజపీఠిఁదాల్చి శా
ర్యోన్నతుఁడా సుమిత్రతనయుం డనికేగ, విభీషణుండు నున్
మన్ననఁబిల్చి చూడుము కుమార! అదే, చను చుండె నింద్రజిత్
గ్రన్నన హోమ శాలకు నికన్ దడ వన్నది సేయ కూడదున్.

అతడాహో మము పూర్తిఁజేసి యెదురై యస్త్రమ్ములన్ దాల్చుచో
క్షితి నాతండవి జేయుఁడంచు నుడువన్ శీఘ్రమ్మె సౌమిత్రి యా
దితిజశ్రేష్ఠునిఁజూచి ఓయియసురా! ధీరుండ వేన్మైన చో మ
త్ప్రతి ఘాత మ్మెదిరింపు మంచు తన చాపమ్మెత్తి చూపించినన్.

పైకొని వచ్చుచుండిన యుపద్రవమున్ గ్రహియించి దానవుం
డాకొను సింగమై ధనువు నందు టఁగాంచి సుమిత్ర సూనుఁడ
స్తోక సహస్ర శీర్ష ఫణ దుర్దమ సర్పమహోగ్ర వృత్త్యాకృతిన్
గైకొని య స్త్ర మొందు త్రుటి కాలము ధ్యాన నిమగ్న చిత్తుడై.

రాముఁడు సత్యసంధుఁ, డపరాజిత పౌరుష పూర్ణ నిస్తుల
స్థేముఁడు, ధర్మవర్తన విశిష్ట చరిత్రుఁడె యేని యీమహో
ద్దామ శితాస్త్ర మింద్రజినిఁ దాకి వధించు ను గాక యంచు దీ
క్షామహితప్రచండతరశక్తిగ మంత్ర నియుక్తి నేసినన్.

ప్రాణము లేచి పోయి, తలపైఁగల రత్నమరీచికా శిర
స్త్రాణము డుల్లి, ఖండిత శిరస్కుఁడునైపడె మేఘనాదు; డా
బాణము చాపముక్తమయి పర్విన దెప్పుడొ నిర్నిరోధమై
దానవు నిన్ వధించిన విధ మ్మెపుడన్నది కానుపించకన్. 650

చాలడెవండుఁగూడ దనశక్తికి సంగర మం దటంచు ను
ద్వేల మదంబునం జనిన వీర వరేణ్యుఁడు మేఘ నాదుడుం
గూలెను యుద్ధమందనుచు గొంతులు బ్రద్దలు వోవు నట్లు గ
గ్గోలుగ నేడ్చిరా దనుజ కోటులు రావణు రాజధానిలో.

నమ్మగ వీలులేని వచనమ్మిది, నాథుఁడెటుల్ మహాగ్ని హో
మమ్మును వ్రేల్చు నిత్యనియమమ్మును మానును, లక్ష్మణుండు ధై
ర్యమ్మున నెట్లె దుర్చుఁగలఁడంచు సులోచన చిత్తమందెదో
యుమ్మలికమ్ముతో ఁజనిన దొయ్యన నత్తను జూచు గోరికన్.

కొడుకులు జచ్చి, యాకడుపు కోత భరింపగ లేక యేడ్చు రా
పడతియు కోడలింగనిన పట్టున గుండెలు వ్రీలు బాధ తో
నొడిపయి ఁజేర్చి పట్టుకొని యూఱట గొల్పను గాని వేదనం
బడి యురి యాడు నా తరుణి బాధల నార్పఁదరంబె యేరికిన్.

ఒకరిది పుత్రశోకము, మఱొక్కరి కయ్యది భర్తృశోకమై,
వికల మనస్కలౌచు విలపించుచు నొక్కరి చేతులందు వే
ఱొకరయి మాట లేక పడి యుండిన వేళకుఁ జేరె రావణుం
డొకదరి లేని వెంగడపు టూహల నచ్చటి కూగు లాడుచున్.

ఎఱుగక వారు ముప్పు రట నెవ్వరి నెవ్వరు పల్కరించుటో
నరిమురి జెందు చున్న సమయమ్మున ధైర్య మునూని దానవే
శ్వరు సతి లేచి చూచితివె ప్రాణపతీ! మన లంకలోన నె
వ్వరి ముఖ మందుఁజూచినను బాధయె దప్ప మఱొండు గానమున్.

సాధుచరిత్ర యౌ ధరణిజం జెఱఁబట్టిన వాడ వెట్టి స
మ్మోదమొగాని నీకదియు, పుత్రుల చావున కర్థి హేతువై
పోదిక ఖేదమెన్ని జనువుల్ చనినన్, మనకేమి? దుఃఖపున్
బాధల కాగలేని సుకుమారి సులోచన యేమి కావలెన్. 656

రాముఁడజేయ వీరుడు, ధరాసుత సీత పవిత్ర శీల సా
ధ్వీమణి, వారి యాగ్రహ మవేల దవానల కీలయే యగున్!
రాముని వద్దకుం జని ధరాసుత నిమ్మికనైన సీదు లం
కామహి నున్న వారు బ్రతుకంగల రోదను జాధిపా'' యనెన్.

మనసును చిక్క బట్టుకొని, మామకు నత్తకు మ్రొక్కుచున్ సులో
చన ''దశకంఠ! నీవవనిజన్ జెఱఁబట్టిన నాడె యింతలౌ
నని తెలియున్ పతివ్రత మహత్త్వమెఱుంగని రాజు వీవు, న
న్నునుఁజన నిందు నింద్రజితునుం బడి పోదు చితాగ్నియందనెన్.

వాకొనఁజాల కేమియును వారల నిర్వురిఁ జూచుచున్ మనో
వ్యాకులుఁడై దశాననుఁడు వచ్చిన క్రోవలఁబట్టె నెమ్మదిన్
శోకము కోపమై తనువుఁజూడెడి నెవ్వగ యూరుపుంబొగల్
బ్రాకిన కన్ను జంట లిరు ప్రక్కల నిప్పులు గ్రక్కు చూపులన్.

అనుదిన మగ్నిహోమ సవనాధిక దివ్యఫలంబుఁగొన్న వా,
డనిమిష నాథు దర్పము దగ్రత నుగ్రత దూల్చి నట్టి నా
తనయుని జంపె రాఘువుని తమ్ముఁడు వంచనఁజేసి, చూతు రా
యనుజుడు నన్నయున్ సమరమందిక రావణు నంచు నెంచుచున్.

మానస మందు కోప మవమానము ముందు కు క్రోయు తెంపునం,
బూనిన పంత మొప్పగ సముత్కట రోషకషాయ దృష్టులన్
దానవ నేత యాజ్ఞయిడి దైత్యచమూతతికిన్ సమీక సం
ధానమొనర్పుఁడంచు, నరదమ్ము నఁదానరిగెన్ రణోర్వికిన్.

సమరము నందు మొన్న రఘు సత్తము శస్త్ర మహోగ్ర ధాటికిన్
తుమురులునై రథమ్ము, తన ద్రోవను వెన్క కుఁబోయి నట్టి యీ
ప్రముఖుడు నేడిదే మరల వచ్చెను చూడు డ టంచు కీశ సై
న్యము లరు దెంచి రాహవ సమర్థులు రావణు పైకి పోరికిన్. 662

## లక్ష్మణుని మూర్ఛ

జ్యావల్లీధ్వని కుప్పరమ్ముగుల దైత్యాధీశుఁ డు(గ్రా(స్త్ర వి
ద్యావేశమ్మున నెల్ల చోటులకుఁ దానై వచ్చి దుర్దాంతమం
(త్రావిర్భూతమ హత్త్వశక్తిని సుమి(త్రా సూను పై వైవ చే
ష్టా విన్యాస మణంగి లక్ష్మణుఁడు మూర్ఛన్ మున్గె తద్ఘాతకున్.

వెఱచుచు వానరుల్ సమర వీధుల పర్వులు వెట్ట, సమ్మద
స్వరనినదార్భటుల్ సెలగ చచ్చెను చచ్చెను లక్ష్మణుండటం
చఱచిరి దైత్య సైనికు, లనంత విచారవిదీర్ణ చిత్తులై
యరిగిరి రాముడున్ ప్లవఁగు లాయెడ లక్ష్మణుఁడున్న చోటికిన్.

తనయొడి యందుఁ బెట్టు కొని తమ్ముని శీర్షము భోరు భోరునన్
పెనగొను శోకబాధ విలపించెను రాముడు, బంధు వర్గమున్
గననగు, భార్యనున్ బడయగానగు, దేశములందు గాని ల
క్ష్మణసముఁడైన సోదరుడుఁగానగ రాడని మాటి మాటికిన్-

అతిశయ మం(త్ర శక్తియగు న(స్త్ర హతిన్ స్మృతిఁదప్పె నీతఁడున్
మృతిఁగన లేదు; శీతల గిరీం(ద్రమునం గల జీవ నోషధిన్
వెతకుచుఁ దెచ్చినన్ (బతుకు నీతఁడ టంచు సుషేణుఁడున్ కపి
(ప్రతతికిఁ జెప్పి నంత రఘురాముడు హన్మనుఁజూచె నాదృతిన్.

జీవన దాతవోయి కపి శేఖర! లక్ష్మణ మూర్తి (ప్రాణముల్
గావగ పోవలెన్ హిమనగమ్మున కీవయి యన్న మా(త్రలో
పావని లేచి రామవిభు పాదములంటి మహోర యోద్ధత
(శ్రీ విభవమ్మొలర్ప నెగసెన్ విను వీధి కదృశ్య రూపుడై.

హనుమను దారి యందె హతమార్పగ వంచనఁ జేసి రావణుం
డనిపెను కాల నేమి యను నాతని, మాయల మారి మౌని యై
చని తన యాట లేమి యును సాగక మారుతి తోక దెబ్బకా
దను జుఁడె చచ్చె నేలఁబడి దానవనాథుని యాశ భగ్నమై. **668**

పడగ విప్పిన త్రాచు పరువెత్తినట్లు
చాప నిర్గతమైన శరమేగు రీతి
విను వీధి బడియేగు విద్యుత్తు పగిది
పావని చని తెచ్చె జీవనౌషధిని.

తూరుపుఁగొండ దారులను తోయజ బంధుని సంజ బంగరుం
జాఱలు గానరావు, హిమ శైలము చేరిన దెప్పు డౌషధిన్
ధీరతతోఁ బెకల్చి కొని తెచ్చిన దెప్పుడు కొండ పెల్లతో
మారుతి, సర్వమిద్ది పరమాద్భుతమంచు దలంచి రాకపుల్.

ఆరుచిరౌషధీ ద్రవము నాతని నాసిక యందు నుంచగా
స్మేరము ఖాబ్జుఁడై నిదుర మేల్కొని నట్లుగ లేచి లక్ష్మణుం
డారఘు రాముఁజూచి దెగటార్పుము నేడిక రాత్రి లోపలన్
క్రూరుఁడు రావణాసురుని ఘోరము లంతము నొందు నట్లనెన్.

వనధిని దాటి యేగి సతివార్తను దెచ్చె, హిమాద్రికేగి త
మ్మునకును జీవన మ్మిడెడు మూలిక దెచ్చెను హన్మయంచు నా
తనిఁ దన కౌగిలిం గొని కృతజ్ఞత తో కపిలోకశేఖరా!
అను కొను నంత కంటె మహి మాత్ముడ వంచు నుతించె రాముడున్.

ఎచ్చటి దైత్యులంక మఱి యెచ్చట నుండె హిమావృ తాద్రి యున్
తెచ్చిన యోషధిన్ మఱల తెచ్చిన చోటనె యుంచి హన్మయున్
వచ్చెను రెండు సార్లిటుల, వర్ణన కందని దివ్యశక్తి సం
పచ్చరితుండితండనుచు వందనముల్ పచరించి రాకపుల్.

వచ్చెనటన్న లక్ష్మణుఁడు శాతవహోశుగ చాప హస్తుఁడై
వచ్చెను యుద్ధధారుణి కవార్య బలోద్ధతి నంచు చారులున్
దెచ్చిన వార్తయున్ మెడకుఁ తెచ్చిన యుచ్చును బోలె దివ్యమం
త్రోచ్ఛ మహమ్ము లెం దణగి పోయెనొ యన్న విషణ్ణ చిత్తుడై- 674

ఆదశకంఠుడుం దన హృ దంతర వేదన తొందరింప మం
డోదరి వద్దకుం జని కడున్ వడి మానుము దేవి! నీవెతన్
సాధుగుణాఢ్యయౌ జనకజన్, రఘురాముని నేనెఱుంగుదున్
కాదన రాక పోవలె నికన్ విధి నిర్ణయి మీ దురమ్ము నం

దేది ఘటిల్లినన్ మది సహింపక తప్పదు; ఆయు వున్నచో
మేదినిపై రిపుప్రళయమే ఘటియింతును, కాదయేనినా
కాదళ దబ్జ లోచనుఁడె యాశ్రయ మౌ నను భర్త నామెయున్
పాదము లంటి వీడు కొలుపన్ నిలిచెన్ స్రవదశ్రు నేత్ర యై.

మచ్చర మేచి చేసిన యమానుష కృత్యము పంట ప్రోవుగా
వచ్చిన దీవిపత్తు, పరివారము పుత్రు లమాత్యు లెల్లరున్
చచ్చిరి; రావణుం డిరుదెసల్ కపి సేన రగుల్చు చున్న కా
ర్చిచ్చుల మధ్య తానె మిగిలెన్ వగలాగని గుండె మంటతో.

రక్షోభర్త కెడందలో, ఁగలఁచు నిద్రన్ జాగృతిన్ గూడ రా
మక్ష్మా జాని పరాక్ర మాకృతి యె; చంపం జాలు టో చచ్చుటో
లక్ష్యం బొక్కటి మాత్రమే మిగలి నట్లై లేచె నాతండు యు
ద్ధక్షోణీ విధ వేష భూషణ సమస్తాలంకృతి ప్రోద్ధతిన్.

మదరేఖ : ధైర్యోత్సా హుడు దర్ప
స్థైర్యోద్దాముడు సత్వో
దార్యుండైరణ ధాటీ
ధుర్యుండై చనె తోడ్తో.

విను వీధిన్ గనవచ్చె కేతన పటావిష్కార సాంద్ర చ్ఛవుల్,
వినవచ్చెన్ రథ పార్శ్వ కీలిత రణద్ఘ్వాన్యాస ఘంటాక్వణత్
క్వణ నిస్వానము, ఉత్తమాశ్వ పదరింఖా ఘట్టన ధ్వాన మా
దను జేశుం డవనీతల మ్మదర యుద్ధక్షేత్రముంజేరగన్. 680

అతడు మహాతపస్వి, జలజాసన వంశసముద్భవుండు, ని
ర్జితదివిష త్ప్రభుండె యయి చేయగ రానిపనుల్ పొనర్చి దు
ర్గతిఁగొనె నంచుఁ జాలిబడె రాముఁడు చిత్తమునందుఁ గాని యా
దితిజుఁడు చూడబోవఁడు మదిన్ బుధులాడెడు నీతి మార్గముల్.

తూరుపు గొండపై వెలుగు తో చిన యంత నగస్త్య సంయమి
ప్రేరణ రామచంద్రుఁ డొనరించి సమర్చలు భాను మూర్తికిన్,
సారథితోడు నిచ్చి దివిషత్ప్రభువంపిన దిగ్జయోజ్జ్వల
శ్రీరథమెక్కి యేగెరణసీమకు దివ్యమహః ప్రపూర్ణుడై.
ఆకాశమ్మొదు రేగి ఆకసముతో, అంభోది అంభోదితో,
వీకన్ భాస్కరు డేగి భాస్కరుని తో, వెల్లెన్గు లొండొంటి తో,
డీ కొన్న ట్లుగ పోరి రస్త్ర చయ ధాటీ పాట వోజ్జృంభితో
ద్రేకం బొప్పగ రామరావణులు సందీప్తోరు శౌర్యమ్మునన్.

అనికింజేరిన రామ రావణులు దర్పావేశ రౌద్రోగ్రకో
పను ల న్యోన్య జిగీషులై విడుచు ది వ్యాస్త్రాయు ధోదగ్ర సా
ధన లత్యూర్జిత పాట వోద్భవ మ హార్ద్రత్యమ్ము లొండొంటిపైఁ
జని భగ్నమ్ములు నయ్యె తత్కకల సంజాతాగ్ని నిండన్ దిశల్.

మన్నున్ మిన్ను చలించె, సాగర విజృంభ మ్మాగె, దిగ్జాలమా
పన్నం బయ్యె, కులాద్రులున్ వణకె, సర్వప్రాణి సందోహము
త్పన్నంబయ్యె, సమస్త లోక విల యోత్పా తోరు సంక్షోభము
త్పన్నం బైన విధమ్మునన్ నెగడ యుద్ధం బచ్చటన్ ఘోరమై.

చిచ్చులు గ్రుమ్మరింపఁగల చిచ్చుల కోలల నెన్ని యేసినన్
చచ్చియు చావడాయసుర, శస్త్ర నికృత్త శిరమ్ము లొక్కటన్
వచ్చి నిలంబడున్ మరల ప్రాణముతో, నిక నీదశాస్యుఁ డుం
జచ్చునె యెన్నఁడేని యను సందియముల్ గదలించె రాఘవున్. 686

ఏవలనైన వీనిని వధింపకఁదప్పదు నే డ టంచు సం
భావిత మంత్రపాటవము బ్రహ్మ మహాస్త్రము దీసి రాముడున్
రావణు నాభిరంధ్ర కుహరచ్ఛిదురమ్ముగ నేసె నేసినన్
రావణుడొక్క పెట్టున ధరాధరమట్టుల కూలెనేలపై.

భాసురదైత్యరాజ్యవిభవ ప్రథి తామల హేమరత్న సిం
హాసన భాగ్యమందిన దశాస్యుతలల్ తెగిపోయి మృత్యువి
న్యాసములాడసాగె రుధి రాపగలందునఁ దేలి పోవుచున్,
చేసిన పాప కృత్యము రచించిన విప్రతికార మట్లుగన్.

ఏదెసనుండి కన్నొలగి యేసెనొ యాతడు, రాము తన్వునం
దారశకంతు ముల్కి కొన లంటిన చోటుల నెల్ల నెత్తురుల్
జారులు గట్టి గ్రమ్మి వికసన్నవపుష్ప దశోజ్జ్వలమ్మునౌ
మోదుగ చెట్టు వోలె రణభూమిని పొల్చె రఘు ప్రవీరుడున్.

ధరణినిఁబుట్టి దానవుల దౌష్ట్యము లంతముఁ జేతు నంచు నా
సరసి జనేత్రుఁడున్ దమ కొసంగిన మాటను దీర్చె రాముఁడై
సరసత నిట్టు లంచు సుర సంఘము లెల్లరు హర్ష చిత్తులై
గురిసిరి పూల వానలు రఘుప్రవరున్ వినుతించు చర్మిలిన్.

రాముడు ధర్మ మార్గ పరిరక్షణ దక్షుడు, సత్యవాక్య దీ
క్షామహనీయ వర్తనుడు, సాధు జనాళి శరణ్యు డున్, జగత్
క్షేమవిధాయి దుష్ట జన శిక్షణ శౌర్య ధనుండు, జానకీ
రాముడు రాజిలెన్ విజయరాముడు సర్వజనాభి రాముడై.

విన్నను వొప్ప విభీషణు
డన్నకు సంస్కృతు లొనర్చి అసురావనికిన్
చెన్నుగ రాజ య్యె సుగుణ
నన్నుతుఁ డారామ మూర్తి సత్కారుణాప్తిన్. 692

## సీతకు అగ్ని పరీక్ష

హనుమంతుండును రాము నానతి నశోకారామ మందున్న సీ
తను చేరంజని మ్రొక్కులన్ నెఱపి మాతా! దుష్టుడారావణుం
డనిలోఁ జచ్చెను, రామలక్ష్మణులు నున్నారమ్మ యిచ్చోటనే;
వినఁగాంక్షించె రఘుప్రవీరుఁడును దేవీ! నీదు చిత్తమ్మనన్-
విని యాపల్కులు హర్ష సంభ్రమముతో పృథ్వీజ డగ్గుత్తికన్
హనుమా నీయుపకారమున్ మఱవలేనయ్యా, మనస్తృప్తిగా
నిను వర్ణింపగ మాటలున్ దొరకవున్ నీవేగి శ్రీరామ మూ
ర్తిని నేఁజూడఁ దలంతు నన్న దియుఁబ్రీతిన్ జెప్పు మయ్యా, యనెన్.

ధరణిజకున్ నిశాటవనితల్ త్రిజ టాదిగ వచ్చి, నూతనా
భరణచయాద్యలంకృతులు భాసిలఁజేయ విభీషణుండు దా
నరగున నేగి రాఘవుని సన్నిధి కామెను దెచ్చె; నశ్రువుల్
గురియుచు సీత రామునకు గూర్మి నమస్కృతిఁజేసి నిల్చినన్.

ఏయమ కోసమై వెదకి యేడ్చెనొ రాముఁడు కాననమ్ములం,
దేయమ కోసమై వనధి నెల్లను దాటి దశాస్యుఁజంపెనో;
ఆయమ వచ్చి నిల్చె తన యంఘ్రులయందని చూడఁబోడు, సీ
తా! యని ప్రేమతోఁబిలువ డారఘురాముడు మౌనమూర్తి యై.

జగము భరియంప లేని నిశ్శబ్ద భార
మావరించిన యచ్చోట నందరికిని
ఆకసముఁజీల్చి పడునట్టి యశనిపాత
మగుచు వినఁబడె శ్రీరాముఁడనిన మాట.

క్షితిజా! రాక్షసు వీట నుండుట యె నీశీలమ్ము సందేహసం
గత మీ వగ్ని పరీక్షఁదేల్చు కొను మీ కాడ్పాటు నంచచ్చటన్
జితిఁ బేర్పించెను రాముఁ డెల్ల కపులున్ ఛిన్నాత్ములై యీ జగ
న్నుత సాధ్వీమణి కా! పరీక్షయనుచున్ దుఃఖమ్మునన్ మున్గగా. 698

గునపమ్ముల్ దల మీద బాదినటు లాక్షోణిజ నిశ్చేష్టయై
యినవంశోత్తమ! రామ భూరమణ! నీవీ మాట నిచ్చోటికా
హనుమన్ బంపిన నాడె జెప్పినను నా ప్రాణమ్ములన్ వీడియుం
దును గాదాయని యేడ్చి, యేడ్చి, తన చేదోయిన్ దలన్ మోదుచున్.

ధృతధైర్యమ్మున నిల్చి "సంతతము నే శ్రీరామునే భర్తగా
మతి భావింతున యేని సాక్ష్యమిది నా మాంగళ్య మంచున్ జ్వలత్
చితి యందుంబడి యగ్ని దేవుని శుభాశీర్భిక్ష నర్థించె స
మ్మతి జిహ్వాగ్రమునన్ చవుల్ గొలుపు రామా! యన్న పల్కాడుచున్.

పూవుల బాటయయ్యె హుతభుక్ చటులోత్కట కీల జానకీ
దేవికి; సీత ఉత్తమ పతివ్రత సాధు చరిత్ర యంచు నా
పావకు దివ్య రూపమట వచ్చి కృపాళుఁడు రామమూర్తికిన్
దీవన లిచ్చి యిచ్చె పరిదీనముఖాంబుజ సీత నాదృతిన్.

విచ్చిన కన్నులన్ మనసు విచ్చిన మోమున రామచంద్రుడున్
వచ్చిన సీతపై జిలుగు వన్నెల వెన్నెలలైన నవ్వులన్
గ్రుచ్చి కవుంగి లించె నెనరుల్ తనరారగ బాహు వల్లరిన్;
త్రచ్చిన వెన్నలా మదిని దాచిన కూర్ములు తీయ తావులై.

మావినతుల్ దయన్ వినుచు మాకల నాడిడి నట్టి మాటగా
రావణుజంపి ధర్మపరి రక్షణఁగూర్చితి వోయి రామ! నీ
వా విలసద్వికుంఠ నిలయప్రభు వర్యుడ వంచు భక్తితో
దేవతలై నభస్థలి నుతించిరి లోకము లెల్లనున్ వినన్.

ముని లచ్చోటికి నేగుదెంచి రఘురాముంజూచి యాక్రూరదై
త్యుని లంకేశు వధించి తీవెవరవీ యుర్విన్ మహాత్మా యనన్
వినతుండై యతఁడేను రాముఁడను పృథ్విన్ కోసలాధీశు పు
త్రు నటంచున్ వచియించె; నున్న తులకెందున్ గల్గునే గర్వముల్. 704

ఎఱుగుదు నేను సీత! మఱి యెల్లరెఱుంగగ నీదు శీలమున్
జరిపితి నీపరీక్ష నని జానకి మోమును జూచె రాముఁడా
యిరువురి కన్నులన్ పొరలి యేరులు గొన్న జలమ్ములున్ పర
స్పర మధు రాను రాగ రస బంధుర భాషణ లయ్యె నాయెడన్.

తొనకెడు కూర్మిమై దశరథుండును భూమికి డిగ్గి కోడలిన్
దనయులఁగాంచి దీవన లొసర్చెను, నాకవిభుండు వచ్చి చ
చ్చిన కపిసేనకున్ తిరిగి జీవనమిచ్చి, నుతించె రామునిన్
దనదు ప్రతిజ్ఞలన్ నెఱపి దానవ దౌష్ట్యముఁదూల్చి నందుకున్.

త్వరగ నయోధ్య కేగి తన తల్లులఁజూడఁదలంచి వేగమా
యిరవున నున్న పుష్పకము నెక్కిన రాముని చేయి యూతగా
ధరణిజయెక్కె, నెక్కిరిని తక్కిన వారలు, ఆంజనేయుఁడా
ధరణిసుతారఘుప్రభు పదమ్ముల వద్దకు వచ్చి కూర్చొనెన్.

వనులకుఁదాము ముగ్గురును వచ్చిన యాపదు నాలుగేడు లున్
చనిన ప్రదేశమెల్ల గగనమ్మున నుండియె వారు చూచుచున్
గని రది సర్వమొక్క కలగా ఁదలపోయుచు నింత లోనదా
పునని యయోధ్య యున్ గనుల ముందుగఁ గానగనయ్యె విందుగా.

విమానము: ఆపుష్ప కారూఢుఁ డౌచున్
దీపించు తేజోము ఖుండై,
భూపుత్రి పాల్వార ప్రక్కన్
ప్రా పౌచు, రాముండు నేగెన్. 709

## శ్రీరామ పట్టాభిషేకము

పరువుల్ బెట్టుచు నేగి మారుతి యుఁదెల్పన్ రాము డేతెంచుటల్
భరతుండున్ దన తల్లులంగొని భర ద్వాజాశ్ర మమ్మందు సో
దరు రాముంగని మ్రొక్కి తోడ్కొని యయోధ్యం జేరె నా పౌరులం
దరు రాజోచిత రీతి స్వాగతము లుత్సాహమ్ముతో సల్పగా.

పురమందున్ మణి దీప తోరణ కళామోదమ్ము శోభిల్లె, వా
నరులున్ పుణ్యమహానదీ జలములన్గ్రొ కొంచు నేతెంచి రా
మఱునాడే సుముహూర్తమై సకల సామంతుల్ మునుల్ బాంధవో
త్కర మేతెంచిరి కానుకల్ గొనుచు సత్కారార్హ మర్యాదలన్.

విలసత్ కోసల రాజ్య పట్ట పదవీ విద్యోత దీక్షా న్వితుం
డలరెన్ రాముఁడు జానకీ సహితుడై; ఆ చార్యుడా శ్రీవసి
ష్ఠులు చేయించిరి వేద శాస్త్ర విధి వత్ సూత్ర ప్రకార క్రమం
బలరన్ శ్రీరఘు రామమూర్తి కెలమిన్ పట్టాభిషేకమ్ములన్.

నిర్మలాశయసార నిజవర్తనాచార
నిహిత మానవ ధర్మ నియమ పరుడు,
ధారుణీ పాల నాధార శాస్త్ర న్యాయ
మార్గాచరణశీల మాన్యమూర్తి,
సర్వజనామోద సత్య వాక్పరిపాల
నాశయోదార జిహ్వాంచలుండు,
దురితకర్మోన్మాద దుష్ట శిక్షణ కార్య
సామర్థ్య పౌరుషాస్పదుడు నగుచు,

సకల జన భాగ్య సంక్షేమ సౌఖ్యరాజ్య
సార్వ భౌమత్వ కీర్తి ప్రశస్తిఁదనరి,
రామ రాజ్యము భువిని స్వారాజ్య మనగ,
రమ్యసద్గుణ ధాముఁడా రాముఁడలరె. **714**

భూమి సమస్తమున్ సిరులు పూచిన భాగ్యము హేమహోల్లసత్
శ్రీ మహితమ్ముగా నెగడె శ్రీరఘు రామ మహీశు పాలనన్ ;
రాముఁడె దేవుడయ్యెను, ధరాప్రజ కెల్లను; సర్వ కాలర
క్షా మహదాశయ మ్మను ప్రశస్తి గడించెను రామరాజ్యమున్.

తప్పక సత్యధర్మములు ధాత్రిని మానవ నైతికాశయం
బొప్పుగ జూప గల్గిన మహోత్తమ మార్గముగాఁ దలంచుచున్
చెప్పిన రామచంద్రు కథ చెప్పు కొనున్ జగమెల్ల ఁబ్రీతితో
నెప్పటి కప్పుడే యెడద కింపుగ తీయము లూరు వాచవిన్.

వానర నేతకున్, సభకు వచ్చిన యెల్లరకున్ బ్రియమ్ముగా
గానుకలిచ్చె స్నేహవచన ప్రమద మ్మలరార రామ భూ
జానియు; స్వీయకంఠ విలసన్మణి సుందర హార మామరు
త్సూనున కిచ్చె సీత మనసున్ వెలి బుచ్చిన హర్ష రేఖగా.

''జే'' యనుచున్ బురప్రజలు చేతులు మోడిచి నిల్చి సన్నుతుల్
సేయగ, నుత్సవమ్మునకుఁజేరిన మౌనివరేణ్యులున్ జగత్
శ్రేయము సేయఁగల్గు నృపశేఖరు నిన్నునుఁ జూచినాము రా
మా! యని దీవనల్ సలిపి రా రఘురామునకున్ మహీజకున్.

హనుమంతుడు జానకీ రాములను స్తుతించుట

ఏకలలంగరంగి మఱి యే పర మార్థము లూహసేసెనో
యాకపిలోకధీమహిముఁ డంజన గర్భము తత్తపః ఫల
శ్రీకమనీయతల్ విరియ ఁజిమ్మిన వామహనీయమూర్తి కన్
ఱేకులలో ధరిత్రిజయు శ్రీరఘురాముల దివ్య రూపముల్.

రామస్వామియు సీతయున్ మహిత సామ్రాజ్యాసనాసీన శో
భామర్యాదల నందుటల్ గనుచు భాస్వద్భంధు రానందవీ
క్షామంద చ్ఛవు లేచు గద్గదిక తో సామీరి తత్కీర్తిరే
ఖామాహత్మ్యములన్ స్తుతించె చెలువొల్కన్ మాధురీ సాధువుల్. 720

శ్రీరము వంశ చంద్రు న, కశేష జగ త్పరిపూజ్య ధర్మసం
చారునకున్, ననుంగనెడి స్వామికి, రామునకున్ నమస్కృతుల్;
సార వివేక సద్గుణ విశారద కుత్తమ శీల సాధ్వి కా
ధారుణి జాత సీతకు, మదంబకు నిత్యము నానమస్కృతుల్.

ఏతన్మాత్రులె నీవు సీతయును లోకేడ్యుల్, జగత్సర్వర
క్షాతాత్పర్యులు, నేత్ర పర్వ సుషమాంచ ద్విగ్రహుల్, చిత్కళా
జ్యోతిర్మంగళ మూర్తు లిర్వురును ప్రేమోన్మేష వీక్షామధు
స్ఫీతా బ్జాస్యులు భక్తలోక శరణుల్ శ్రీరామ చంద్రప్రభూ!

చపల స్వాంతుని చేరదీసి నిగమ స్వారస్య విద్వత్ సుధీ
విపులార్థమ్ముల సారసంపద మనో వీథిన్ గనం జేయు జ్ఞా
నపదార్థ స్ఫురణమ్ముం దెల్పిన మహానంద స్వరూపమ్ము, నీ
వపరోక్షమ్ముగ నిల్చితీ జనువు ధన్యంబౌనటుల్ రాఘవా!

భూవలయమ్మునన్ భవ దపూర్వ మ హా మహిమప్రధానగా
థావళి నెచ్చు టెచ్చుట సమాదరరక్తి వరింతు రావచః
శ్రీ విమలస్థలమ్మున వసింపగ ని మ్మొక మూల నైన న
న్నో వరదాన దివ్య విభవోదయ! దాశరథీకృపానిధీ!

అది యీ నాటిది కాదు రామ పృథి వీంద్రా! ఏపురాజన్మసం
పదుపానీతమొ లోక పూజ్యుఁడవు నీ పాదాబ్జ సంసేవనా
స్పద భాగ్యమ్మిది యిట్లె మీచరణ పూజల్ సేసి జీవింప నే
ర్చెద స్వామీ! భవదంఘ్రి పీఠమె మదాశీరక్షతల్ వోయుతన్.

అని శ్రీరామునకున్ ధరిత్రి జకు భక్త్యావేశ బద్ధాంజలిన్
వినమత్ శీర్షుఁడు నౌ మరుత్తనయునిన్ వీక్షించి సభ్యుల్ జయ
స్వన సంస్తోత్రము లేక కంఠమున హర్ష స్వాంతులై చేసి రీ
హనుమంతుం డితడెంతవాడు భువి నాహా! యన్న యావేశులై. 726

వరజన్ముం డురు సాహసుండు శ్రుతివిద్వద్వార్ధి పారంగ తుం
డరిలోకప్రళయుండు, రామ పద పూజాసక్తు, డౌదాత్య స
చ్చరితుం డుత్తమ కార్యదీక్షితు డుదంచ ద్బ్రహ్మతేజో మహో
ద్ధుర దీవ్యద్వద నాంబుజుండు, హనుమంతుండన్న సామాన్యుడే.

కలిగె మేలిమి వన్నె బంగార మందు
పద్మ రాగ సంయోగ సంప ద్ప్రశస్తి
హనుమయును కథా నాయకు డైన కృతికి
రాముఁడు ను కృతి భర్తయై రాజిలంగ.

మధ్యాక్కఱ. ధారుణి పద్మనేత్రు నవ తారము రాముడు బుట్టె
వీరమహేశ్వరాంశ కపి వీరుడు ఆంజనేయుడును;
కారణ జన్ములై భువనకంటకులన్ బరి మార్చి
ధీరత ధర్మరక్షణము తేకువ జేసి రిర్వురును.

ఈయతులప్రభావమహనీయ కృతిన్ రసరమ్య రీతులన్
వ్రాయగ నేనెవండను కృపామధు రామృత వీక్షణాయత
శ్రీయుత మూర్తులా యిరువురిచ్చిన ఆశిష భాగ్యరోచిర
ధ్యాయ మనోజ్ఞకావ్య గుణమై విలసిల్లెను గాక ప్రీతిగా !

ఆశ్వాసాంతము

ధీరత మీఱగా జలనిధిన్ పృథు వారధి గట్టి లంకకున్
జేరి, దశాస్యునిన్ పరమ నీచుని రావణదైత్యుఁజంపి, యీ
ధారుణికిన్ శుభమ్మొనరు ధర్మము నిల్పిన నీకథన్ వచ
శ్శ్రీరమణీయ పద్ధతి రచించితి దాశరథీ దయానిధీ. 731

మారుతి సత్కథా గ్రథన మంజుల కావ్యకృషీవలత్వమో
శ్రీరఘు రామ! నీ చరణ సేవన భాగ్యము; మత్కవిత్వ ధా
రారుచిర ప్రసిద్ధ రసరమ్యముగా సురధేను వైపయో
ధారలు పిండి నాబ్రతుకు దారుల నన్ జరితార్థుఁ జేయుతన్.

ప్రాకామ్యమ్ముగ నీపదాబ్జయుగ సేవా ధర్మ నిర్వాహ సు
శ్లోకుండంజన సూతి గాథయిది, సంస్తుత్యప్రథాసాహితీ
శ్రీక ప్రౌఢి రచించి నాడ నిను నర్థిన్ స్వామిగాఁజేయుచున్
చేకొమ్మీ కృతి రామ చంద్ర భవదాశీ ర్వైక్య మందించుచున్.

అమలోదాత్తము రామ నామ జప మర్యాదమ్ము, వే దార్థసూ
త్రమహోపజ్ఞము, శైవతేజము , రిపూగ్రంపశ్య సత్వమ్ము, భ
క్త మనోభీష్ట ఫలోపపన్నము, దిగంత వ్యాప్త సత్కీర్తి ర
మ్యము విన్పించితి నాంజనేయు కథ రామా! నీకు శుశ్రూషగన్.

మంగళ మహశ్రీ

శ్రీ కరము నై వెలయు ప్రేమరససంకలిత
సీధు కణ పూర్ణ మృదు వీక్షా,
భీకర మహాదురిత భేషజ నిశాటకుల
విక్రమ బలచ్ఛిదుర దీక్షా,
ప్రాకట కృపామధుర భావ విభవోపకృత
భక్తజనజీవన సు రక్షా,
శ్రీక నవశారదిక శీతకర కాంతి నిభ
శ్రీ విభవ మంగళ మహశ్రీ. 735

గద్య

ఇది శ్రీ భారతీకరుణాకటాక్షలబ్ద కవితా విశేష
హరితసగోత్రపవిత్ర రత్నమాంబా సత్రాజామాత్య పుత్ర
కవిశేఖర, మధురకవి, కవిభూషణ, భారతీప్రసన్న, అభినవ పోతనేత్యాది
సద్బిరుదాంచిత, బుధజనవిధేయ సుబ్బారాయ నామధేయ ప్రణీతంబైన

శ్రీ హనుమత్ప్రబంధము ద్వితీయ భాగమున
వారధి నిర్మాణము. లంకా ప్రవేశము. వానరాసుర మహా యుద్ధము
నాగ బంధము-సంజీవని, ఇంద్రజిత్తు వధ, లక్ష్మణుని మూర్ఛ - సంజీవని,
రామ రావణ మహాయుద్ధము, రావణ వధ, సీతకు అగ్నిపరీక్ష
శ్రీరామ పట్టాభిషేకము, రామరాజ్యము,
హనుమంతుడు శ్రీరామునిస్తుతించుట.
అను కథలుగల పంచమాశ్వాసము. **736**

హనుమత్ప్రబంధము సర్వము సంపూర్ణము
ఓమ్‌తత్‌సత్.